# తలనొప్పికోసం ఎన్నో వాడి చూశాను

—ఫిల్మ్ హీరో.

కడకు విలన్ని వదిలి
నా తలపైనే కరాటే
దెబ్బలేసుకున్నా!

**అయితే నిజంగా పనిచేసేది ఒక్కటే!**

## సారిడన్

ట్రేడ్ మార్కు 'రోష్'




శక్తివంతమైనది, సురక్షితమైనది. ఒక్కటి వేసుకుంటే చాలు.

HTB-RPL-9321

మీరు
పెళ్లి చేసుకున్నారా?
ప్రేమించుకోబోతున్నారా?
ప్రేమించుకుని దూరమయ్యారా?

మీలో ప్రతి ఒక్కరికీ
మనోదర్పణం...
గిరిజా కళ్యాణం
నవలా రచయిత్రి
యద్దనపూడి
సులోచనా
రాణి
సరికొత్త నవల
ఋతువులు
నవ్వాయి
రూ. 20/-
వెంటనే కొని చదవండి!

మళ్లీ మళ్లీ చదవాలనిపించే
నవల కొబట్టి అరువు తెచ్చు
కోకండి! అరువు ఇవ్వకండి!
ఇది ఎమెస్కో వారి ఉవాచ!

ప్రతులకు:
ఆంధ్రప్రదేశ్
బుక్ డిస్ట్రిబ్యూటర్స్
3237, రాష్ట్రపతిరోడ్
సికిందరాబాద్-500003





### వజ్రోత్సవ సంచిక

ది. 16–9–83 వినాయక చవితి వజ్రోత్సవ సంచిక ఒక వజ్రపు తునకగా మిగిలిపోతుంది. ముఖ్యంగా ముఖచిత్రము వర్ణనాతీతము. ప్రముఖుల సందేశాలు కూడా వాస్తవానికి దగ్గరగా వున్నవి. భవిష్యత్తులో తెలుగు పాఠకలోకములోనికి మరింతగా యీ పత్రిక చొచ్చుకుపోగలదు. 13కథలు, 3 సీరియల్స్, 55 వ్యాసాలు లేదా శీర్షికలు ప్రచురించి వాటిని పాఠకలోకానికి మెచ్చేవిధంగా అందించిన ఘనత ఆంధ్ర సచిత్ర వారపత్రికకు దక్కింది.

పులవర్తి నాగవెంకట సత్యనారాయణ(గొల్లపూడి)

* * *

ఆంధ్రసచిత్ర వారపత్రిక వజ్రోత్సవ సంచిక చూచిన మరుక్షణం నుంచి ఈ వుత్తరం వ్రాద్దామని వుద్దేశపూరితుడునైనాను. కారణం ఏమంటే, నాకు ప్రస్తుతం 48 సం॥. నేను నా చిన్నతనంలో భారతి, గృహిణి, ఆంధ్రపత్రిక మంచి గ్లేజు పేపర్లలో అచ్చు వేయడం, మంచి చిత్రాలలో కూడా వున్నవి చూచి చదవడం జరిగింది అప్పుడు వాడిన గ్రాంధికపరమైన భాష తిరిగి ఈ రోజుల్లో చూడడం నాకు ఎంతైనా ఆనందం కలిగించింది. మీ పుస్తకం 75 సం॥ ఆంధ్రపత్రిక జీవితానికి ఈ రోజుల్లో వారికి నిజంగా ఒక దర్పణం. అది మీలాంటి ప్రచురణకర్తలకే చెందునేమో అనిపిస్తుంది.

ఈ రోజుల్లో చవకబారు హాస్యం, అంతుపట్టని అసహ్యంతో కూడుకున్న భాషతో నిండివున్న మన తెలుగు పత్రికలకు ఒక కనువిప్పు (మీ పత్రిక చూచి అయినా) కలుగుతే నిజంగా సంతోషం. కాని అలా జరుగదు.

రచయిత 'శారద'గారి ఒక చిన్న కథానిక ప్రచురించితే బాగుణ్ణు మీరు కథలు, వ్యాసాలు (ఇంకా వుంది) యన్నదానికంటే పూర్తిగా ప్రచురించితే మాలాంటివారికి ఆహ్లాదకరంగా వుండును.

మీ పత్రికలో ఒకటి బాగున్నది యని అనడంకంటే, అన్నీ బాగున్నాయి యని అనడం అతిశయోక్తి కాదేమో! మీకు, ఈ ప్రచురణకు సంబంధించిన యావన్మందికీ నమస్కారములు.

ముద్దుగారు వెంకట్రావు (విశాఖపట్నం)

* * *

కమ్మ మహాజనసభలను గురించి వ్రాస్తు ప్రముఖులైన కమ్మవారి ఫొటోలు (కొత్తా రఘురామయ్య, యార్లగడ్డ శివరామకృష్ణ ప్రసాద్, చల్లపల్లి జమీందారుగారు, ప్రస్తుత ముఖ్యమంత్రి, డా॥ నాయుడమ్మ, శ్రీ నార్ల వెంకటేశ్వరరావు మొ॥) కూడా ప్రచురించితే ఇంకా బాగుండేది.

పి. రంగారావు (దుర్గాపూర్)

* * *

భారతి ముద్దుబిడ్డ మన
పత్రిక రూపము దాల్చి వచ్చి యిం
పారెడు జ్ఞాన సంపదల
పల్వురికిన్ వెదజల్లి సాహితీ
కారులఁజేసి దీరతన కావిడె
వజ్రపుటుత్సవాలకున్;
నూఱును వేయి యేండ్లు
యిలనొప్పగ వర్ధిలజేయు యీశ్వరా!

బి. ఎస్. రాజు (మదరాసు)

* * *

ఆశించినదానికంటే ఎక్కువ పేజీలతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక 'వజ్రోత్సవ సంచిక' సర్వాంగసుందరంగా, చేతికి నిండుగా, కంటికి విందుగా ఉంది. కొన్ని వ్యాసాలు, పాత కథలు ప్రచురించి 'ఇంకా ఉంది' అని మధ్యలో ఆపివేశారు. అలా కాకుండా పూర్తిగా ప్రచురించి ఉంటే కేవలం విశేష సంచికలను మాత్రం భద్రపరిచేవారికి ఉపయోగకరంగా ఉండేది.

కోనే నాగ వెంకట ఆంజనేయులు
(విశాఖపట్టణం)

### నాకో నీడ కావాలి

మేనక ముఖచిత్రంతో వచ్చిన పత్రికలో ''నాకో నీడకావాలి'' కథ చాల బాగుంది. కథను వాస్తవికతకు ప్రతిబింబంగా రచయిత్రి చక్కగా మలిచారు.

బిరుదరాజు సతీష్‌కుమార్ భట్ (కాజీపేట)


పై వారమే
దసరా
సంచిక
ప్రత్యేక
కార్టూన్‌లు
వ్యాసాలు
వెల మామూలే!

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాథుని

వాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :

[1938–1972]

శుక్రవారం : 14–10–'83

రుధిరోద్గారి నామ సం. ఆశ్వయుజ శు. అష్ట

సంపుటము 76 సంచిక 5

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

విడి ప్రతి వెల రు. 1-50

ఆరు మాసాల చందా రు. 42-90

పోస్టులో ఏడాది చందా రు. 85-80

ఆంధ్రపత్రిక కార్యాలయము,

గాంధీనగరం. విజయవాడ-520 003.


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :

నటి శ్యామలగౌరి

(ఫోటో : కాజాస్)

కథలు :



సీరియల్ నవలలు :



వ్యాసాలు, శీర్షికలు :



## లోకంపోకడ – ఊమెన్



# అన్ని కాలాలకీ అన్ని అవస్థలకీ పనికివచ్చే సత్యమా?

మాజీ ఫిలిప్పయిన్స్ కేంద్ర శాసన సభ్యుడు నినోయి అక్వినో మూడేళ్ల పాటు అమెరికాలో ''అరణ్యవాసం''లో ఉండి ఇంటికి తిరిగి వస్తున్నాడు. స్వదేశానికి వచ్చి అక్కడ ఫెర్డినాండ్‌మార్కోస్ పాలనని ఎదిరిద్దామని ఆయన అనుకున్నాడు. మనిలాకి తిరిగి రాగానే మార్కోస్ రక్షకభటులు ఆయనని విమానంలో నుంచి బయటికి తీసుకువచ్చారు. మెకానిక్ వేషంలో ఉన్న ఒక వ్యక్తి అక్వినోని విమానం దగ్గరే కాల్చి చంపేశాడు.

జోషువా ఎన్‌కోమో కూడా కావాలనే తన దేశాన్ని వదులుకుని లండన్‌లో అయిదు నెలల పాటు ''అరణ్యవాసం'' చేశాడు. మళ్లీ తన స్వంత దేశమయిన జింబాబ్వేకి తిరిగి వచ్చాడు. ఇంకా ప్రాణాలతోనే ఉన్నాడు. ఎంత కాలం అలాగ ఉంటాడో చెప్పలేము.

ఇదంతా దూరదేశాల సంగతి. మన పక్క దేశంలోనే ఒక నియంత ఉన్నాడు. సినిమాలోని విదూషక నియంతలాగ ఉంటాడు ఈయన. ఈ నియంత ఎవరు? మహమ్మద్ జియా–ఉల్–హక్. అయిదేళ్ల కింద అధికారంలోకి వచ్చాడు, వచ్చి తన మాజీ యజమాని భుట్టోని చంపించి వేశాడు. ప్రస్తుతం జియా గొడవలలో ఉన్నాడు. అంటే ఆయన విరోధులు తమ మెడలని తడుముకు చూసుకోవాలన్నమాట.

పయి మూడు ''ఉదాహరణ''లలోనూ ఒక అంశం బాగా కనిపిస్తుంది. రాజకీయ ప్రత్యర్థులని హత్య ద్వారా తొలగించటం. మార్కోస్ మనుషులు అక్వినోని చంపారు; జియా మనుషులు భుట్టోని ఖూనీ చేశారు; ముగాబె మనుషులు ఎన్‌కోమోని చంపటానికి సన్నద్ధులవుతున్నారు. అందరూ నియంతలే. ముగాబె ఒక రౌడీ. ఆయనకి సోవియెట్ అనుగ్రహం ఉంది. పయి ముగ్గురూ హత్య ద్వారా రాజకీయాధికారాన్ని పెంచుకునే రకమే.

ముగాబె, మార్కోస్‌లు క్రయిస్తవ మతానికి చెందినవాళ్లు. జియా తనొక ముసల్మానునని చెప్పుకుంటాడు. ఒక సౌదీ అరేబియా పత్రికతో జరిపిన ఇంటర్‌వ్యూలో ఆయన ''ఇస్లామ్ విలువలని బలవంతంగా నోట్లోకి కుక్కుతా'' నన్నాడు. అదే పని చేస్తున్నారు ముగాబె, మార్కోస్‌లు తమ తమ దేశాలలో. ముగాబె క్రయిస్తవుడని అన్నారు కాని ఆయన నిజానికి కమ్యూనిస్టు. కమ్యూనిజమ్ కూడా ఒక మతమే కదా? బలవంతంగానయినా సరే ఆ మతానికి మారుద్దామనుకుంటారు కదా ఆ మతాభిమానులు.

సిద్ధాంత నిర్మాణాలని అవలంబించే సమాజాలు మూసుకుపోతాయి. ఇటీవలే ఆర్గనయిసర్ పత్రికలో రామ్ స్వరూప్ ఈ సంగతినే వివరిస్తూ ఒక వ్యాసం రాశాడు. ఇలాంటి మూసుకుపోయిన సమాజంలో ప్రతిపక్షాలకి అవకాశం ఉండదు. ప్రతిపక్షం అంటే రాజకీయాలలోనే కాదు— సిద్ధాంతాలలో, నైతిక విలువలలో, చివరికి సంఖ్యాబలంలో వ్యతిరేకతని సహించరు నియంతలు. నియంతలకి తమ వ్యతిరేకులని తొలగించే మార్గం ఒకటే తెలుసు. అదేమిటంటే చంపివెయ్యటం. చరిత్ర చదివితే ఎందరో క్రయిస్తవ, మహమ్మదీయ నాయకులు తమ తండ్రులనీ, సోదరులనీ చంపారని తెలుస్తుంది. కొడుకులని చంపినవాళ్లూ ఉన్నారు. పోప్‌లు ఇతర పోప్‌లని చంపారు. రాజులు రాజులని




చంపారు. సౌదీ అరేబియా ఇత్యాది దేశాలలో టెలివిషన్ మీద వేసే సినిమాలు చూడండి— ఇలాంటి చంపడాలు ఉండేవే చూపిస్తారు. ఇంగ్లాండుని ఏలిన ఎనిమిదవ హెన్రీ తన భార్యలని చంపించాడు. తను సిసలయిన క్రయిస్తవుడని అనుకునేవాడు అతను. జియా కూడా అంతేకదా? తను మంచి మహమ్మదీయుడననే అనుకుంటాడు. అంటాడు.

కమ్యూనిస్టు రాజ్యాలు కూడా ఒక విధంగా మతరాజ్యాలే. ఇక్కడి మతం మార్క్సిసమ్. స్టాలిన్ విధానాలవల్ల కొన్ని లక్షలమంది రైతులు (''కులాక్''లు) నాశనమయ్యారు. రెండవ ప్రపంచ యుద్ధంలోనే ఇందరు రష్యావాళ్లు పోలేదు. తనతో ఏకీభవించని అసంఖ్యాకులయిన కవులనీ, వైద్యులనీ, శాస్త్రవేత్తలనీ ''తొలగించి'' వేయించాడు ఆయన. జియా, మార్కోస్‌లాగే స్టాలిన్‌కూడా మతాభిమాని. ఆయన మతం ఒక లౌకిక మతం. అది వేరే సంగతి. మనం గమనించవలసిన వాస్తవం ఏమిటంటే ఒక సిద్ధాంత నిర్మాణం పేరు చెప్పి అధికారం చేజిక్కించుకునే వాళ్ల రాజ్యంలో అసమ్మతికి అవకాశం ఉండదు. ఇటువంటి వ్యక్తులు మహమ్మదీయ మతం పేరు చెప్పవచ్చు, ఇంకేదయినా మతం పేరు చెప్పవచ్చు. ఫలితం ఒకటే. భుట్టో ఎలాగ వెళ్లిపోయాడో జియాకూడా అలాగే వెళ్లిపోతాడేమో!

దీనంతటివల్లా మనం ఏమి నేర్చుకోగలము? సర్వకాలాలకీ, సర్వావస్థలకీ పనికివచ్చే ఒకే ఒక పెద్ద సత్యం ఉండబోదని. ఎన్నోరకాల సత్యాలు ఉంటాయి. ఇవేవీ పనికిరావు, అసలు పెద్ద సత్యం మాత్రం కావాలి— అనుకుంటే నిరంకుశ పాలన తప్పదు. ఈ మధ్య కొన్ని మతాలలో కొత్త చైతన్యం చెలరేగుతోంది. ఖొమెయినీ లాంటి వాళ్లని ''మూల సిద్ధాంతవాదులు'' అంటున్నారు. నిజానికి ఖొమెయినీకీ, స్టాలిన్‌కీ తేడా ఏమిటి? జియాకీ, భుట్టోకీ తేడాఏమిటి? హిట్లర్‌కీ, మార్కోస్‌కీ తేడా ఏమిటి? హిట్లర్ సేనలలో ''క్రాస్''ని అలంకరణగా వాడేవాళ్లు. ఈయనా, స్టాలినూ కలిసి అయిదు సంవత్సరాలలో యూరోపులోని వయోజనులలో సగం మందిని ఈ లోకంనుంచి పంపించివేశారు.

ఇంకొక యదార్థాన్ని గమనించాలి. మతాభిమానం అధికంగా ఉన్నవాళ్ళు తమలో తాము పోట్లాడుకున్నంత తీవ్రంగా బయటివాళ్లతో పోట్లాడరు. ఐర్‌లాండ్‌లో కాథలిక్కులూ, ప్రొటెస్టెంటులూ ఎలాగ యుద్ధం చేసుకుంటున్నారో చూడండి. అలాగే ఇరాక్, ఇరాన్‌ల మధ్య యుద్ధం జరుగుతోంది.

[లెబనాన్‌లో క్రయిస్తవులూ, మహమ్మదీయులూ పోట్లాడుకుంటున్నారు. ఇక్కడా ఎందరో మరణిస్తున్నారు.] ఆఫ్రికాలో కల్లోలానికి తక్కువా? లేదు ఈ ఖండంలో ఒకప్పుడు క్రయిస్తవ మిషనరీలు బాగా చురుకుగా పనిచేసే వాళ్లు. ఇప్పుడు అక్కడ మహమ్మదీయ మతాభిమానులే ఉత్సాహంగా ఉన్నారు. ఆఫ్రికాఖండాన్ని ఉద్ధరించటానికి వచ్చిన మత ప్రచారకులు చివరికి ఆఫ్రికాఖండం మీద యుద్ధాలనీ, రోగాలనీ, హింసనీ, నియంతృత్వాన్నీ పెంచుతున్నారు.

భారతదేశంలో మొగల్‌లూ, బుడతకీచులూ, ఫ్రాన్సుదేశపువాళ్ళూ, ఆంగ్లేయులూ అధికారం పుచ్చుకుని తగ్గారు. తగ్గారుకాని తొలగిపోలేదు. మిగిలినవాళ్లు కొందరు ఇంకా మన దేశ సమగ్రతకి అపాయం తీసుకురాగలిగిన స్థితిలో ఉన్నారు. తస్మాత్ జాగ్రత్త! ★

# అద్వితీయమైన




వీటితో ప్రకాశవంతమైన జీవితము

## మైసూర్ ల్యాంప్స్

ల్యాంప్స్ • ట్యూబ్స్ • ల్యూమినర్స్

CAS MLW 7857

# మళ్ళీ ఆడపిల్లే!

## ఇచ్ఛాపురపు రామచంద్రం

"శేషాద్రిగారూ !"

పిలుపు విని— ఆయన వరండాలోకి వచ్చారు. "నువ్వటోయ్ సుధాకరం ! ...రా... కూర్చో... ఏమిటి విశేషాలు ?" ఆప్యాయంగా పలకరించారాయన.

"రాత్రి— టెలిగ్రామ్ వొచ్చిందండీ..." సుధాకరం గొంతు దీనంగా ఉంది. "మళ్లీ ఆడపిల్లేనండీ." అన్నాడు భారంగా.

"ఇంత మంచి వార్త ఇలాగటోయ్ చెప్పడం ! ... ఉండు..." హడావిడిగా లోపలికి వెళ్లివొచ్చి— "నోరు తెరువ్... చూడు... మధ్య తరగతి కుటుంబాల్లో ఎప్పుడుపడితే అప్పుడు స్వీట్లు సిద్ధంగా ఉండవు. పంచదార మాత్రం స్వీటు కాదూ ?" అంటూ అతని నోట్లో గుప్పెడు పంచదార పోశారు.

సుధాకరం— ఎదురింట్లో ఉంటున్నాడద్దెకి. శేషాద్రిగారంటే గౌరవమూ, అభిమానమూ. ఆయనని పెద్ద దిక్కులా భావించుకుని కష్ట సుఖాలు చెప్పుకుని— సలహాలు తీసుకుంటాడు. శేషాద్రిగారు కూడా చిన్న వాళ్లలో చిన్నవాడిగా కలసిపోగల సరసులు. మాటలో చతురతా, కొంచెం హాస్యమూ మిళితమై ఉండటంతో ఎవరినయినా యిట్టే ఆకట్టుకుంటారు.

"కంగ్రాచ్యులేషన్స్..." అన్నారాయన. చేతికి మిగిలిన కొంచెం పంచదారనూ తన నోట్లో దులుపుకుని. పంచదార తిన్నా — సుధాకరం ముఖం చేదు మింగినట్లే ఉంది. ఏడుపు ముఖం పెట్టేసి — "నాకు పుట్టింది— పున్నామ నరకంనుంచి తప్పించే పుత్రుడు కాడండీ. ఆడపిల్ల. రెండో ఆడపిల్ల..." అన్నాడు.

"ఈ రోజుల్లో యిటువంటి చాదస్తాలేమిటోయ్. నాలాటి ముసిలాళ్లే వొదిలేస్తుంటే నువ్వింకా వీటిని పట్టుకు వేలాడుతున్నావా !? ఊఁ. ఎప్పుడు బయలుదేరుతున్నావు మాతాశిశువులని చూడ్డానికి? అమ్మాయి క్షేమమేనా?"

"నేను వెళ్లడంలేదండీ. అబ్బాయియితే వెళ్దామని ఎంతో ఆత్రతపడ్డాను..." పెన్నిధి పోగొట్టుకున్నట్టే అతి విచారంగా ఉంది సుధాకరం కంఠం.

"ఏమిటయ్యా అలా దిగాలు పడిపోతావ్ ? ఆడపిల్లయితే ఏం ?"

"బోలెడంత కట్నాలుపోసి అల్లుళ్లని వెదికి పెళ్లిళ్లుచేసి మనం ఆరిపోవాలి. నన్నడిగితే — ధనవంతులందరికీ ఆడపిల్లలూ, సామాన్యులందరికీ మొగ పిల్లలూ పుడుతూంటే సమసమాజం సులభంగా ఏర్పడుతుందేమో..."

"కాదేమో. విత్తమున్నవాడి చిత్తం కదా? అప్పుడు — రూలు మార్చేసి ఆడపిల్లలకి కట్నం వసూలు చేస్తారు మగ పిల్లలనుంచి. వరకట్నం— మళ్లీ కన్యాశుల్కమౌతుంది. మన మధ్యతరగతి జాతినెవరూ ఉద్ధరించలేరోయ్. వ్యవస్థ వెందే ఏ మార్పయినా మనకి ప్రాణసంకటంగానే పరిణమిస్తూ — మనం — ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్నట్లు మిగులుతాం ఏనాటికీ."

"మీకేం... ఎన్నయినా చెబుతారు... ఏమయినా చెబుతారు. అదృష్టవంతులు... ముగ్గురూ కొడుకులే !" సుధాకరం కంఠంలో కొంచెం అసూయకూడా ధ్వనించింది.

అదే క్షణంలో...

కాఫీలు పట్టుకుని వొచ్చింది అనసూయమ్మగారక్కడికి. "అమ్మాయి పుట్టిందటగా ? మంగళవారం... మహలక్ష్మి పుట్టిందన్నమాట... వెళ్లినప్పుడు — శ్యామలని నేనడిగేననికూడా చెప్పు..." అని — కాఫీ గ్లాసులు పట్టుకు వెళ్లిపోయారావిడ అక్కడినుంచి.

"ఐతే — నేను చాలా అదృష్టవంతుణ్నీ... నువ్వు చాలా దురదృష్టవంతుడివీ అంటావు. ఔనా ?"

"కాదూ ?... ఆడపిల్లకీ మగపిల్లడికీ — పోషణ, చదువు వగైరాలన్నిటికీ ఖర్చు సమానమే. పెళ్లికి — ఆడపిల్ల కట్నపు మూటలు తరలించుకుని పైకి పోతుంది. అబ్బాయయితే — మూటలూ తెస్తాడు. ఇంటికి కోడలినీ తెస్తాడు. వృద్ధాప్యంలో — అవసరానికి ఆదుకుంటాడు..."

అతని మాటలు వింటూనే పకపక నవ్వారు శేషాద్రి. "దూరపు కొండలు నునుపనేది నిజమే సుమీ !... చూడబోతే — నువ్వింకా... పిత్ర దేవోభవ అనే సత్యకాలంలోనే ఉన్నట్లున్నావు. నీకో చిత్రమైన విషయం చెప్పేదా ?"

"ఊఁ..."

"ఉండు..." లోపలికి వెళ్లి ఐదు నిముషాలకి వొచ్చి... "లాభంలేదోయ్. ప్రత్యక్షంగా చూపుదామనుకున్నాను. కాని... ఉత్తరం ఎక్కడో పారేశారు. మన యిళ్లల్లో ఏదిమాత్రం దొరుకుతుంది సమయానికి ?"

"ఏం ఉత్తరం ?"

"మా పెద్దబ్బాయి వ్రాశాడులే. పటం కట్టించుకు దాచుకోవలసిన ఉత్తరం - మళ్లీ జీవితంలో పొరపాటు చేయకుండా..."

"మీరేం చెబుతున్నారో నా కర్థంకావడం లేదు..." ఆయోమయంగా చూశాడు సుధాకరం — రంగులు మారిన శేషాద్రిగారి ముఖంలోకి ఆశ్చర్యంగా చూస్తూ.

"నాకు ముగ్గురు కొడుకులు కదా ? నేను నా ముగ్గురి కొడుకుల ముచ్చటా చెబుదామనుకుంటున్నాను — నీకు వినే ఓపికుంటే ..."

"చెప్పండి. నేనూ — నా బాధ మరిచిపోదామన్న ప్రయత్నంలోనే ఉన్నాను" అన్నాడు సుధాకరం ఆడపిల్ల బాధను తలుచుకుంటూ.

శేషాద్రిగారు వాలుకుర్చీలో వెనక్కి వాలి ఓ నిట్టూర్పు విడిచారు.

* * *

"మధూ ! వొచ్చావా ... ఎలా రాశావు టెస్ట్ ?" ఆత్రంగా అడిగారు శేషాద్రి.

"ఏదో రాశానులే."

"అదేమిటలా నిర్లిప్తంగానూ బాధ్యతా రహితంగానూ జవాబు చెబుతావ్ ? వ్రాత పరీక్షలూ యింటర్వ్యూలూ బాగాచేసి త్వరగా ఉద్యోగం సంపాదించుకోవూ? చదువు పూర్తయి రెండేళ్లౌతూంది ..." మందలిస్తున్నట్లుగానే చూశారు.

"ఆ భారమూ బాధ్యతా మీవికావు నాన్నా!"

"మరెవరివి ?" ఆశ్చర్యంగా చూశారు.

"నీవి !" ఖచ్చితంగా చెప్పాడు మధు.

"నావా !?" తెల్లబోయారాయన.

"ఔనాన్నా...నీకు తెలియకపోతే తెలుసుకో. కుర్రాళ్లు రాసే పరీక్షలకీ, చేసే ఇంటర్వ్యూలకీ కాదు ఉద్యోగాలు వొచ్చేది. వాళ్ల నాన్నలివ్వగలిగే లంచాలకీ ... తెగలిగే సిఫార్సులకీను. దిసీజ్ ద రూలాఫ్ ద డే. కనుక — తండ్రీ... నాకుద్యోగం రాలేదంటే ఆ లోపం నాదికాదు, నీది" కుండ బద్దలుకొట్టినట్లు చెప్పేసి వెళ్లిపోయాడు మధు.

* * *

అప్పుడు — హైదరాబాదులో పనిచేస్తున్న పెద్దబ్బాయికి ఉత్తరం రాశాను విషయం వివరిస్తూ — ఓ ఐదువేలు సర్దమని. దానికి తిరుగుటపాలో జవాబొచ్చిందోయ్. ఉత్తరం ఉంటే చూపేవాణ్ని. నువ్వూ చూసి తరించే వాడివి. నీకా అదృష్టం లేక నానోట వినాల్సి వొస్తూంది. అంతతో నేసంతృప్తిపడు సుధాకరం.

"నాన్నగారూ !

మీరు రాసిన ఉత్తరం అందింది. ఐదువేలు పంపమని అవలీలగా రాసేశారు ! మీ అమాయకత్వానికేమనుకోవాలో తెలియలేదు.

'సిటీలో ఎనిమిది వందలతో బ్రతకడమంటే— అసిధారావ్రతమన్నమాటే. మీ కోడలు నన్ను రోజూ దెప్పుతూనే వుంటుంది. ఒక్క తులం బంగారం పెట్టి నెక్లెసయినా చేయించలేకపోయారు పెళ్లయి అయిదేళ్లయినా అంటూ. ఎంత సిగ్గుగా ఉందో ! స్కూటరు కొనుక్కోవాలనే కోరికను— లూనాకి చంపుకుని— చివరకది




కూడా అసాధ్యం యీ జన్మకి అని నిరాశచేసుకుని బ్రతుకుతున్నాను. పట్టుమని పది ఖరీదైన చీరలేనాలేవని మీకోడలికి నిత్యమూ అసంతృప్తే. ఇవీ మా జీవితాలు. మిమ్మల్ని డబ్బు పంపమని అడగనందుకు సంతోషించండి. నాకు ఎప్పుడు డబ్బుకోసం వ్రాసినా ప్రయోజన ముండదని తెలియజేయుటకు మిగుల చింతించుచున్నాను...''

''యోగక్షేమాలయినా లేకుండా—చురకలాటి ఉత్తరం. ఎంత అదృష్టవంతుల కందుతుం దిటువంటి ఉత్తరం ?''

భారంగా నవ్వి... ముచ్చటగా మూడో అధ్యాయం కూడా వినేశావో... నీకు పూర్తిగా అర్థమైపోతుందీ నా అదృష్టమేమిటో. మూడో వాడు మురహరి. ఆఖరివాడనీ... చురుగ్గా ఉంటాడనీ... వాణ్ని కాన్వెంట్‌లో చేర్పించాను. నా దగ్గర వాడికి చనువెక్కువ.

''డాడీ !''

''వాట్ సన్ ?''

''అర్జెంటుగా ఓ హండ్రెడివ్వు...''

''హండ్రెడా ! దేనికీ ?''

''చెప్పింది చెయ్యి. చరిత్ర డక్కు మరెప్పుడూ. ఈసారికి చెబుతున్నాను. ఫ్రెండ్స్‌మీ పిక్నిక్ వేస్తున్నాం ''

''హండ్రెడ్‌కాదు, పెన్నయినా యివ్వలేను. సారీ.'' అనేశాను. మరి నేను — మా రెండో వాడి ఉద్యోగానికి పెట్టుబడి సమకూర్చే యత్నంలో ఉన్నానుగా ? పదులూ యిరవైలూ కూడా పొదుపుచేస్తున్నాను.

''నువ్వెప్పుడూ యింతే నాన్నా. నీ కొడుకుని కావడం నేను పూర్వ జన్మలో చేసుకున్న పాపం. స్టూడెంటు నన్నమాటేకాని ఓ లైఫూ లేదు, ఫన్నూలేదు. మిగిలిన ఫాదర్స్‌ని చూసయినా నేర్చుకోరాదూ పిల్లల్నెలా పెంచాలో ? ఇలా గయితే నేను నలుగురిలోనూ తలెత్తుకుని చదువు కోలేను. తరువాత నీ యిష్టం...''అల్టిమేటమ్ యిచ్చేసి వెళ్ళిపోయాడు.

చచ్చిపోయాక పున్నామ నరకమనేది నిజంగా ఉంటుందో ఉండదో ? ఉన్నా — దాని నుంచి కొడుకులు మనని రక్షిస్తారో రక్షించరో అసలు తెలీదు. కాని...నా అనుమానమే సుమా... పుత్రులు తల్లితండ్రులకి యీ రోజుల్లో — భూమ్మీదే పున్నామ నరకం సృష్టిస్తున్నారేమో అని. నీ అభిప్రాయమేమిటి ?'' అమాయకంగా చూస్తూ అడిగారు సుధాకరాన్ని.

''నేను — వెళ్తానండీ.'' అతను లేచాడు, ఓ నిశ్చయానికి వచ్చినవాడిలా. శేషాద్రిగారి మాటను వినిపించుకోలేదతను.

''ఎక్కడికి ?''

''పాపని చూసేందుకు, ఓ గంటలో రైలుంది.'' అంటూ అతను కదులుతూంటే — ''నా ఆశీస్సులు కూడా అందజెయ్...'' అని కేక వేశారాయన; వాలుకుర్చీలోంచే.

సుధాకరం గేటు దాటేశాడు.

అప్పుడు అనసూయమ్మ వొచ్చింది— వొంటింట్లోంచి చేతులు తుడుచుకుంటూ. తనలో తనే చిరునవ్వులు చిందించుకుంటున్న భర్తని చూస్తూ — ''పాపం ... చిన్నవాణ్ని పట్టుకుని ఏమిటంతంత ఉపన్యాసాలిచ్చేస్తున్నా రింతసేపూ ?'' అడిగింది.

''ఉపన్యాసాలు కావే... కథలు.''

''కథలా !''

''ఔను. కథలే. అనసూయా ... చేదు మందు కంటె తియ్యటి కథలే బాగా పని చేస్తాయి సుమీ ఒక్కొక్కప్పుడు : సుధాకరం భార్యనీ, శిశువునీ చూసుకుందుకు వెళ్తున్నాడు.''

అనసూయమ్మకి — అర్థమయీ అవనట్లున్నాయాయనమాటలు. 

# కర్మవీరుడు సర్దార్ పటేల్

**ఆంధ్రప చిత్ర వారపత్రిక 1950 డిసెంబరు 20 సంచిక నుంచి**

భారత జాతీయ స్వాతంత్ర్యోద్యమానికి తెన్ను చూపినది గాంధి మహాత్ముడైతే, జీవం పోసినది సర్దార్ పటేల్; మెరుగులు దిద్దినవాడు పండిట్ నెహ్రూ. భారతదేశానికి రాజకీయ స్వాతంత్ర్యాన్ని ప్రసాదించినది గాంధిమహాత్ముడైతే, స్వతంత్ర భారత రిపబ్లిక్ రాజ్యాంగ వ్యవహారాల్ని ఉత్తమనీతి పథంలో నడుపుతున్నవాడు నెహ్రూ; స్వాతంత్ర్యాన్ని సుస్థిరపరిచి సూతికావాతం సంభవించకుండా కాపాడినవాడు సర్దార్ పటేల్.

కాంగ్రెస్ ఉద్యమానికి లక్ష్యసిద్ధి చేకూర్చిన వారెవరైనా కావచ్చును; కాని ఆ ఉద్యమానికీ, స్వతంత్ర భారత రిపబ్లికన్ వ్యవస్థకీ పునాది వేసినవాడు పటేల్.

గాంధి మహాత్మునివలెనే సర్దార్ పటేల్ కూడా కారణ జన్ముడని భారత రాజకీయ చరిత్ర నిరూపించగలదు.

ఎంతటి ప్రతిభావంతులైనా సాధించజాలని మహత్కార్యాలను పటేల్ ఎలా సాధించగలిగారు?

సర్దార్ పటేల్ గుణగణాలను గాని జీవిత విశేషాలను గాని ఏకరువు పెట్టవలసిన అగత్యం లేదు. పటేల్ పేరు చెప్పితే భారతీయులకు ఒక విశిష్టలక్షణయుతుడైన మూర్తి జ్ఞప్తికివస్తాడు. వజ్రసంకల్పుడు, చండశాసనుడు, ధర్మవీరుడు, కార్యదీక్షాపరుడు. ఇంతటి అసాధారణ వ్యక్తి మరొకడు కానరాడు. ఇట్టి విశిష్టలక్షణాలు కల వ్యక్తి భారతదేశ చరిత్రలో అపూర్వ రాజకీయ నిర్మాణ ప్రక్రియ కోసమే జన్మించాడని అనేకుల భావన.

పటేల్ జీవిత విశేషాలను గమనించి నట్లయితే, తెలియరాని ఏదో మహత్తరశక్తి ఈ వ్యక్తిని కర్తవ్య నిర్వహణకై నడుపుకు పోతున్నదని కొందరికి తట్టుతుంది.

తండ్రి 1857 సైనిక విప్లవ వీరుడు. స్వతంత్రజీవనాన్ని కాంక్షించి రైతు జీవనం గడిపినవాడు. విఠల్భాయ్ పటేల్, వల్లభ్భాయ్ పటేల్‌వంటి ధీరచిత్తులను పెంచిన తండ్రిని గురించి భారతీయులకు అట్టే తెలియదు. కాని ఆ వ్యక్తిని ఊహించు కొనవచ్చును.

ఉన్నతవిద్యకు పోలేక జిల్లా ప్లీడరీ పరీక్షలో ఉత్తీర్ణుడై, చిన్నప్లీడరుగా వృత్తిలో ఆర్జించిన ధనంతో వల్లభ్భాయ్ ఇంగ్లండ్‌వెళ్లి బారిష్టరైనాడు. ఆత్మబల సంపన్నుడైన వల్లభ్భాయ్ చేపట్టిన కార్యాన్ని సాధించక విడిచేవాడుకాదు. కారణజన్ములు గాంధీ, పటేల్ అహమ్మదాబాదులో తారసిల్లారు. తెలియరాని ఆ మహత్తరశక్తి ఇద్దరినీ సంఘటిత పరిచింది. ఈ సంఘటనకు ఇరువురి నేత్రాలలో ప్రతిఫలించిన ఆత్మబలమే పరస్పరాకర్షణకు హేతువయింది.

ప్రజలలో చైతన్యంతెచ్చి, కర్తవ్యాన్ని నిర్దేశించి, జీవన స్వాతంత్ర్యానికై పోరాడే సంఘటన బలాన్ని చేకూర్చడానికి గాంధి మహాత్ముడు మార్గాన్ని నిర్దేశించారు. నిర్దేశించిన కార్యక్రమాన్ని గాంధీజీ దక్షిణాఫ్రికాలో ప్రయోగించి విజయం పొందారు. భారతదేశంలో స్వాతంత్ర్య సమరానికికూడా అదేమార్గాన్ని, అహింసాత్మక శాసనోల్లంఘ నోద్యమాన్ని నిర్దేశించినప్పుడు, ఆ ఉద్యమ బలాన్ని పరీక్షించేభారం వల్లభ్భాయ్ పటేల్ పైనపడింది.

మానవ సమాజ చరిత్రలో బార్డోలీవంటి జనసంఘటనోద్యమాలు బహుకొద్ది. పటేల్ ఉద్యమ నిర్వహణా చాతుర్యంచూసి యావత్ప్రపంచమూ దిగ్భ్రమచెందింది. బార్డోలీ సత్యాగ్రహాన్ని పటేల్ దిగ్విజయంగా నిర్వహించినందువల్లనే భారత జాతికి అహింసాత్మకమైన సహాయ నిరాకరణోద్యమంపట్ల విశ్వాసం కలిగింది. భారత జాతీయ స్వతంత్ర సమరంలో సత్యాగ్రహం పరికరం సాధనంగా స్థిరపడిందంటే బార్డోలీ విజయమే హేతువు.

బార్డోలీ విజయం పూర్తిగా వల్లభ్భాయ్ పటేల్ వ్యక్తిగత విజయం. విజయ సాధనకై పటేల్ చేసిన కృషి చరిత్ర ప్రసిద్ధం. నిరక్షరాస్యులు, శాంతి జీవనులైన పల్లెవాసులలో పోలీసుబలం పట్ల భయాన్ని పోగొట్టి, త్యాగాన్ని పురిగొల్పి అచంచలమైన ఉద్యమ దీక్షను ప్రదీపింప చేయగలిగాడు పటేల్. ఆ నాటి పటేల్ ఉపన్యాసాలను భారతదేశం ఎన్నటికీ మరువదు.

పల్లెస్త్రీలకు కర్తవ్య ప్రబోధం చేస్తూ "మీ ఆస్తులను సంపదను జప్తు చెయ్యడానికి పోలీసులు రావచ్చును. ధైర్యంతో నిలిచి మీ కాలి వేళ్ల మట్టెలూ, చేతుల గాజులూ ఇవ్వండి కావలిస్తే వాటిని ధరించమని చెప్పండి" అన్నాడు.

బార్డోలీ తాలూకా ప్రజానీకం అంతా ఒక్క మనిషిగా నిలబడింది. పటేల్‌మాట ప్రజానీకానికి వేదవాక్యయింది. దోచినవారు దోచుకు పోగా కృషి ఫలంలో మిగిలిన అర్ధాన్నంతోనే కాలం గడుపుతూన్న మూగజీవులను న్యాయం కోసం అపార త్యాగానికి సిద్ధపరచగలిగాడు పటేల్. ఉద్యమంతో సర్వస్వమూ పోగొట్టుకోడానికి సిద్ధంగా ఉండవలసిందని చెప్తూ పటేల్ ఇలా ఉద్బోధించాడు. "మీ సర్వస్వాన్నీ మీరు విడనాడుకోవలసి రావచ్చును, కాని ఇది మాత్రం మీరు మరిచిపోవద్దు. చిట్టచివరికి కర్షకునికి పోయేది ఏదీ లేదు. ఏ రాజ్యానికినిగానీ కర్షకులు కార్మికులే పట్టుకొమ్మలు. వారే వాస్తవంగా సంపదుత్పత్తికారులు. కాని వారు ఏ సంపదల్నీ అనుభవించలేకపోతున్నారు. ఈ పరిస్థితుల్ని మీరెలా సహించగలుగుతున్నారు? ప్రజలందరూ ఏకమై దేశానికి ఆదర్శం చూపండి. ఈ సమరం ఎంతకాలం కొనసాగితే మీకు అంతలాభం ప్రభుత్వానికి అంతనష్టం. మీరు మీ ఆస్తులు పోగొట్టుకొనవచ్చును. మీకు చెందిన ప్రతి వస్తువూ పోవచ్చును. కాని మీరు భీతిని జయించగలిగిన వారౌతారు. మీ గౌరవాన్ని ప్రకటించిన వారౌతారు. ఈ నాటివరకూ కేవలం కష్టమే మీవంతు అయింది. మీ సమరం మీ కష్టఫలాన్ని మీకు దక్కింప చేస్తుంది.

"కష్టాలు పడ్డం మీకు కొత్తకాదు. ప్రకృతి సూత్రాల్ని మరువకండి. కొన్ని విత్తనాలు నాశనమైతేగాని కొన్ని మొలకలెత్తవు. కాని జాతి ఎన్నడూ నశించదు. పునర్జన్మ అనేది తథ్యం. మీ కష్టాలు మీకు తప్పడంలేదు. కృషికునికంటె ఎండ వానలకోర్చి అధికంగా శ్రమించేవారు వేరెవరున్నారు? దోమల బాధ చీదరబ్రతుకు మీకంటె అధికంగా ఎవరనుభవిస్తున్నారు? ప్రభుత్వం మీ కంతకంటె తెచ్చిపెట్టగల కష్టాలేమున్నాయి? అన్నిటినీ చిరునవ్వుతో సహించగల యోధులింకెవరున్నారు?

"జప్తులకు, గిప్తులకు భయం చెందడం అనవసరం. భయమనేదానిని విదలించండి. మీరు మనుష్యులు. దుర్బలులు కారు. మీ కష్టంవల్ల లభించే ఫలాన్ని అందుకోడానికి కనిపెట్టుకుని కూచునేవారు దుర్బలులు. పొలాలలో కష్టించడానికి కావలసిన బలం మీలో ఉంది. మీ జీవిత భారాన్ని మోయగల శక్తి, ఇతరుల భారాన్ని మోయగల శక్తి మీకే ఉంది. మిమ్మల్ని దుర్బలులని ఎవరంటారు?

"మీకెందుకు భయం? భయపడవలసినది ప్రభుత్వం. పాలితుల సమ్మతిలేనిదే నాగరికమైన ఏ ప్రభుత్వమూ పాలించలేదు. ఈనాటికీ ఇంకా వాళ్ళు పరిపాలించగలుగుతున్నారంటే కారణం మీ కళ్లకు గంతలు గట్టగలగడమే. మీరు శాంతిగా సకల భోగాలూ అనుభవిస్తున్నారని మిమ్మల్ని నమ్మించి మోసగించగలుగుతున్నారు కాబట్టే వారింకా పాలించగలుగుతున్నారు. కాని



వాస్తవానికి ఇప్పుడు శాంతి లేదు. భీతిపరులీనాడు పరిపాలన సాగిస్తున్నారు. అధర్మాన్నీ, అసత్యాన్నీ గుర్తించే సమర్థత మీకిప్పుడు లేదు. గుర్తించ లేక పోవడం, సహించడం పిరికితనం.''

బార్డోలీ ఉద్యమాన్ని విఫలమొందించడానికి ప్రభుత్వం వెయ్యి ఉపాయాలు పన్నింది. కాని అన్నిటినీ కనిపెట్టి జాగ్రత్తపడే సమర్థతను ప్రజలకు పటేల్ నేర్పిపెట్టాడు. ప్రజానీకంలో చైతన్యం తెచ్చి ఉద్యమానికై లోపరహితంగా ఇంతగా సంఘటితపరిచి, ఉద్యమాన్ని వెయ్యి కళ్లతో కనిపెట్టి కాపాడుతూ సంపూర్ణ విజయం సాధించగలిగిన మహానాయకుడు గాంధీ తరువాత పటేల్ తప్ప మరొకడు లేదు.

నెహ్రూ, పటేల్ : ఈ ఇద్దరి మైత్రికీ సంబంధించిన విచిత్ర విషయం ఒకటున్నది. గాంధీ మహాత్ముని నీడలో తుదివరకు సహోదరుల వలె మెలగిన ఈ యిద్దరూ ప్రకృతితః విపర్యయులు. ఒకరిది ఉద్వేగ ప్రకృతి, మరొకరిది గంభీర ప్రకృతి. ఒకరి హృదయం తరంగతాడిత విశాల సాగరతలం, మరొకరి హృదయం సాగర గంభీరం. ప్రకృతి వ్యత్యాసంవల్ల భావగతిలో, దృష్టిలో వ్యత్యాసాలు ఏర్పడినాయి. అభిప్రాయ భేదాలు సంభవించినాయి. కాని ఒకరినొకరు చక్కగా అర్థం చేసుకొన్నవారు. ఇరువురి మధ్యనూ ఏర్పడిన అభిప్రాయభేదాలు ఇరువురి మధ్యనూ మైత్రికీ, సహకారానికీ, సాహచర్యానికీ ఆటంకం కలిగించలేదు. ఎంత అభిప్రాయ భేదాలు ఏర్పడినా అవి వారి కర్తవ్య నిర్వహణకు నిరోధం కాలేదు. పరస్పర సహనం వారిలో ఉంది. ఒక నిర్ణయానికి వస్తే విశుద్ధ మనస్కులై అనుసరించే దీక్ష ఉన్నది. వారి అభిప్రాయభేదాలు వారి కేమాత్రం నష్టం కలిగించలేదు. మనోవ్యథ కలిగించలేదు.

ఒకరికొకరు అండయై నిలిచి కష్టాల నెదుర్కొన్నారు. ఇట్టి అపూర్వ సాహచర్యం అట్టి విశుద్ధవర్తనులకే సాధ్యమయింది. అది అన్యనాయకులలో వైరాలకు ఆధారమైతే, అది వారి దోషంకాదు.

వాక్శక్తిని శతఘ్నిగా ప్రయోగించిన పటేల్ వంటి కార్యసాధకులు చరిత్రలో బహుకొద్ది మంది కనిపిస్తారు. చెప్పేమాటకూ చేసేచేతకూ వ్యత్యాసం కానరాని అసాధారణ వ్యక్తులలో పటేల్ ఒకడు. భారత రాజకీయ చరిత్రలో అన్యులవలెకాక పటేల్ సాధించిన కార్యాలను అణాపైసలతో లెక్కగట్టి నిరూపించ వచ్చును.

ఏ విషయంలోకాని సందిగ్ధ భావమనేది ఎరుగడు. శంక, సంకోచాలనేవి మచ్చుకైనాలేవు. నిశ్చలచిత్తంతో పరీక్షించి చేసే నిర్ణయాలు అమోఘం.

''పటేల్ చెప్తే అది జరిగి తీరుతుంది. దానికి తిరుగులేదు'' అని నేటి రాజకీయ నాయకులు ప్రభుత్వోద్యోగులు యావన్మందీ అనుభవ పూర్వకంగా చెప్పుకునేమాట. పరిష్కరించవలసిన సమస్య ఎంత క్లిష్టమైనదైనాసరే స్థిరచిత్తంతో పరిశీలించగలిగేవాడు పటేల్. పరేంగితజ్ఞానం అనేకులకు దిగ్భ్రమ కలిగించింది. పటేల్ కళ్లలో చూసి ధైర్యంగా వాదించడం ఎంతటి నాయకునికైనా అసాధ్యమైన పని. మైత్రికైనా వైరానికైనా పటేల్ వంటి వ్యక్తి మరొకడు లేడని ఒక నాయకుడన్నాడు.

ఇట్టి ధృఢసంకల్పుడు, ఆత్మబలసంపన్నుడు కాక భారత రాజకీయ స్వాతంత్ర్య సుస్థిరస్థాపన కర్తవ్యానికి తగిన వ్యక్తి మరెవరున్నారు? బ్రిటిషు రాజకీయ దుస్తంత్రజ్ఞుల మోసంవల్ల స్వాతంత్ర్యలబ్ధితోపాటు, దేశం రాజకీయంగా అయిదువందల చెక్క ముక్కలై చివికిపోగల ప్రమాద మేర్పడినప్పుడు, సామదాన భేద దండోపాయాలు ప్రయోగించి దేశాన్ని కాపాడినవాడు పటేల్.

భారతదేశ చరిత్రలో ఏ చక్రవర్తి సాధించ జాలకపోయిన అద్భుత కార్యాన్ని సాధించాడు. సంస్థానాలన్నిటినీ ఏకైకాధిపత్యం కిందకు తెచ్చి భారత రాజ్యాంగానికి సౌష్టవరూపం చేకూర్చిన పటేల్‌ను చరిత్ర ఎన్నడూ మరువదు. సంస్థానాల సమైక్యతా కార్యక్రమంలో రాజకీయ దురంధరుడనిపించుకున్నాడు.

సత్యాగ్రహోద్యమంలో, పరిపాలనా సుస్థిరతలో, దేశసమైకతా సాధనలో పటేల్ చేసిన కృషి శాశ్వతంగా చరిత్రస్థమయింది. భారత జాతికి ఆత్మబలాన్ని కూర్చి పెట్టిన పటేల్‌ను భారత చరిత్ర ఎన్నడూ మరువదు.

పటేల్‌వంటి కార్య దురంధురుడు భారత దేశానికి చేయవలసిన సేవ ఇంకెంతైనా ఉన్నది. వృద్ధాప్యంలో కూడా పటేల్ యావచ్ఛక్తినీ దేశపరిపాలనకే వెచ్చించినాడు. బొంబాయి వెళ్లే సమయంలో ఢిల్లీకి తిరిగిరానని పటేల్‌కు తెలుసును. జవహర్లాల్‌పైన అపారమైన భారం ఉన్నదని ఒకరితో అన్నాడు. అవసానదశ సమీపమైనదని తెలిసినా నెహ్రూ ప్రభృతులకు ఆశ అనేది అంతరించలేదు. అది సహజమే. కాని అప్పుడే దేశం పటేల్ అంతిమ యాత్రకు వీడ్కోలు ఇవ్వక తప్పలేదు.

[సీతారామ్] ●



సీరియల్

# జీవనమురళి

కొండముది శ్రీరామచంద్రమూర్తి

(గత సంచిక తరువాయి)

పాట అయిపోయింది. ఇంద్రసేన్ అందరినీ ఉద్దేశిస్తూ అన్నాడు.

"స్నేహితులారా ! మహాలక్ష్మిగారినీ, జీవనగారినీ, మురళీకృష్ణగారినీ పాట పాడి మనల్ని ఆనందపర్చినందుకు హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను. మహాలక్ష్మిగారు రేపటి నుండీ కళాలయం కొత్త ఇంట్లోకి మారిపోతారు. ఈ సందర్భంలో మనందరం కలసి వేసుకున్న మొత్తాన్ని ఒక్కసారి లెక్క చూసుకుని, ఇంకా ఎంత కావలసి వుంటుందో ఆలోచించుకుంటే, ఆ డబ్బును నా పుట్టినరోజు కానుకగా తక్షణం అందజేస్తాను." అని కాసేపు ఆగి, తన మాటల ప్రభావం పరమేశ్వరం మీద ఎట్లా వున్నదా అన్నట్లుగా ఆయన వేపు చూశాడు.

పరమేశ్వరానికి అంత చల్లని సమయంలోనూ మొహమంతా చెమటలు పడుతున్నది. ఆయన గుండె దడ దడ లాడుతున్నది. ఈ హఠాత్ పరిణామానికి ఆయన సిద్ధపడి లేడు. మళ్లీ ఇంద్రసేన్ అన్నాడు. "పరమేశ్వరంగారూ! ఆ డబ్బు సంచీని తెచ్చారా ? ... లేకపోతే తెప్పిస్తారా ? "

పరమేశ్వరం నోటివెంట మాట రావడం లేదు. నవనాడులూ క్రుంగిపోతున్నాయి. దొంగతనం జరిగిందని తను చెప్పాలి. చెబితే ఇప్పుడెవరు నమ్ముతారు ? ఇంద్రసేన్ తనను వెతుక్కుంటూ వచ్చాడు, ఏమీ జరగలేదన్న మాటను తమ చేత చెప్పించి వెళ్ళిపోయాడు. తనను కొట్టి డబ్బు ఎత్తుకు పోయారన్న వార్తను ఎవరికీ తెలియకుండా మురళీకృష్ణ మాట విని రహస్యంగా అట్టే పెట్టాడు. కనీసం తెలియజేసినట్లయితే, తరువాత సంగతి ఎట్లా వున్నా, ముందీ దురవస్థన్నా తప్పేది. ఇంతమందిలో తను సంజాయిషీ చెప్పుకోవాల్సిన అవస్థ, బాధ తప్పేవి. తల వంచుకున్న పరమేశ్వరానికి మురళీకృష్ణ మేఘ గంభీర స్వరంతో అంటున్న మాటలు ఆశ్చర్యం కల్గించాయి.

"అలాగే తెప్పిస్తారు నాన్నగారు ! సుమారుగా ఎంత కలెక్ట్ చేశారో చెప్పగలరా "?

"లెక్క చూడలేదు. అంతా సంచీలోనే వుంది !"

"మా నాన్నగారి ఎడల మీకు నమ్మకం వుందా ?"

"అట్లా అంటారేవిటి ? నిప్పులాంటి మనిషి ఆయన !" ఒకరికి ఇద్దరన్నారు.

"ఏంలేదు." మురళీకృష్ణ అన్నాడు. "మొన్నరాత్రి సంచీలో నుండి డబ్బుతీసి బీరువాలో పెట్టి పడుకున్నారు. తెల్లవారి లేచేసరికి సంచీని ఎలుక కొరికేసింది !"

"ఎలుక కొరికిందా ?" నాగలింగం నోరు వెళ్ళబెట్టాడు.

"డబ్బు క్షేమంగా వుంది గదా ?" ఛేంబర్ ప్రెసిడెంట్ మహంకాళయ్య అడిగాడు.

"ఆహా ! నిక్షేపంగా వుంది. ఇదిగో!!' మురళీకృష్ణ నోట్ల కట్టలు తీసి వాళ్ళముందు పడేశాడు. "ఇవిగో ఇరవై వేలు. చెక్కులే ఎలుకల పాలయ్యాయి !"

"పోనిద్దురూ మళ్ళీ వాటిని రాసుకోవచ్చు !" ఆ ··తులు వోదార్పుగా అన్నారు.

మురళీకృష్ణ ఆ డబ్బును బలవంతంగా ఇంద్రసేన్‌కు అందరి ముందూ ఇచ్చేశాడు. "ఇది మీ సంస్థ. డబ్బు మీ దగ్గరుండడమే క్షేమం. మీకూ తెలుసు కదా, అన్యాయానికి నోరుందని, న్యాయానికి కళ్లులేవని, అయినా ధర్మం గెలవక తప్పదని !"

నిరాశతో క్రుంగిపోయిన ఇంద్రసేన్, మర్నాడు కలుసుకుందామనీ, వివరాలు మాట్లాడుకుందామనీ చెప్పి అందర్నీ పంపించేశాడు. బయటికి రాగానే మురళీకృష్ణతో కలసి నడుస్తూ పరమేశ్వరం అడిగాడు. "అంత డబ్బెక్కడిదిరా ? ముందుగానే ఇట్లా జరుగుతుందనివూహించేవా?"

మురళీకృష్ణ ప్రక్కన జీవన వుంది. ఆ ప్రశ్నకు వెంటనే మురళీకృష్ణ జవాబు చెప్పలేదు. కొంత సేపటికన్నాడు. "క్షమించండి. ఇల్లు తాకట్టు పెట్టాను !"

విన్న వారిద్దరూ ఉలిక్కిపడ్డారు. దూరంగా కుక్క ఒకటి భౌంయ్ భౌంయ్ మంటోంది. ఎవరో ఏడుస్తున్నారు. వెనక ఇంద్రభవన్ మంటల మందిరంలా కన్పిస్తోంది.

**జరిగిన కథ — 10 :** పరమేశ్వరంగారిని, ఊళ్లోని మిగతా పెద్దలని తన ఇంటికి ఆహ్వానించి వారితో తాను అభాగ్యుల కళాలయం ఒకటి ప్రారంభించబోతున్నానని దానికై తన ఆస్తిలో నాలుగో భాగం విరాళంగా ఇస్తున్నానని చెపుతాడు ఇంద్రసేన్. మిగతా పెద్దలంతాతమ శక్తికొద్దీ ఇచ్చిన విరాళాలమూటను ఇంద్రసేన్ వద్దంటున్నా వినకుండా దాచమని బలవంతంగా పరమేశ్వరంగారి చేతికిస్తాడు. చీకట్లో ఇంటికి వెళుతున్న పరమేశ్వరంగారిని కొట్టి నాగలింగం విరాళాల మూటను తిరిగి ఇంద్రసేన్‌కు అప్పగిస్తాడు. ఇంత జరిగినా పరమేశ్వరంగారికి ఇంద్రసేన్‌పై సరికొత్తగా ఏర్పడిన నమ్మకం చెదరలేదు. జీవన తన పుట్టినరోజున దేవాలయానికి వెళ్లగా అక్కడ ఇంద్రసేన్ కనపడి పుట్టినరోజు కానుకగా వజ్రపుటుంగరం ఆమెకు బహూకరిస్తాడు మురళీకృష్ణ ఆ ఉంగరం తీసిపారేయమంటాడు. తన గురించి కొన్ని రహస్యాలు ఇంద్రసేన్‌కు తెలుసు గనుక అతనికి భయపడి ఆ ఉంగరం తీసుకున్నట్టు మురళీకృష్ణతో చెపుతుంది జీవన. అలాంటి భయాలు అనవసరం అంటాడు మురళీకృష్ణ. ఇంద్రసేన్ మాష్టారుని, మురళీకృష్ణని, జీవనను స్వయంగా ఆహ్వానించడానికి వస్తాడు. మురళీకృష్ణ జీవనకు పుట్టినరోజు కానుకగా రాధాకృష్ణ బొమ్మ ఇస్తాడు. ఇంద్రసేన్ పుట్టినరోజు సందర్భంలో అతను ప్రారంభించబోతున్న అభాగ్యుల కళాలయంకు విరాళంగా జీవన ఇంద్రసేన్ ఇచ్చిన ఉంగరాన్ని తిరిగి అతనికి ఇచ్చేస్తుంది. పాటల మహాలక్ష్మితో కలసి పాట పాడుతూ జీవన , మురళీకృష్ణ తనకు హితబోధ చేయడం విని మండిపడతాడు ఇంద్రసేన్.

# 13

శ్రావణమాసం వచ్చేసింది. ఒక్కొక్కరోజు ఆకాశం ముసురు కమ్మేస్తుంది. మరొక్క రోజు ముసురు లేకుండానే వర్షం కురుస్తుంది. అంతలో సూర్యుడు పట్టపగ్గాలు లేకుండా ఆకాశ నృత్యం చేస్తాడు. ఇంతలో పూవులు రాలేట్లు, ఆకులు వణికేట్లు గాలివీస్తుంది. శ్రావణమాసం వచ్చిన సూచనగా మగవాళ్ళు సాయంకాలాలు ఇళ్ళల్లో వుండడంలేదు. ఆడవాళ్ళు పట్టుచీరల మడతల్లో, పేరంటాల వేడుకల్లో పచ్చగా, నిండుగా కనిపిస్తున్నారు.

వీలయినప్పుడల్లా మురళీకృష్ణ కళా నిలయానికి వెళ్ళి వస్తున్నాడు. కళానిలయంలో మహాలక్ష్మితోపాటుగా మరో నలుగురు ఆడవాళ్ళు చేరారు. ఓ మృదంగ విద్వాంసుడు, వో వాయులీనం విద్వాంసుడు, నట్టువాంగం పండితు డొకరు, పాటగాడొకడు ఆ నిలయంలో ఉద్యోగానికి కుదురుకొన్నారు. పగలంతా మహాలక్ష్మి కళా నిలయంలోనే వుంటోంది. రాత్రిళ్ళు ఇంద్ర భవనానికి వెళ్ళివస్తుంటుంది.

ACC NO.
CL. NO
LANGUAGE
DATE
వేటపాలెం

మొదట్లో కొన్నాళ్ళు మురళీకృష్ణతో పాటుగా జీవన కూడా ఆ కళా నిలయానికి వచ్చేది. తర్వాత రావడం మానుకుంది. ఇంటి పనిపాటలు చూసుకోవడంలోనే. వర్ధనమ్మతో కబుర్లు చెబుతూ కూచోడంలోనే జీవనకు ఎక్కువ ఆత్మతృప్తి లభిస్తోంది. ఎక్కడ ఆనందంగా వుంటే అక్కడ వుండాలి కానీ, అనవసరమైనచోట కాలక్షేపం చేస్తే లాభం ఏమిటీ అన్న అభిప్రాయానికి ఆ అమ్మాయి వచ్చేసింది. మహాలక్ష్మి అంటే నృత్యం నేర్చు కుంటుంది. పాట నేర్చుకుంటోంది. నృత్యంలో అంటే అడుగు వేయడం అనతికాలంలోనే మహాలక్ష్మికి వచ్చేసింది. ముద్రలు పట్టడం త్వరలోనే అర్థం చేసుకుని అభినయం చేస్తోంది. దీనికితోడు సంగీతంలో మొదట సరళీస్వరాలు ప్రారంభించింది. సరళీస్వరాలనుండి జంట స్వరాలు, వాటినుండి అలంకారాలు, ఆపైన గీతాలు, వర్ణాలు, మెట్టుమెట్టుగా ఆశ్చర్యకరంగా ఎక్కేసింది. ఒకవైపు సంగీతంలో మెట్లు ఎక్కుతూనే తిల్లానా నేర్చుకుంది. భామా కలాపం నేర్చుకుంది. దశావతారాలు, మండూక శబ్దం సాధన చేసింది. పాటల మాలచ్మి, రాగాల మహాలక్ష్మిగా పరిపూర్ణమైన రూపాంతరం చెందింది. ఆమె రాగానికి మురళీకృష్ణ ఓక్కోసారి మురళీస్వరం వేసేవాడు. ఆమె అడుగు, అతని స్వరం, ఆమె ఆట అతనిపాట శ్రవణానందంగా, నేత్రపర్వంగా భాసించేవి.

పరమేశ్వరం, మురళీకృష్ణ కలిసి ఇంటి దగ్గరనుండి బయలుదేరుతారు. పరమేశ్వరం స్కూలుకు వెళ్లిపోతాడు. మురళీకృష్ణ ఇంటి పనులు చూసుకుని, స్నేహితులతో ఆ మాటా ఈ మాటా మాట్లాడి, కళానిలయానికి వస్తాడు. అక్కడ వున్నవారికి ఏంకావాలో చూసి, అవసరమైన ఏర్పాట్లు పూర్తిచేసేసరికి మళ్లీ పరమేశ్వరంతో కలిసి ఇంటికి తిరిగివచ్చే వేళవు తుంది.

పన్నెండు గంటలు... ఇంటికి తిరిగివస్తారు.

ఒంటిగంట... మధ్యాహ్నం భోజనం పూర్తవుతుంది. ఆ తర్వాత పరమేశ్వరం వో గంట కునుకు తీస్తాడు. పోయే వయసు గాని ఆయనది వచ్చే వొయసు కాదు గనుక ఆ మాత్రం విశ్రాంతి తప్పనిసరి. ఆయన విశ్రాంతి తీసుకొంటునప్పుడు మురళీకృష్ణ జీవనతో కబుర్లు చెబుతోనో, పుస్తకాలు చదువు కొంటునో, అప్లికేషన్లు పూర్తిచేస్తోనో కాలం గడిపేస్తాడు.

మళ్లీ పరమేశ్వరం స్కూలుకు, మురళీకృష్ణ డ్యాన్సు స్కూలుకు బయలుదేరారు. దీపాలు పెట్టేవేళకు పరమేశ్వరం స్కూలు నుండి, డ్యాన్సుస్కూలుకు వస్తాడు. తండ్రీ కొడుకులూ, కళానియం సభ్యులూ కలిసి కూచుని లోకాభి రామాయణం, జోకాభిరామాయణంగా చేస్తారు. పరమేశ్వరం మధ్య మధ్యలో సంస్కృత శ్లోకాలతో అర్థాలు వివరిస్తుంటే, మురళీకృష్ణ ఆంగ్ల గ్రంథాల నుండి కొటేషన్స్ ఇస్తూ తండ్రి భావాలను సపోర్ట్ చేస్తుంటాడు. ఆ సమయం అందరికీ ఎంతో విలువైంది. నేర్చు కోవడానికీ, నేర్పడానికీనూ !

"కళ ఎప్పుడు పుట్టింది మాష్టారూ ?" అని అడిగింది ఒకసారి మహాలక్షి.

"తొలి మానవుడి అవతరణలోనే కళ కూడా



అవతరించింది తల్లీ ! శ్రీలంకలో వున్న సిలిగురి గుహలూ, భారతదేశంలో వున్న అజంతా ఎల్లోరాలు కొంతవరకు మాత్రమే మన్ని వెనక్కు తీసుకువెళ్తున్నాయి. వాటికన్నా ప్రాచీనమైన కళాస్వరూపాలున్నాయి. ఆదిమ మానవుడు ఆటవికుడైనా, అతనికీ ఆనందించే హృదయం వుండేది. ఆనందాన్ని వ్యక్తీకరించాలనే తపన వుండేది. తదనుగుణంగానే తన చిన్న బుర్రకు అందిన ఆలోచనల పరిధిలోనే, గుహాంతరాల్లో, ఆ రాతి గోడల మీద బల్లెం, దుప్పి, లేడీ — నిప్పురాయి, మొదలైనవాటిని సూత్రప్రాయంగా చెక్కాడు. అట్లా ప్రారంభమైన కళాస్వరూపం, ఎన్నో మార్గాల్లోకి విడిపోయింది. ఎన్నోరకాలుగా కనిపించడం మొదలెట్టింది. నాట్యం, నృత్యం, నాటకం, పాట ఒకటేమిటి, సహస్రముఖాలు, సహస్ర హస్తాలు. కళాభగవంతుణ్ణే సహస్ర శీర్షం దేవం అంటూ మనం అర్చించుకొంటున్నాం.''

ఇట్లా సాగిపోయేది ఆయన వివరణం, ఉపన్యాసం. ఆయనతో పరిచయం పెరిగినకొద్దీ, మహాలక్ష్మికి ఆయనపైన గౌరవం పెరగసాగింది. సామాన్యంగా లోకరీతి అతిపరిచయాత్ అవజ్ఞః. కాగా పరమేశ్వరం విషయంలో అది తారుమారైంది. ఒక రోజున జీవన, మురళీకృష్ణ వున్న సమయంలోనే మహాలక్ష్మి తన మనసులో నిప్పురవ్వలా రాజుకుంటున్న ధర్మ సందేహాన్ని ఆయన ముందు బయటపెట్టింది.

''బాబుగారూ ! ఎక్కడెక్కడో తోక తెగిన గాలిపటంలా వున్న నన్ను, స్వేచ్ఛగా ఆకాశంలో పక్షిలా పల్లటీలు కొట్టే నన్ను, నేర్పుగా వొడిసి పట్టి ఇంద్రసేన్‌గారు ఈ ఆనందపురంచేర్చారు. అపశబ్దాలతో వికృతంగా ధ్వనించే నా పేరు సంస్కృత వాసనామయం చేశారు. పిచ్చిగంతులు వేసే నా కాలికి గజ్జెలు కట్టి, నాగజ్జకు స్వరాలు నేర్పారు. ఆయన ఋణం నేను ఏం చేసి తీర్చుకోగలను ? ఏం చేసినా, ఆయన మాటకు, చేతకు తాన తందాన పలికితే ఋణం తీర్చుకొన్నట్లవుతుందా?''

పరమేశ్వరం జవాబు చెప్పేలోగా నే మురళీకృష్ణ ఆ ప్రశ్నకు తను సమాధానమిచ్చాడు.

''మహాలక్ష్మిగారూ ! మీ ప్రశ్నకు ఓ కథ చెబుతాను వినండి. అనగా అనగా ప్రొఫెసర్ హిగ్గిన్స్ అనే వో భాషా శాస్త్ర ఆచార్యుడు లండన్‌లో వున్నాడు. ఆయనకు ఇంగ్లీషు భాషలో వున్న మాండలికాలన్నీ కొట్టినపిండి. ఒక రోజున ఆయనకు ఎలిజా డూ లిటిల్ అనే వో పూవు లమ్ముకునే అమ్మాయి కనిపించింది. ఆ ఎలిజా తన సహజమైన యాసలో మాట్లాడుతుంటే, ఆయనకూ, ఆయన స్నేహితుడు ప్రొఫెసర్ స్మిట్ గారికీ వో వూహ వచ్చి అది పందెంగా మారింది. ఆ పువ్వుల పిల్లను ఆర్నెళ్ళలో కులీన కుటుంబస్త్రీగా మారుస్తానంటాడు ప్రొఫెసర్ హిగ్గిన్స్. ఆ పిల్ల సమస్తమైన వాలకమూ మారిపోవాలి అది జరగాలంటే. పలుకుబడి మారాలి, యాస పోవాలి, నడవడిక, అలవాట్లు అన్నింటిలోనూ మార్పు రావాలి—అదీ ఆర్నెళ్ళలో. ఆర్నెలలయింతర్వాత ఆ ఎలిజాను కులీన కుటుంబాలవాళ్ళు అటెండవుతున్న ఓ పార్టీకి తీసుకువెళ్ళి ఆమెనొక జమిందారుల బిడ్డగా పరిచయం చేస్తే, ఎవరూ ఆ విషయం కనుక్కోకుండా వుండేటంత సహజంగా జరగాలి ఆ సంస్కరణ. మార్పు అసాధ్యం అంటాడు స్మిట్. సాధ్యమేనంటాడు హిగ్గిన్స్. ఆ పువ్వుల పిల్లకు రకరకాల ప్రలోభాలు చూపి, ఎట్లాగైతేనేం హిగ్గిన్స్ ఆ అమ్మాయిని తన దగ్గరకు రప్పించుకుంటాడు. కఠోరమైన శిక్షణనిస్తాడు.

**సత్యం !**

క్రిందపడ్డ కెఱటం
మళ్ళీ పైకి లేస్తోంది...
జీవిత నాటకంలో
ఓడి పడుతున్నా
మళ్ళీ మళ్ళీ ఆశతో
లేచే ప్రయత్నం చెయ్యాలనే
సత్యం తెలియజేస్తోంది !

— ఎన్.వి.ఆర్. సత్యనారాయణమూర్తి.

ఆమెలో అణువణువూ మారిపోయేట్లుగా శ్రమిస్తాడు. ఆమె రూపంలో, మాటలో, నడక తీరులో, ఒక మహారాజకుమార్తె ఏమో అన్నంత భ్రమ కల్గిస్తాడు చూసేవాళ్ళకు. హిగ్గిన్స్ చెప్పినట్లల్లా చేస్తుంది, నేర్చుకోమన్నవన్నీ నేర్చుకుంటుంది. తన పాత జీవితం అలవాట్లను, ఆలోచనలను అవతలపెడుతుంది. ఆ పిల్ల కొత్త జీవితంలోని నూతనత్వానికి స్వాగతంపలుకుతుంది. డ్యూక్స్, డచెసెస్, నైట్స్, ఎర్ల్స్, డబ్బున్నవాళ్ళు, జమీందారులు వున్న ఓ గెట్ టుగెదర్‌లో, పార్టీలో, బాల్‌రూం డ్యాన్సులో ఆమెను పువ్వుల పిల్ల అని ఎవ్వరూ కనుక్కోలేక పోతారు. ఏ దేశపు మహారాజపుత్రికో అనుకుంటారు. చుట్టూ మూగుతారు. ఆమె చూపు కోసం, షేక్‌హ్యాండ్ కోసం తపన పడిపోతారు, పోటీ పడతారు. ఆమె నెగ్గింది. ప్రొఫెసర్ హిగ్గిన్స్ తన పందెం గెల్చుకున్నాడు. ఇప్పుడా పిల్ల పువ్వుల పిల్ల కాదు. ''నా పందెం అయిపోయిందిగా, మన మధ్య వొప్పందం కూడా ముగిసిందిగా, ఇహ వెళ్ళిపో, నువ్వు నీ పాత జీవితంలోకి, ఆ మురికి కాల్వల్లోకి, పువ్వులమ్ముకుంటూ బ్రతికే ఆ బీద ప్రపంచంలోకి'' అంటాడు హిగ్గిన్స్. ఆ అమ్మాయి అతని మీద ఎన్నో ఆశలు పెట్టుకుంది. ప్రేమలు పెంచుకుంది. అవన్నీ పుటుక్కున తెగిపోయాయి. ఆమెకు ఏడుపు రాలేదు. కోపం వచ్చింది. అతణ్ణి చెప్పుతో కొట్టి ఆ ఇంట్లో నుంచి బయటకు వచ్చేసింది.''

అంతవరకూ మురళీకృష్ణ చెబుతున్న దాన్ని ఏకాగ్రంగా వింటున్న మహాలక్ష్మి, జీవన ఇద్దరూ వొక్కసారే ఒక్క ప్రశ్నే అడిగారు. ''బయటకు వచ్చి ఏం చేసింది ?''

''తనంటే పడి చచ్చిపోయే ఓ అందమైన కుర్రవాణ్ణి పెళ్ళి చేసుకుంది !''

''అంతే కదా ? మళ్ళీ ఆ మురికిలో, నరకంలో, యాసగా మాట్లాడుతూ, పువ్వులండీ పువ్వులు అనుకుంటూ, పువ్వుల్నీ తన బ్రతుకునూ కూడా బజారుపాలు చేసుకుందేమో! అని భయపడి పోయాను !'' అన్నది మహాలక్ష్మి.

''మంచిపని చేసింది.'' అన్నది జీవన.

'నా ప్రశ్నకు అదే సమాధానం అంటారా?' మళ్ళీ అడిగింది మహాలక్ష్మి.

''రేపెప్పుడో, భవిష్యత్తులో నీ కెదురయ్యే ప్రశ్నకు ఇప్పుడు సమాధానం వెత్కుకోడం ఎందుకు మహాలక్ష్మి ? కాలమే అన్నింటికీ తగిన జవాబులు చెబుతుంది, కంగారు పడకు.''

ఇట్లా సాగుతున్న కళాలయం కాలక్షేపంలో జీవన చాలాసార్లు ప్రేక్షకురాలుగా, శ్రోతగా మాత్రమే వుండిపోయేది. రోజులు గడిచే కొద్దీ ''ఎందుకూ నేను ఇక్కడకు రావడం ?'' అనిపించింది ఆమెకు. ''మహాలక్ష్మి డ్యాన్సు నేర్చుకోవడం చూడటానికా ? మురళీకృష్ణ పాట వినడానికా ? మిగిలిన ఆడవాళ్ళతో కబుర్లు చెప్పడానికా ?'' అనుకున్నది. ''రాకపోతే ఏం ?'' అన్న ప్రశ్న వేసుకుంది ఆ తర్వాత. రావడం మానేసింది.

మురళీకృష్ణ మొదట మొదట బలవంతం చేసినా, క్రమేపీ అడగడం మానుకున్నాడు.

''ఆ పిల్ల నీవెంట ఎందుకురా అక్కడకు? ఆటపాటా నేర్చుకునేవాళ్ళ మధ్యకు జీవనెందుకూ ? — నువ్వెళ్ళి వస్తున్నావుగా, చాలదూ ?— జీతం భత్యం లేని నౌకరీకి !'' అన్నది వర్ధనమ్మ, ఓ సాయంత్రం ''జీవనా ! వెళ్దాం, రా !'' అని మురళీకృష్ణ అడిగినప్పుడు.

''అట్లాగే, అట్లాగేలే ! జీవన ఇంట్లోనే వుంటుందిలే. తీసుకెళ్లనులే, గొడవచెయ్యకు !'' అంటూ నవ్వుతూ అని మురళీకృష్ణ వెళ్ళిపోయాడు. జీవన గుమ్మంవరకూ వెళ్లి సాగనంపి వచ్చింది.

శ్రావణమాసం ఇంకా వో వారం రోజులుండగా, ఇదంతా జరిగింది. శ్రావణమాసం హడావిడిలో జీవనకు తాను ఇంట్లోనే వున్నాననే అనిపించడంలేదు. ఎప్పుడూ రాటపోకులా ఇంట్లోనే తిరగాల్సి వచ్చేది. ప్రొద్దున్నే పూజలు, సాయంకాలం సంధ్యాదీపాలు, ఇరుగింటికీ, పొరుగింటికీ పేరంటాలకు వెళ్లడాలు, ఇళ్లు కడుక్కోవడాలు, గుమ్మాలకు పసుపు పూసి

బొట్లు పెట్టుకోవాడాలు, అబ్బో, ఒకటా, రెండా పన్లు !

మొదటి మంగళవారం వెళ్లిపోయింది. మొదటి శుక్రవారం రానూవచ్చింది, వెళ్లనూ వెళ్లింది. జీవన పక్కవాళ్ల ఇళ్లకు వెళ్లి కాళ్లకు పసుపు రాయించుకుని, బొట్టు పెట్టించుకుని శెనగలు తెచ్చుకుంది. ఆ శెనగల్ని సాతాళించి మగవాళ్ళిద్దరికీ పెట్టింది.

తింటూ, తింటూ మధ్యలో పరమేశ్వరం అన్నాడు. "అమ్మా ! మనింట్లో కూడా పేరంటం చెయ్యరాదటే ? ఎన్నాళ్ళైందో పేరంటం ముత్తయిదువులు ఈ గడపతొక్కి !"

"అవున్రా ! నాకీ ఆలోచన రాలేదుస్మీ ! వచ్చే మంగళవారమే నోయిస్తాను !"

అనుకున్న మంగళవారం రావడానికి పట్టుమని మూడురోజులు కూడా పట్టలేదు. మంగళవారం ప్రొద్దున్నే జీవన తలంటు పోసుకుంది. కొత్తచీర కట్టుకుంది. చేతులకు వొత్తుగా గాజులు వేసుకుంది. కాళ్లకు నిండుగా పసుపు రాసుకుంది. మొహాన పెద్ద బొట్టు పెట్టుకుంది. తడిసిన తలను జారుముడి వేసుకుంది. వర్ధనమ్మ సంకల్పం చెబుతుండగా గౌరీపూజ చేసుకుంది. పూజ అయి, హారతి ఇచ్చేసింతర్వాత, దేముడికి మౌనంగా దణ్ణం పెట్టుకుని లేచి, వర్ధనమ్మ పాదాలకు నమస్కరించింది.

"ఇదేమిటే పిచ్చిపిల్లా ! ఇప్పుడీ నమస్కారాలెందుకూ ?" అన్నది వర్ధనమ్మ ఆప్యాయంగా.

"మామ్మగారూ ! ఈ దేవాలయంలోకి ప్రవేశించే అర్హతే నాకు లేదు. ప్రవేశించాను. పూజ చేసుకునే ప్రాప్తే నాకు లేదు. మీరు శాస్త్రోక్తంగా చేయిస్తుంటే, పూజ కూడా చేసుకున్నాను. ఈ అదృష్టానికి మీకు గాక నే నెవరికి నమస్కారం చేయను ?"

ఆమె కళ్లనుండి రెండు కన్నీటి బొట్లు రాలి క్రింద పడ్డాయి.

"ఏడుస్తున్నావా ? ఛా ! ఛా ! తప్పమ్మా ! మంగళవారం పూటా ఆడపిల్ల కన్నీరు నట్టింట పడకూడదు !" అంటూ తన పమిట చెంగుతో తుడవబోయింది.

"మామ్మగారూ ! ఏడుపు నీళ్లయితే ఏడవకూడదు, కానీ ఇవి ఏడ్పు కన్నీరు కాదు, ఆనందం అలలు !" అంటూ మెల్లగా అని, జీవన తన పమిటచెంగుతో వొత్తుకుంది.

ఆ సాయంకాలం పేరంటానికీ ఇరుగమ్మనీ, పొరుగమ్మనేకాక తనకు జ్ఞాపకం వున్నవారందర్నీ, తమకు పరిచయం వున్నవారందర్నీ కూడా కేకేయించింది వర్ధనమ్మ. 'ఎవర్నీ మర్చిపోకు జీవనా ! మనింట్లో పేరంటం అని తెలిస్తే ప్రతివాళ్ళూ వస్తారు !'

అట్లాగే జీవన అందర్నీ బొట్టుపెట్టి పిలిచింది. కొందరు పనులలో లోపల వుంటే, బయటకు రావడానికి వీలులేక కడగా వుంటే, గుమ్మాలకు బొట్టుపెట్టి మరీ చెప్పి వచ్చింది.

మురలీకృష్ణ రెండు అరటి గెలలుతెచ్చాడు. రెండు శేర్ల శెనగలు తెచ్చాడు.

"ఇంకా తెస్తాను, ఇవి సరిపోతే సరి, లేకపోతే – " అన్నాడు.

"ఎక్కకి మక్కగా సరిపోతాయ్. ఇవి చాల్లే !" అన్నది వర్ధనమ్మ.

ఆచారిగారిభార్య తన ఇద్దరు కోడళ్ళతోనూ, ఆరుగురు మనమలూ, మనవరాండ్రతోనూ వచ్చింది. ఆ పిల్లలు కూచున్నచోట కూచోరు. నిల్చున్నచోట నిల్చోనీరు ఆవిడను. శాస్త్రిగారి పెద్దభార్య, చిన్నభార్య ఇద్దరూ వచ్చారు. తమ ముగ్గురు ఆడపిల్లల్నీ వెంటబెట్టుకుని. వాళ్ళది ఎంతో కుదురైన కుటుంబం.

శర్మగారి, వదినా, మరదలూ వచ్చారు. శర్మగారికి పాపం భార్య పోయినప్పటినుంచీ ఆయన అన్నా, తమ్ముడూ ఇద్దరూ వచ్చి తమ తమ కుటుంబాలతో సహా ఆయన దగ్గర వుంటున్నారు. ఇప్పుడు వాళ్ళు వచ్చారు పేరంటానికి.

ఆచారి, శాస్త్రి, శర్మగార్ల కుటుంబాలే కాక, మూర్తిగారి ఇంట్లోంచికూడా ఆడవాళ్ళు వచ్చారు. నాయుడుగారు, రెడ్డిగారు, మహంకాళయ్యగారు, నాగలింగంగారు,అందరూ తమ ఆడవాళ్ళను పంపించారు. పేరటం కొట్టి కోలాహలంగా జరుగుతోంది. పాటనందుకున్నారు వచ్చిన ఆడవాళ్ళలో గాత్ర సుభగత్వం వున్నవాళ్ళు. ఎవరికందిన చరణం వాళ్ళు పాడుతున్నారు. నాగలింగం భార్య ఉచ్ఛ స్వరంలో అంటున్నది.

ఇచ్చితిని ఒక వరము
మెచ్చితిని పొమ్మనుచు
స్త్రీ జన్మమా?...పురుష జన్మమా?...

"ఏ జన్మ కావాలి జీవనా నీకు – పురుష జన్మమా ? – లేక స్త్రీ జన్మమా ?" వచ్చిన వాళ్ళలో ఒకరు నవ్వుతూ అడిగారు.

నాగలింగం భార్య కబుర్ల అధ్యాయంలో నుండి, పాటల మేలుకొలుపులోనుంచి, ప్రకృతంలోకి వచ్చింది. తన మెడకు, కాళ్ళకు జీవన పసుపు పూయటానికిరాగానే ఆ అమ్మాయి వేపు తేరిపారచూసింది.

"అమ్మాయీ, నీది ఎరికలపాడు కదూ ?" అన్నది.

జీవన ఆ మాట వినగానే వులిక్కిపడ్డది. ఎరికలపాడు ! తను ఆ మాటే మర్చిపోయింది. తన మనసులోనుంచి ఆ పదాన్నే చెరిపేసింది. ఇప్పుడీ మహాతల్లి మళ్ళీ జ్ఞాపకం చేస్తోంది.

"అవును !" అన్నది తల వొంచుకుని, మెల్లగా.

"అయితే నువ్వా పందుల పెంటయ్య కూతురివిగదూ ?"

జీవన మళ్ళీ యాంత్రికంగా తలాడించింది. ఆమె అవుననగానే నాగలింగం భార్య రబ్బరు బంతిలా లేచి నిలబడింది. "అయ్యో! అయ్యో!" అంటూ నోరు నొక్కుకుంది.

"వర్ధనమ్మా ! నీ కిష్టమైంది. బాగానే వుంది. ఇంట్లోనే తెచ్చిపెట్టుకున్నావ్ ఈ మైల తద్దినాన్ని ! ఎంత శ్రోత్రియకుటుంబం మీదీ, నిప్పుల్ని కడిగితేనేకాని పూజ చేయవే – నువ్వేనా. ఈ పని చేసింది ? రామ రామ ! ఇంతకన్నా ఏం కావాలి పిదపకాలానికి ? పెద్దంతరం, చిన్నంతరంలేకుండా పోయిందనడానికి ?






కాని, మమం పాపంచేశామని, ఇవ్వాళ [illegible] వారంపూటా ఇట్లా మమ్మల్నందర్నీ పిల్చి ఈ అనాచారం చేయిస్తున్నావా? ఆ పందుల పెంటయ్య కూతురు, పెళ్ళిపీటలమీదనుంచి లేచి పారిపోయిన పిల్ల, కులంలేని దానికి [illegible] పసుపు రాయిస్తావా, బొట్టు పెట్టిస్తావా? నీ వంటిల్లూ, నీ పడకటిల్లూ, [illegible] తగలబెట్టుకున్నావ్, మా ఇళ్ళుకూడా తగలెయ్యా లనికాదూ నీ తాపత్రయం?"

వర్ధనమ్మ అవాక్కయిపోయింది. [illegible] పై ప్రాణం పైనే పోయినట్లయింది. మెరుపు [illegible] మెరుపు, ఉరమని వురుము, కనిపించని [illegible], పొగలేకుండా అగ్నిపర్వతం భుగభుగ. "[illegible] పందుల పెంటయ్య?" అన్నది [illegible].

"ఆ మధ్య ఎరికలపాడులో మాకు తెలిసి వాళ్ళకు ఒకరికి ఒంట్లో బావుండలేదంటే వెళ్ళాను చూసొద్దామనీ! అబ్బ - ఎంత కష్టమనీ అక్కడకు వెళ్ళటానికి! కొండ మధ్య వుంటుంది వూరు. ఓ రోడ్డూ లేదు, పాడూ లేదు. చచ్చీ చెడీ వెళ్ళానక్కడకు మా ఆయన్ని తీసుకుని. ఆ ఊళ్ళో అయిందిచి పందుల పెంటయ్యగారి దర్శనం నాకు! మా వాళ్ళ పొలాల్లోకి పందుల్ని తోలుతున్నాడు అప్పుడు. ఓ పందులేవిటి, అతగాడి దగ్గర లేని జంతుజాలం లేదు. వాడి మొదటి భార్య కూతురీవిడ. మా వాళ్ళ ఇంటో వద్దు దంపి పోవాలంటే, రెండోభార్య రానందిట, ఈవిడగార్ని పంపించాడా తండ్రి! అప్పుడూ ఈ మహాతల్లి దర్శనం అయింది నాకు!! అప్పుడే ఆ గుబ్బగా చెప్పుకున్నారు దీన్నెవరో బాగా డబ్బున్నవాడికి ఆ పెంటయ్య అమ్మేయబోతున్నాడని చెప్పి. ఆ తర్వాత పెళ్ళిపీటలమీదినుంచి పారిపోయిందట!!"

ఆగి ఆయాసం తీర్చుంది నాగలింగం భార్య. మళ్ళీ రాంధాడీ ప్రారంభించింది. "ఏవమ్మా! నే చెప్పింది తప్పేమో అడుగు ఆ జీవనమ్మను—ఏమే అదేకాదూ నీ పేరు? మతం కూడా పుచ్చుకున్నారేవిటి, నీ పేరేవిటి అట్లావుంది?.. సరేలే, నీ పేరు ఏదైతే నాకెందుకూ?... వర్ధనమ్మకు ఇష్టమైంది వుంచుకున్నది, నీ పేరంటం వద్దు, పాడూవద్దు, ఇంటికెళ్ళి తలారా స్నానం చేస్తేకాని మైలపోదు!" ఆమెకు పట్టిన గ్రహం ఆమెచేత ఇష్ట మొచ్చినట్లు మాట్లాడింప జేస్తోంది. ఆమె తను అంతవరకూ పోగుచేసుకువచ్చిన శెనగల్ని విసిరి పారబోసింది. లేచి నుంచుని "నేను వెళ్తున్నానర్రా? మడీ ఆచారం కావాలనుకుంటే మీరూ రండి!" అన్నది ధాష్టీకంగా.

ఆచారిగారిభార్య తన ఇద్దరి కోడళ్లతోనూ, ఆరుగురి మనమలూ, మనవరాండ్రతోనూ లేచి నుంచుంది. "పదండి అక్కయ్యగారూ, నేనూ

# జీవన మురళి

[illegible]స్తున్నా, ఈ అనాచారం నాకూ పడలేదు'" అంటూ.

[illegible] భార్యలూ, [illegible] [illegible] వెళ్ళారు. [illegible], [illegible] [illegible], [illegible] [illegible] మేమంటే మేమన్నారు. అందరూ [illegible] [illegible] [illegible] [illegible].

[illegible] కళావిహీనంగా [illegible], [illegible], తమలపాకు [illegible], [illegible] వుంది. మనుష్యులు లేక బీడగానూ వుంది. వాళ్ళు రకరకాలుగా మాట్లాడుతున్నా, అదేమీ వినలేదు వర్ధనమ్మ. వాళ్ళు వెళ్ళిపోతున్నా ఆమె వాళ్ళకు అడ్డుపడి ఆపాలనిపించలేదు.

నాగలింగం భార్య మాటలను విన్న జీవన తాను వున్నచోటునుండి కదలలేకపోయింది. శరీరంలో ఏదో నిస్సత్తువ ఆవరించినట్లయింది. వర్ధనమ్మ ఆమెవేపు క్రూరంగా, జాలిగా చూసింది.

"ఓసి పాపిష్టిదానా! నా ఆచారమంతా మంటగలిపావు కదటే? మమల్నెందుకిట్లా మోసం చేశావ్?" అన్న ఆలోచన మూలంగా వచ్చిన క్రూరత్వం.



ఇటీవల బందరులోని మహిళా సేవామండలి 43వ వార్షికోత్సవం సందర్భంగా 'ప్రెసిడెంట్ పేరమ్మ' ఏకపాత్రాభినయం చేసిన కుమారి ఉదయగిరి లక్ష్మీతాయారు.

"[illegible] పెట్టి [illegible] తన్నిని [illegible], సవతి [illegible] పంలో [illegible] మరచిపోయి [illegible] [illegible], [illegible], పళిసతువు [illegible] [illegible] పారిపోయివచ్చిన పిడరాలవు, నిన్ను [illegible] కాపాడగలం?" అన్న జాలి.

జాలి క్రూరత్వం జయించింది. వర్ధనమ్మ దేముడి గదిలోకి వెళ్ళి తళ్ళున తలుపేసుకుంది. జీవనకు కదలడానికి భయంగా వుంది. విధి గీసిన బొమ్మలా అక్కడే కూర్చుండిపోయింది.

పరమేశ్వరం వచ్చాడు. "ఏమమ్మా? — ఏం జరిగింది?" అని అడిగాడు.

మురళీకృష్ణ వచ్చాడు. "ప్లీజ్ — నాతో చెప్పు!" అన్నాడు.

జీవన వాళ్ళిద్దరితో పెదవి విప్పి మాట్లాడ లేదు. వర్ధనమ్మ వున్న గదివేపు మాత్రం చూపించింది. వాళ్ళిద్దరూ వర్ధనమ్మ దగ్గరకు వెళ్ళారు. దేముడి ముందు పీట వేసుకుని ధ్యానంలో కూర్చున్న వర్ధనమ్మ, తండ్రీ కొడుకుల్ని చూసి, జరిగిందంతా చెప్పింది వేదనా కంఠంతో. "ఇప్పుడేం చేయడం? ఇల్లంతా మైలపడిపోయింది."

"ఏం చేద్దామో తరవాత ఆలోచించు కుందాం, ముందు అన్నంపెట్టు బామ్మా, ఆకలై పోతోంది" మురళీకృష్ణ గారాబంగా అన్నట్టుగా అన్నాడు.

వర్ధనమ్మ, కంచాలుపెట్టి పీటలు వేయ డానికి జీవనను పిలవలేదు. తనే ఆ ఏర్పాట్లు చేసింది. అన్నం, కూరలూ తీసుకురావడానికి ఆమె అటు వెళ్ళగానే, మురళీకృష్ణ ఒక కంచాన్ని బయటికి తెచ్చుకుని జీవనకు ఓ కంచంపెట్టి, ఆ కంచం పక్కన తన కంచం పెట్టుకు కూచున్నాడు.

"అబ్బాయ్, మనవడేడీ?" వర్ధనమ్మ అన్నంపళ్ళెం తెచ్చి అడుగుతోంది.

"అటు చూడు!" పరమేశ్వరం జీవనను, ఆమె పక్కన కూచున్న మురళీకృష్ణను చూపించాడు "అక్కడున్నాడు."

"అదేమిట్రా?" వర్ధనమ్మ అన్నం పళ్ళెంతో సహా బయటికి వచ్చింది.

"నువ్వెందుకురా, ఆ కులంలేని పిల్లపక్కన ఇక్కడ? పదపద లోపలికి!"

"కులం అంటే ఏమిటి బామ్మా" మురళీకృష్ణ అమాయకంగా మొహం పెట్టాడు.

"కులం... కులం అంటే..." వర్ధనమ్మ తడబడింది. "అది దేవుడు సృష్టించాడు."

"మరి ఈ అమ్మాయికెందుకు సృష్టించ లేదు బామ్మా?"

"ఆ అమ్మాయికీ వుంది, వో తక్కువ కులం!"

"తక్కువ అని ఎవరన్నారూ?" మళ్ళీ అడిగాడు మురళీకృష్ణ.

# ప్రేమ్ సబ్బుతో స్నానం
# రోజంతా ఉల్లాసం

మీ శరీరమునకు మృదుత్వమునిచ్చి సహజ
సౌందర్యమును పెంపొందించు సబ్బు ప్రేమ్.
దీని స్వచ్ఛమైన నురగ, పరిమళము
మీ మనసును పులకింపజేయును.




గులాబి మఱియు ఆకుపచ్చ
రంగులలో లభించును



జయలక్ష్మి
గుంటూరు వారి తయారీ

Imageads M-1783

**డా॥ వి. వి. కె. రావ్, B.A.**

వైద్య విద్వాన్, వైద్యాచార్య, సెక్స్ స్పెషలిస్ట్



వివాహము వాయిదా వేయ నవసరం లేదు. హస్త ప్రయోగం, నరముల బలహీనత, శీఘ్రస్ఖలనములకు ఆయుర్వేద చికిత్స. పోస్టుద్వారా చికిత్స కలదు.

**రావూస్ క్లినిక్**

టి. బి. రోడ్, తెనాలి.

ఫోన్ : 3700 & 4010.

**ఇంకా పొడుగు ఎదగండి**

2'' – 8''



నూతన శాస్త్ర పద్ధతులలో వ్యాయామములతో ఎక్కువ పొడుగుకండి. ఆరోగ్యవంతులు అవండి. స్త్రీ పురుషులకు ఎల్లరకు అనువైనది. దీని వంటి కోర్సు, లేక పుస్తకం మరొకటి ఎంతమాత్రం లేదు. వివరములకు హిందీలోగాని తెలుగులోగాని ఉచితం.

**NEW C.T. HOSPITAL**

**806, Dr. Mukerjee Nagar, Delhi-9.**

మాకు బేబీ/బాబు కావాలా



ఆపరేషన్. ఇతర వైద్య చికిత్సలతో నిరాశ చెందిన సోదరీమణులు అనేకులు మా సలహాలచే సంతానవతులయి ఇచ్చిన యోగ్యతా పత్రములు గలవు. స్త్రీ పురుష సంధ్యాదోష నివారణా నిపుణులు. * ఉచిత వివరములకు :

**శ్రీ నాగార్జున మూలిక కుటీరం,**

రైల్వేస్టేషను దగ్గర, రామాలయం వీధి, తెనాలి–2. | 5 వల్లైను, కేదారేశ్వరపేట, విజయవాడ–3.

## జీ వ న ము ర ళి

"ఎవరో అనడం ఏవిటి ? అందరూ అంటున్నారు."

"అంటే అన్నారు కానీ, జీవనది ఏ కులమట ?"

"ఏదో వుంది. ఏం కులమే అమ్మాయ్ నీదీ ?" వర్ధనమ్మ విసుగ్గా అంది.

"నాకు తెలియదు!" జీవన తలవొంచుకుని కించపడుతూ అన్నది.

"సరేగాని బామ్మా ! ఒక్క సంగతి అడుగుతాను. నిజం చెబుతావా ?"

"ఏంట్రా అది ?"

"ఏం లేదు. జీవన కులం ఏవిటో నీకు తెలీకముందు, ఆ అమ్మాయిని లోపలకు రానిచ్చావు. నీ దేముడూ కాదనలేదు. ఆ అమ్మాయి నీకు కాఫీ ఇచ్చింది. కాళ్ళు పట్టింది, అన్నం వడించింది, పూజలు చేసింది. ఇంట్లో మనకందరికీ ఏం కావాలంటే అవి హాజరుగా అమలు పర్చింది. అప్పుడు ఆ అమ్మాయి కులం మనకెవరికీ అడ్డు పడలేదు. అడగాలని కూడా అనిపించలేదు. ఇప్పుడెవరో వచ్చి ఏదో కానికూత కూసేసరికి జీవన కానిదై పోయిందా? అనాచారపరురాలై పోయిందా? సంస్కార విహీనురాలై పోయిందా ? ఆమె ఎవరో తెలీనప్పుడు ఆమెను ఆదరించాం. తెలిసినప్పుడు అనాదరిస్తున్నాం. తెలియని తనంలో చూపించగలిగిన మంచితనం, తెలిసిన తనంలో చూపించ లేకపోతున్నాం. లేకితనం మనలో వుందా ? ఈ అమ్మాయిలో వుందా ? చెప్పు బామ్మా ?" మురళీకృష్ణ ఆవేశంగా అన్నాడు.

"అయితే ఏవిటంటావురా ?" వర్ధనమ్మ కోపంగా అడిగింది.

"ఇక్కడే నాకు అన్నం పెట్టు, జీవన పక్కన! నేనా అమ్మాయికి వాగ్దానం చేసి తీసుకు వచ్చాను– జీవన ఇక్కడే వుంటుంది ! అంతే !!"

"నీ అభిప్రాయం ఏవిటీ ?" అన్నట్టుగా చూసింది వర్ధనమ్మ, పరమేశ్వరం వేపు.

"ఊఁ ! వడ్డించేసెయ్!" అంటూ సంజ్ఞ చేశాడాయన. వర్ధనమ్మ తన వాదాన్ని మరి పొడిగించలేదు. "ఇదిగో అమ్మాయ్! విన్నావుగా, వాళ్ళిద్దరికీ నువ్వంటే ఇష్టమే, నేనే పరాయి దాన్నైపోయాను !" అంటూ వంట ఇంట్లోకి నడిచింది మరింత అన్నం తీసుకురావటానికి.

ఆ రాత్రి ఇల్లు నిశ్శబ్దపు దుప్పటిని కప్పుకున్న తర్వాత, వర్ధనమ్మ మెల్లగా అడిగింది కొడుకును. "అబ్బాయ్, నిద్రపోతున్నావుట్రా?"

"లేదే – ఏవిటి చెప్పు ?"

"నీకిష్టమేనట్రా ?"

"జీవన సంగతేనా?" పరమేశ్వరం మెల్లిగా అడిగాడు. కిటికీలోనుండి పక్క ఇంటివాళ్ళ దీపాలు మిణుకు మిణుకుమంటూ కన్పిస్తున్నాయి. వాతావరణం చల్లగా వుంది. "అవున్రా !" అన్నది వర్ధనమ్మ లోగొంతుకతో.

"సరేగాని జీవన గురించి నీ అభిప్రాయం ఏవిటే ?"

"అమ్మాయికేంరా, బంగారం !!" చటుక్కున ఆమె మనసులో భయంభయంగా ఓ వూహ మెదిలింది. "ఎందుకురా అట్లా అడిగావు, కొంపదీసి, ఆ అమ్మాయినిగాని ఇంటి కోడలు చేసుకోవుకదా ?"

పరమేశ్వరం జవాబు చెప్పలేదు. అవతల వేపుకు తిరిగి పడుకున్నాడు.

"అబ్బాయ్, పరమేశ్వరం !" వర్ధనమ్మ భారంగా పిల్చింది.

పరమేశ్వరం మెళుకువగానేవున్నా సమాధానం చెప్పలేదు. ఆమె ఏం అడగమన్నదో ఆయనకు బాగా తెలుసు, సమాధానమే ఇంకా స్థిరపడలేదు. సమాధానం లేనప్పుడు మౌనమే శరణ్యం.

తల్లీ కొడుకులు మాట్లాడుకొంటున్న సమయంలోనే, జీవనకూడా గుసగుసగా అడుగుతోంది మురళీకృష్ణను.

"నా కోసం మామ్మగారి మనసు ఎందుకు బాధపెట్టారూ ?"

"నీ కోసంకాదు పిచ్చిదానా ! అట్లా మాట్లాడడం నా కోసమే! నాకూ ఈ జీవితంలో ఒక ధర్మం వుంది. నా మాటకూ ప్రయోజనం వుంది !"

"ఏమో మురళీ! మీరందరూ నన్ను ఒప్పుకోవచ్చు. కానీ ఈ సంఘంలో మనమూ ఒకళ్ళంకదా, మీ సంఘం నన్ను అవుననక పోవచ్చు !"

"అదే అంటుంది, దాన్ని లెక్కచెయ్యకపోతే, అదే తోకాడించుకుంటూ మనచుట్టూ తిరుగుతుంది."

"ఏమో, నాకుమాత్రం అనుమానంగానే వుంది. ఇవ్వాళచూడు, ఎంత అభాసు అయి పోయిందో, పేరంటానికి వచ్చినవాళ్ళందరూ వెళ్ళిపోయారు. ఇటుపైన ఎవరి ఇళ్ళకూ నన్ను పిలవరు. ఈ ఇంటికి ఎవరూ రారు ! నా మూలంగా మీకందరికీ చెడు పేరు ఎందుకు రావాలి ?"

"ఒకళ్ళమూలంగా మరొకళ్ళకు వచ్చే చెడుపేరు ఏవిటిగానీ, పడుకో, ఎవరి పేరుకు వాళ్ళే కారణం !"

కానీ ఆ రాత్రి ఆమె ప్రశాంతంగా పడుకోలేకపోయింది. ఊహల తేనెటీగలు ఆమెను కుట్టి వేధించడం మొదలుపెట్టాయి.

**(ఇంకా ఉంది)**

# నకిలీ పోలీసు !

పూనాకు చెందిన వో సినిమాహాలు ముందు టిక్కట్లకు యిక్కట్లుపడే జనాన్ని అదుపులో పెట్టి క్యూను ప్రశాంతంగా పంపుతూన్న వో పోలీస్ కాన్‌స్టబుల్ మీద ఆ హాలువారికి అనుమానంవచ్చి పోలీసు రిపోర్టిస్తే వారొచ్చి యీ నకిలీనిచూసి, ఆశ్చర్యపోయి, ఆ మీదట అరెస్టు చేశారట. మురికివాడలలోని వో గుడిశవాసిఅయిన రషీద్‌షేక్ అబ్దుల్ రజాక్ అనే యీ యువకుడు పోలీసు దుస్తులు కుట్టించుకుని, యీ విధంగా సినిమాహాళ్ళముందు తలాయింత డబ్బు గుంజుకుంటున్నాడట — శతకోటి దరిద్రాలికనంతకోటి ఉపాయాలు —జీ హ !!




## నిద్రపోయేవారిని చంపే నిశాచరుడు!

బొంబాయిలోని మాతుంగా— అంధేరి ప్రాంతాలలో రాత్రిపూట ఫ్లాట్‌ఫారాలమీద పడుకుని నిద్రపోయేవారిని ఎవడో వో అజ్ఞాత ఆసామీ విచిత్రంగా హత్యలు చేస్తున్నాడట. ఆగస్టు చివరి వారం నుంచి సెప్టెంబరు మొదటి వారంలోగా చాలా హత్యలు చేసి ఆ ప్రాంతాల వారికి సింహస్వప్నమై కూర్చున్నాడట అతను. అతని చేతిలో చావు తప్పించుకున్న ఆ వ్యక్తి నల్లగా, భయంకరంగా ఆరడుగులకన్నా ఎక్కువ పొడవుంటాడనీ, కళ్ళు ఎర్రని అగ్నిగోళాలుగా వున్నాయనీ, గొంతు పరపర రంపంతో కోసినట్టుందనీ వర్ణించాడట. తల బద్దలుకొట్టి చంపి, ఆ శవం పక్కన వో బండరాయి పెడ్తాడట హంతకుడు. కానీ ఆ బండరాయికి రక్తమే ఉండదట. అతను తల బద్దలు కొట్టడానికి ఉపయోగించే ఆయుధమేది,అతను ఎవడు? మనిషేనా, ఎందుకిలా చేస్తున్నాడు అనే ప్రశ్నలకు పోలీసు సమాధానం వెతుకుతోందట.

# పాలకుని జైలు

## జైలుకెళ్ళినా పోని మంత్రి పదవి !

ఇజ్రేలులో అహరన్ అబుహట్జయిరా అనే ఆయన లేబర్ అండ్ సోషియల్ వెల్ఫేర్ శాఖ మంత్రిగా వుండి, తన పదవిని దుర్వినియోగం చేసిన కారణాన్న ఆయనకు కారాగార శిక్షపడినదట. శిక్షననుభవించే కాలంలో యీయనమంత్రి పదవి ఆయనకి వున్నదట. వో సంవత్సరం జైలు శిక్ష ననుభవించి, ఆనక తిరిగి మంత్రి స్థానంలో ఎంచక్కా వుండచ్చుట. ఇజ్రేలు ఎన్నికల చట్టం యీ విషయంలో ఏదో నేరం మీద శిక్ష అనుభవించిన ప్రజాసేవకుడు ప్రజల ఎన్నికను పోగొట్టుకోడు. తిరిగి ఎన్నికలలో గెలవకపోతేతప్ప అతనికి ఎన్నికల ద్వారా వచ్చిన పదవి పోదు అని అంటుందట !

## తీగ లాగితే.... !

తిరుచ్చి తాలుకా మీన్ సురుట్టి గ్రామానికి చెందిన 25 ఏళ్ల కళింగరాణి అనే వో హరిజన యువతి తన భర్తతో వివాహం రద్దు చేసుకుని, కొంతకాలం తల్లి దమయంతితో వుండి, కలియమూర్తి అనే 37 ఏళ్ళ వివాహితునితో అక్రమ సంబంధం పెట్టుకుని, తనను వివాహం చేసుకొమ్మని వేధించి, నేరుగా అతనింటికి వెళ్ళి, నేను నీ సవతిని అని కలియమూర్తి భార్య చిత్రతో చెప్పి ఆ యింట్లో తిష్టవేసిందట. చిత్ర తన తండ్రి యింటికి వెళ్ళి ఈ రగడ చెప్పేసరికాయన అల్లుణ్ణి పిలిపించి, అయినదేదో అయ్యింది. కొంత డబ్బు దాని మొహాన్నకొట్టి వదిలించుకో అని వో సలహా, కొంత డబ్బూ కూడా యిచ్చాడట. ఆ డబ్బుకు కళింగరాణి వొప్పక, నీతోనే నా జీవితం అని హఠం చేసిందట. మామగారి సలహాతో, బావమరది సహాయంతో కలియమూర్తి కళింగరాణిని హత్యచేసి, పాతిపెట్టాడట. అతని మామగారి సలహా ప్రకారం ఆ శవాన్ని బయటికి తీసి, తగులపెట్టి, ఆ బూడిద ఎత్తి పొలాలలోను, నీళ్ళల్లోనూ జల్లేశాడట. దమయంతి తన కూతురు కనబడలేదని నేరుగా ముఖ్యమంత్రి యం.జి.ఆర్.కు ఫిర్యాదు రాసి పంపితే ఆయన యీ కేసు ఐ.జి., డి.ఐ.జి. లకు వప్పగిస్తే వారు కేసంతా తవ్వితీసి అందుకు బాధ్యులయినవారిని చట్టానికి వొప్పగించారట.

## లంచాలుతిన్న నాయకులకు అన్ని వసతులుగల జైలు !

అమెరికాలోని ఫెడరల్ బ్యూరో ఆఫ్ ఇన్వెస్టిగేషను సంస్థ (యఫ్. ఐ. బి.) లంచాలు పుచ్చుకునే రాజకీయ నాయకులను పట్టుకుని మూకుమ్మడిగ చట్టానికి వొప్పగించిందట. వీరందరికీ చట్టం మూడేళ్ళు జైలు శిక్ష విధించిందట. తమాషా ఏమిటంటే వీరుండే జైలు వూరుకు చివరగా, చివరికి ప్రహరీ గోడ కూడా లేకుండా చక్కని రూములతో, అందమైన మంచాలు, కుర్చీలతో, ఫ్యానూ, ఫోనూ, సౌకర్యాలతో వుండడమేగాక, టెన్నీసు, బ్యాడ్‌మింటన్, కోర్టులతో, పార్కులతో ఎంతో హాయిగా వుంటుందట!—యింటికన్నా గుడిపదిలమననేమి !




## కోర్టుధిక్కార నేరం !

యు. యస్. ఎ. కాలిఫోర్నియాలోని వో కోర్టులో జడ్జిగారు ఒక కేసులో కెరొలిన్ బాబ్ అనే వో ఆమెను విచారిస్తూ "అమ్మా యీ నీకు పెళ్లయినదా, అయినచో నీ భర్త పేరేమి? అతనేమి చేయుచున్నాడు ?'' అని అడిగారట. దానికా బాబ్ మండిపడి, "నేరవిచారణలో యీ విషయాలెందుకు ? ఇదే ప్రశ్నలు మీరు ఒక మగాడి నెన్నడయినా అడిగారా, నేరస్థుడైన మగవాడిని నీకు పెళ్లి అయినదా, నీ భార్య పేరేమి, ఆమె ఏమి చేయుచున్నది అని మగవాడిని అడగనపుడు, ఆడదాన్ని యీ ప్రశ్నలేల అడగవలె ? ఈ ప్రశ్నలకూ, నా నేర విచారణకూ ఏమి సంబంధం ?'' అని ఆ జడ్జిగారిని జడ్జిగారుగా ఎంచి చూడించి పారేసిందట. తెల్లబోయిన జడ్జిగారు తేరుకుని, కోర్టుధిక్కారమనే నేరాన్నామె పయిన మోపి, ఒకరోజు కారాగార శిక్ష విధించారట. కెరొలిన్‌బాబ్ చేసిన సవాలుకు చట్టం సమాధానమేమి ? 

# హరిజనోద్యమాభివృద్ధి: మహాత్ముని అమూల్య సేవలు

## డాక్టరు పట్టాభిగారి సింహావలోకనము



**హరిజనులు బిచ్చమెత్తుకొనరాదు–బరంపురం హరిజన సభా తీర్మానములు**

బరంపురమునందు జరిగిన హరిజన సమావేశమునకు డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు అధ్యక్షత వహించి, యీ విధముగ నుపన్యసించిరి :—

పూనా సత్యాగ్రహము తరువాత నేను యింతవరకును యే హరిజనోద్యమముతోను సంబంధము కలిగియుండక పోవుటచే యీ సమావేశమునకు అధ్యకుడుగా నుండవలయునని నన్ను మీరు కోరినప్పుడు నాకు కొంచెము జంకు కలిగినది. ఏలనన యీ హరిజనోద్యమము వీలైనంతవరకు కాంగ్రెసులో లేనివారే సాగించుట యుక్తమని మహాత్ముడు చెప్పెను. అందువలన నేను యిటీవల అభివృద్ధికి వచ్చుచున్న హరిజనోద్యమములతో యెక్కువ జోక్యము కలుగజేసికొనలేదు. అంతమాత్రమున యీ హరిజనోద్యమము నెడ యిష్టము శ్రద్ధ నాకు లేవని చెప్పరాదు.

గాంధిమహాత్ముడు ప్రచారమునకు తెచ్చిన యీ ఉద్యమము, నాలుగు సంవత్సరములలో యెంతో అభివృద్ధి పొందినది.

ఈ హరిజనోద్యమమునకు పునాది 1930–38 సంవత్సరములలో మహాత్ముని అసమాన సామర్థ్యమువలన వేయబడినది. ఆ తరువాత యీ ఉద్యమము ఆశ్చర్యకరముగ అభివృద్ధి పొందినది. మదరాసు శాసనసభకు అభ్యర్థులుగా పోటీచేసిన 30 మంది హరిజనులలోనూ, 25 మంది గెలుచుటవలన హరిజనుల యెడల దేశము యెంత సోదరభావమును చూపుచున్నదనియును స్పష్టము కాగలదు.

నేటి రాజకీయ వాదులు కాలగర్భమున మరుగుపడిపోయి, నేటి రాజకీయ పరిస్థితులు దేశ చరిత్రయందు మాత్రము స్మరింపబడుచు, భారతదేశపు జనాభాలో అయిదవవంతు అగు హరిజనులను అంటరానివారని నీచభావముతో చూచిరను మాట యేదో విచిత్రకరమగు వార్తగ ప్రజలు చెప్పుకొను భవిష్యత్కాలము రానున్నది. హరిజనోద్యమము కొరకు, హరిజనుల యెడ, తక్కిన జాతుల వారు సమభావమును చూపుట కొరకు మహాత్ముడు పూనాలో సెప్టెంబరు 20వ తేదీన ప్రాయోపవేశము చేసిన విషయము మన దేశ చరిత్రయందు సువర్ణాక్షరములతో లిఖింపబడగలదు.

భగవంతుడు సృష్టించిన, అసామాన్యమగు హిందూ జాతిలో కొంతమందిని అస్పృశ్యులుగ త్రోసివైచి, సంఘాభివృద్ధికి జాత్యభివృద్ధికి ఆటంకమును తెచ్చిపెట్టుకొనిన మనకు, గాంధీ మహాత్ముని అసదృశ సహాయము వలన, ఆ ఆటంకమును తొలగించి, మన సంఘముపై నున్న కళంకమును పోగొట్టుకొను అవకాశము గల్గినది. మహాత్ముడు ప్రాయోపవేశము చేయుట కూడ అందులకే. మనలో నొకరగు హరిజనులను వేరు చేయుటవలన రాజకీయముగ మనకెన్నియో నష్టములు కలుగుచున్నవి.

మహాత్ముడు చెప్పినట్లు, విభిన్నమతములకు చెందిన ముసల్మానులు, సిక్కులు, యూరపియనులు రాజకీయముగ వేరువేరుగా నుండవచ్చునుగాని, హిందూజాతిలోని వారగు హరిజనులు వేరుగా నెట్లుందురు ? వీరిని కూడ వేరుగా నుంచి; హిందూ జాతియందు అనేకభేదములను కలిగించుటకు, పాశ్చాత్య ప్రభుత్వమువారు చేసిన ప్రయత్నములను ప్రతిఘటించుట కూడ గాంధీ మహాత్ముని మహోద్దేశములలో నొకటి.

"అస్పృశ్యత ఉన్నదనుటకంటె హిందూ జాతి నశించినదనుట మేలు అని మహాత్ముడు చెప్పియున్నాడు. అదే సందర్భమున, 'దేశమునకు స్వాతంత్ర్యము వచ్చిననుకూడ, హరిజనుల రక్షణను వదలుకొనుటకు నేను యిష్టపడను' అని మహాత్ముడు పలికెను.

మహాత్ముని ఉపవాసమునకు ఫలితముగ యీ హరిజనోద్యమమునెడ దేశమంతయును సుముఖత గాంచెననియు, యీ ఉద్యమము బాగుగా అభివృద్ధి పొందెననియు, 1936వ సంవత్సర నివేదికనుబట్టి తెలియుచున్నది. మన దేశమునందలి అన్ని రాష్ట్రములలోను ఖర్చు పెట్టబడిన 4 లక్షల రూపాయలలోను ఒక్క మదరాసు రాష్ట్రములోనే 108000 రూపాయలు ఖర్చుపెట్టబడెననియు, మొత్తము మీద 27 రాష్ట్రీయ సంఘములును, 200 పైన జిల్లా కమిటీలును పని చేసిననియును కూడ తెలియుచున్నది.

హరిజన సమావేశములను గురించియు హరిజనులకు మతబోధను గురించియు, హరిజన హాస్టలులు హరిజనాశ్రమములను గురించియు మనము యీ రోజులలో తరచు వినుచున్నాము. హరిజనులకు వృత్తి విద్యలను నేర్పుట, ప్రత్యేక ఆరోగ్య సూచనలను చేయుట మొదలగు యీ ప్రచారము లన్నిటినిబట్టి హరిజనోద్యమము నేడెంత ప్రాముఖ్యము వహించియున్నదో, మనము గ్రహింపవచ్చును. ఈ ప్రచారమునకు మహాత్ముడు తన సబర్మతి ఆశ్రమమును అర్పించుటనుబట్టి యీ ఉద్యమమునకు గల ప్రాముఖ్యము వెల్లడి కాగలదు.

ఇటీవల నేను కథిమపాడునందు సంచారము చేసినప్పుడు, మార్విసంస్థానమునకుపోయి అచ్చట నొక హరిజన పల్లెను చూచితిని ఆ పల్లె పరిశుభ్రతను చూచినచో మన దక్షిణ ఇండియాలోని బ్రాహ్మణాగ్రహారము కూడ సిగ్గుపడవలసి వచ్చును. భావనగరు, పోరుబందరుల యందు కూడ నేను కొన్ని హరిజనసంస్థలను చూచితిని. ప్రతిచోటను తమ సంస్థలకు ఆగంతుకులను తీసికొనివెళ్లి చూపుట హరిజనులు యెక్కువ ఉత్సాహమును కనబరచుచున్నారు.

ప్రతిచోటను ప్రజలు యీ ఉద్యమమునెడ ఉత్సాహమును, యిన్నాళ్లు యీ జాతిని త్రొక్కిపట్టి ఉంచినందులకు పశ్చాత్తాపమును

ఆంధ్రపత్రిక
1937 జూలై 7
సంచిక నుంచి

పరచుచున్నారు. ఈ స్వదేశీ ఉద్యమము జాతీయోద్యమము హరిజనోద్యమము మొదలగునవి గాంధిమహాత్ముని పుట్టుకకు పూర్వము నుండియు ఉన్నవే.

యుగాల్ల నుండి పడిన బాధల యీ జాతి నేడు దేశదృష్టిని ఆకర్షించి, ... అనిపించుకొన్నవారే నేడు అదృష్టవంతులు. ఈ జాతికి నేడు తక్కిన వారితో సమానత్వము కలిగినది.

సర్ శామ్యూలు హోరునకు ... వ్రాయుచు, 'శతాబ్దముల నుండి నిమ్నజాతుల యెడ హిందువులు సలిపిన అన్యాయములకు, వారు యెంత తపస్సు చేసినను ప్రతిఫలము నివ్వజాలరు కాని నిమ్నజాతులకు ప్రత్యేక నియోజకవర్గముల నిచ్చినంత మాత్రమున ఆ అన్యాయము పోదు. అందువలన నిమ్నజాతులకు ప్రత్యేక నియోజకవర్గమునిచ్చి, ప్రభుత్వము వారు, వారిని హిందువుల నుండి వేరుపరచ దలచుకొనినయెడల, నేను ఉపవాసము చేసి చచ్చిపోవుదును' అని శపథము పట్టినాడు. ఆయన ఉపవాస మారంభించుటతోడనే ప్రపంచ మంతటను సంక్షోభముకలిగినది.

దేశదేశముల నాయకులు జోక్యము కలిగించుకొనిరి. చిట్టచివరకు, హరిజనులకు తాము చేసిన అన్యాయమును గ్రహించుకొని సవర్ణులందరును, యీ అవర్ణులయెడ ఆదరణను చూపు ఫలిత మేర్పడినది.

గాంధిమహాత్ముడు హరిజనోద్యమమును ప్రారంభించకపూర్వమే, బ్రహ్మసమాజము వారగు కందుకూరి వీరేశలింగంపంతులు, సర్. ఆర్. వెంకటరత్నం నాయుడు మొదలగువారు మన ఆంధ్రరాష్ట్రమున హరిజనాభివృద్ధి కొరకు పాటుపడిరి.

1901 సంవత్సరములో, పొన్నేరి రైల్వే స్టేషనుయందు దిక్కులేకయున్న నలుగురు మాలపిల్లలను చూచి సర్. ఆర్. వెంకటరత్నం నాయుడు, ఆ పిల్లలను కాపాడవలసినదని నన్నును, పిఠాపురం దివాను కీ॥శే॥ మొక్కపాటి సుబ్బారాయుడుగారిని కోరిరి. పోలీసువారితోను రైల్వే పోర్టర్లతోను యెంతో ప్రతిఘర్షణను చేసి, ఆ ప్రదేశపు మేజస్ట్రేటు సహాయముతో ఆ పిల్లలను కాపాడితిమి. ఆ పిల్లలు నేడు విద్యావతులయి యున్నారు. వారిలో కడపటి యిద్దరును యిరువురు బ్రాహ్మణ యువకులను పెండ్లాడి సంసారము చేయుచున్నారు. అప్పటినుండియు, హరిజనాభివృద్ధికి నేను చాల గొప్ప సహాయము చేయుచు పొంగిపోతిని. 1906 సంవత్సరములో నేను ప్రాక్టీసు పెట్టినప్పటినుండియు, నా ఇంటిముందు పనిచేయుటకొక హరిజన బాలకుని నియోగించుకొంటిని.

1906 నుండి 1920 వరకును ప్రచారమందున్న యీ ఉద్యమమువలన ఫలితమేమి ? ప్రజలందరును యీ ఉద్యమమున జోక్యము తీసుకొనువారిని కులభ్రష్టులని అప్రతిష్ఠపాలు చేయుచుండిరి.

1910 సంవత్సరములో మేము ఆంధ్ర జాతీయ కళాశాలను స్థాపించి, అందు సవర్ణ విద్యార్థులతో సమానముగ అవర్ణులను కూడ కూర్చుండబెట్టు సరికి, మా ప్రాంతములలో గొప్ప గందరగోళము జరిగినది. మాలపిల్లవానిని, మా బావి ముట్టుకొన నిచ్చినందులకు ఎంతో అలజడి కలిగినది. నేను అద్దెకువున్న యింటిని ఖాళీచేయవలసినదని మా యింటి యజమాని నన్ను యింటి నుండి వెళ్లగొట్టెను. మా కళాశాలకు విరాళముల నిచ్చినవారందరును, హరిజన బాలురను కళాశాలలో చేర్చిన యెడల విరాళముల నివ్వమని బెదరించిరి. కాని మేము బెదరలేదు.

1915 సంవత్సరములో మా పట్టణపు మ్యునిసిపలు పాకీవాండ్రకు నేనొక కోఆపరేటివ్—సంఘమును స్థాపించితిని. మా మ్యునిసిపల్ కౌన్సిలర్లు అట్టి వేమియు యిష్టపడెడువారు కారు. మొదట యీ కో-ఆపరేటివ్ సంస్థయెడ యెన్నియో ప్రతికూల భావములు ఆరంభమైనవి. కాని యీ సంఘమును ఆరంభించిన పది నెలలోనే అడ్వాన్సు క్రింద 1500 రూపాయలు చేర్పబడినవి. ఈ సంస్థ యెంతయో ఉచ్ఛస్థితికి వచ్చినది. హరిజనులలో యెక్కువ మంది త్రాగుడును మానివైచినట్లు ప్రచారము జరిగెను. మహాత్మునికి పూర్వము యీ ప్రచారమును చేసినవారికి ప్రజల ఆదరణ తక్కువగా నుండినది. పైన చెప్పిన రీతిని, గత 30 సంవత్సరములలోను, జరిగిన హరిజనోద్యమమును జ్ఞప్తికి తెచ్చుకొనవచ్చును.

మొన్న జరిగిన ఎలెక్షనులనుబట్టి రాజకీయముగా హరిజనుల సాంఘిక స్థితిని ఉన్నతికి తెచ్చుటకు అవకాశము కలదని తేలింది.

సవర్ణులు కూడ తమను ప్రాధేయపడి అడుగవలసిన ఓటు అను హక్కు తమకు కూడ కలదని హరిజనులు గుర్తించిరి. కాంగ్రెసు సవర్ణులందరును, కాంగ్రెసు పక్షమున యెన్నికలందు పోటీచేసిన హరిజనులకు జాతి భేదము లేకుండా సహాయము చేయుట తమ బాధ్యత యని గుర్తించిరి.

ఇంత ఉన్నను, అస్పృశ్యతా నివారణయెడ కొంత ప్రతికూల భావ మింకను వ్యాప్తి యందున్నది. ఇందులకు కారణము సవర్ణుల అధిక స్వార్థమును, మత సంప్రదాయమును అయియున్నవి.

హరిజనుడెవరైనను మంత్రి అయినచో మనము ఆ హరిజన పల్లెకుపోయి అతనిని సందర్శించవలదా అనియు, అట్లయిన, యీ హరిజనులలో నెవరైనను మన పొలముల దున్ని కమత చేయుటకు వచ్చెదరా అనియును సవర్ణులు సందేహపడుచున్నారు.

నిజమేకాని హరిజనులు కమతముచేయుటను నిరసించరుకాని, మునుపటివలె, కుక్కలవలె నీచముగా చూడబడుటకు వారు సహింపరు.

ఆంధ్రదేశములోని హరిజనులలో యెక్కువ మందీ పాలికాపు పని చేయువారే. నిజము చెప్పవలసినచో వారందరును సగము తిండి మాత్రమే తినుచున్నారు.

కొన్ని యెకరముల భూమిని, కొంతమంది హరిజనులకు పదేళ్ళ అయిదేళ్ళకు కవులుకు యిచ్చుట వలన యీ హరిజనుల ఆర్థిక దుస్థితి

# భారతి

సాహిత్య
మాసపత్రిక



తెనుగువారి
సంస్కృతికి
ప్రతిబింబం



విడి పత్రిక: రూ. 4/-


## హరిజనోద్యమాభివృద్ధి:

బాగుపడగలదు. ఇందుకుగాను కో-ఆపరేటివ్ సొసైటీలేర్పడుట యుక్తము.

ఇట్టి పరిస్థితిపై మేము కృష్ణాజిల్లా యందొక సంఘమును స్థాపించుటకు ప్రయత్నించితిమికాని, అప్పటి మంత్రివర్గమువారు దానిని భస్మముచేసిరి. ఇదివరకు నిమ్న జాతులకు ప్రభుత్వమువారు గ్రాంటుచేసిన భూమి నేడు వారి చేతులనుండి వారికి అప్పుపెట్టిన షావుకారు చేతులలోనికి పోయినది. పల్లెటూర్లయందలి హరిజన రైతులు యెన్నియో కష్టములను అనుభవించుచున్నారు.

హరిజనులకు ప్రత్యేక హాస్టలులను, ప్రత్యేక పల్లెలను, ప్రత్యేక బావులను యేర్పాటు చేయుట వలన, అస్పృశ్యత పోదు. ఏమనిన, అట్లు చేయుటవలన హరిజనులు వేరుగానే వుండిపోవుచున్నారు.

ప్రపంచ కార్మికులారా ఏకము కండు. మీ చేతి సంకెలలు తప్ప, మీరు పోగొట్టుకొనదగిన దేదియులేదు అను సూత్రము యీ హరిజనుల పట్ల యెంతయో సత్యముగా వర్తించుచున్నది. మన పల్లెటూళ్లలోని హరిజనులకు, పోగొట్టుకొనుటకు యేమున్నది వారికి కడుపునిండ అన్నమేలేదు. అందువలన కడుపు మంటను బాపుకొనుటకు వారు దొంగతనములను చేయవలసికూడ వచ్చుచున్నది. అందువలన, హరిజనులను తాకుచు,అస్పృశ్యతను బాపినంతమాత్రమున యేమియును లాభములేదు. హరిజనుల ఆర్థిక పరిస్థితిని చక్కబరచవలయును.

హరిజనులనుగూడ మీతోటివానిగ భావించి మీ సోదరుని అభివృద్ధికి పాటుపడినట్లేపాటుపడినచో భారతదేశ స్వాతంత్ర్యము త్వరలోరాగలదు. ఆర్థికముగ వారికి మనము ఔన్నత్యము ఇవ్వనిచో, దేవాలయ ప్రవేశము నిచ్చియు లాభములేదు. హరిజనోద్యమము, సంఘములో స్వపారిశుద్ధ్యము నకేగాక, సంఘాభివృద్ధికిగూడ అవసరము. ఈ ఉద్యమము, సాంఘిక, మత రాజకీయ, ఆర్థిక సమస్యలన్నిటికిని సంబంధించినది.

కావున ఇన్నాళ్ళు మనలో నొకజాతికి మనము చేసిన అపకారమునకు, ప్రతికూలముగ, ఆ జాతి అభివృద్ధికి సహాయపడుటకు సిద్ధము కండు.

అప్పుడే మనకు దేశీయ స్వాతంత్ర్యము లభించగలదు.

### తీర్మానములు

(1) ఈ హరిజన మహోద్యమమును ప్రారంభింపజేసిన శ్రీ గాంధీమహాత్మునకు ఈ మహాసభవారు తమ గౌరవ పరస్పరమగు వందనములను తెలియజేయుచు, తమకు చేతనయినంత బాగుగా యీ ఉద్యమమును కొనసాగింతుమను నిశ్చయమును ప్రకటించుచు బరంపురం పౌరులను గంజాం జిల్లా ప్రజల నీ పవిత్రమగు హరిజనోద్ధరణ కార్యమునకు తమ హృదయపూర్వకమగు సహాయము తోడ్పాటును ఒసంగవలయునని హెచ్చరించుచున్నాను.

(2) తిరువాన్కురు మహారాజావారును వారి దివానుగారును లాఠీ ఠాకూరు సాహెబుగారును తమ సంస్థానానములలోని అన్ని దేవాలయములందును హిందువులలోని అన్ని వర్ణముల వారికిని హరిజనుల సహా ప్రవేశమిచ్చు ప్రకటనలు గావించినందుకు యీ సభవారు తమ హృదయపూర్వకమగు అభినందనముల నర్పించుచు, భారతదేశములోని అన్ని దేవాలయముల ధర్మకర్తలును అందు ముఖ్యముగ, యీ జిల్లాలోని వారు పై మార్గదర్శకుల గొప్ప చర్యను అనుసరించి హిందూ సంఘము యొక్క బలమును ఐకమత్యమును కాపాడుదురుగాక యని యీ సభవారు హెచ్చరించుచున్నారు.

(3) బరంపురములోను గంజాం జిల్లాలోను ఉత్తర విశాఖపట్నము జిల్లాలోను ఆంధ్ర ఉత్కళ హరిజనుల ఎల్ల తెగలవారిని ఉద్ధరించుటకు పాటుపడి సేవ చేసిన అసంఖ్యాకులగు నాయకులకును ప్రచారకులకును సేవకులకును వారి స్వార్థరహిత ప్రయత్నములకు ఈ మహాసభవారు తమ హృదయపూర్వకమగు వందనములు తెలుపుచు, వారందరును కలిసి ఐకమత్యముగా చిన్న చిన్న విభేదములు తగవులు మరచిపోయి పని చేయవలెననియు, అస్పృశ్యతా దోష కళంకమును వీలయినంత శీఘ్రముగా తొలగించి వేయుటకు మార్గము ఏర్పరచ వలెననియు యీ సభవారు హెచ్చరించుచున్నారు.

(4) బరంపురము మున్సిపాలిటీవారును, గంజాము జిల్లా ఉత్తర విశాఖపట్టణము జిల్లా బోర్డుల వారును హరిజనుల యొక్క పారిశుధ్యము, గృహ వసతులు విద్య వైద్య సహాయము మొదలగు అవసరముల గూర్చి ప్రత్యేక శ్రద్ధ చూపవలెననియు, తమ క్రింద నుండు సంస్థలలో వీలయినన్ని హెచ్చు నౌకరీలు హరిజనులకు యిచ్చు ఏర్పాట్లు గావింప వలెననియు ఈ మహాసభవారు కోరుచున్నారు.

బరంపురము ఒరియా మిడిల్ స్కూలుల్లో హరిజన విద్యార్థులకు స్కూలు జీతములు లేక చదువు చెప్పుటకో స్కాలరుషిప్పులు గ్రాంటు చేయుటకో గూర్చి బరంపురము మున్సిపాలిటీవారు ప్రత్యేకముగ శ్రద్ధ వహింపవలెనని ఈ సభవారు కోరుచున్నారు. ఉచిత వైద్య సహాయ అవసరమును గూర్చి బరంపురము హరిజనులు పెట్టుకొనిన మొరలను పురపాలక సంఘమువారు ప్రత్యేక శ్రద్ధతో గమనించవలెననియు ఈ మహాసభవారు హెచ్చరించుచున్నారు.

# కళ్లు...






# వాటిలో భావాలొలికించండి

నవ్వు. సంతోషం. కోపం. విచారం. ఈ భావాలన్నిటినీ మీ కళ్లు మరింత ప్రస్ఫుటంగా వ్యక్తం చేయగలవు...శింగార్ డీలక్స్ కాటుకతో. ఇది మరింత నల్లనిది, మరింత నిగనిగలాడేది. ఎంతో చల్లనిది! ప్రత్యేకంగా రూపొందించబడింది, అంచేత కళ్లకు మంట పుట్టించకుండా అందాలన్నీ చిందిస్తుంది.




## శింగార్
డీలక్స్ కాటుక

కళ్లకు మంచిదైన ఒకే ఒక కంటి సౌందర్య సాధనం.

everest/83/SH/179rtl

# మహాపురుషలక్షణం

## ద్విభాష్యం రాజేశ్వరరావు

"మన ఎదురుగా కొత్తగా కట్టిన ఇంట్లో 'ఆర్. టి. వో.' ఆఫీసు పెట్టేరు. ఇంక మీరు స్కూటరు టెక్కు కట్టడానికి ఎక్కడికో దూరంగా వెళ్ళాల్సిన అవసరంలేదు. ఎదురింటిని ఆఫీసుకోసం పదిహేను సంవత్సరాలు 'లీజు' తీసుకున్నారట !" అంది మా ఆవిడ నాకు మజ్జిగ వడ్డిస్తూ.

"పిల్లల్ని మాత్రం జాగ్రత్తగా చూసుకో! 'ఆర్.టి.వో'. ఆఫీసు అనగానే రోజూ బోలెడు కార్లు, స్కూటర్లు, లారీలు ఇట్టే వస్తూ వుంటాయి. రోడ్డు మహా రద్దీగా తయారవుతుంది. మన పిల్లలు ఇంట్లోంచి రోడ్డుమీదకు రాకెట్‌లా దూసుకుపోతూ వుంటారు. వాళ్ళని ఓ కంట కనిపెట్టి వుండకపోతే ఏ లారీక్రిందో పడతారు" అన్నాను చేతులు కడుక్కొని ఆదరా బాదరాగా ఆఫీసుకు తయారవుతూ. ఆ హెచ్చరికతో 'ఆర్. టి. వో' ఆఫీసు గురించి పూర్తి జాగ్రత్త తీసుకున్నానని పొరపడ్డాను నేను!

అక్కడితో ఆ సమస్య తీరిపోయిందనుకున్నాను!

కాని, నిజానికి కథ అక్కడే ఆరంభమయింది !!

* * *

ఆ మరుసటి మధ్యాహ్నం లంచ్ సమయంలో 'అర్జెంటు స్టేట్‌మెంట్లు' టైపు చేస్తూవుంటే లక్ష్మణమూర్తి వచ్చాడు ! వాడు మా సెక్షన్‌లోనే సీనియర్ క్లార్కు! మేమందరం ముద్దుగా వాణ్ణి జిడ్డు లక్ష్మణమూర్తి అని పిల్చుకుంటాం! "బ్రదర్ ! నేను పాత పోస్టాఫీసు దగ్గిర వుంటున్నాను. నీకు తెలుసుకదా !" అంటూ ఆగేడు. తర్వాత గొంతుక సవరించుకున్నాడు. కుర్చీ నా టేబిలుదగ్గిరగా లాక్కుని అందులో కూలబడ్డాడు. నుదిటిమీద పడుతున్న ముంగురులని సినీమా హీరోలా సర్దుకున్నాడు. జేబులోంచి సిగరెట్టు తీసి దాన్ని అగ్గిపెట్టెమీద దట్టించటాన్కి మెల్లిగా కొట్టి తర్వాత వెలిగించేడు.

విలాసంగా పొగ వదులుతూ మళ్ళీ అడిగేడు "నేను పాత పోస్టాఫీసు దగ్గిర వుంటున్నాను తెలుసుకదా ?"

రవంత చికాకు కల్గినా అది మొహంలో కనబడనీయకుండా "ఎందుకు తెలీదూ ?" అంటూ ఎదురు ప్రశ్న వేశాను.

"పాత పోస్టాఫీసు నుండి మధురానగర్‌కి— అంటే మీ ఇంటికి దూరమెంత ?" అని మళ్ళీ ప్రశ్నించాడు. ఉపోద్ఘాతంతో ఎదుటి మనిషిని తినేస్తాడు ! అసలు సంగతి చెప్పడు !

"సుమారు నాలుగు కిలోమీటర్లు వుండొచ్చు !" అన్నాను నా చికాకు అణిచిపెట్టుకుంటూ.

"అంటే మీ యింటికి రావాలంటే ఎన్ని సిటీబస్సులు మారాలి ?"

"మునుపటి రోజుల్లో అయితే ఒకటే ! ఇపుడు 'నోడల్ సర్వీసు' వచ్చింది కదా ! ప్రక్క స్టాపుకు వెళ్లాలంటే 'ఆర్. టి. సి. కాంప్లెక్స్' వెళ్ళి మళ్ళీ పక్క స్టాపుకు రావాలి ! అంటే కనీసం రెండు బస్సులు మారాలి !" అన్నాను టైపింగు ఆపేస్తూ. ఇంకెలాగూ నా పని తెమలదు ! కనీసం వాడిపని అయినా తెమిల్చి పంపితే ధన్యుడనవుతాను !

"ప్రక్క స్టాపుకు వెళ్ళాలంటేనే రెండు బస్సులు మారాలంటే మీ ఇంటికి రావాలంటే కనీసం మూడు బస్సులు మారాలి ! అంటే అధమపక్షం మూడు ముప్ఫయిలు తొంభయి పైసలు ! రానూపోనూ రూపాయి ఎనభై పైసలు ! అదీకాక ఒక్కొక్క బస్సు కోసం అధమం ఒక జీవిత కాలం నిరీక్షించాలి ! అంటే మీ ఇంటికి రావటానికి మూడు జీవిత కాలాలు పడుతుంది ! కానీ, ఈ జీవిత కాలంలో అర్జంటుగా నేను నిర్వహించవలసిన బాధ్యత ఒకటుంది ! అది నా 'డ్రైవింగ్ లైసెన్సు'కు ఫోటోలు అంటించి 'ఆర్. టి. వో' ఆఫీసులో సంతకాలు పెట్టించటం ! ఈ మధ్య కొత్తగా రూలు వచ్చింది కదా ! లైసెన్సు దగ్గరలేకుండా కనీసం 'మోపెడ్' తొక్కినాసరే, వాళ్ళు పట్టుకున్నారంటే తడిసి మోపెడు అయిపోతుంది మనకి ! అందుకని నువ్వు నాకీ సహాయం చేయాలి ! ఇవిగో ఫోటోలు ! 'ఇది నా డ్రైవింగ్ లైసెన్సు.' ఈ పని చేయించావంటే నీ ఋణం మరో విధంగా తీర్చుకుంటాను !" అన్నాడు.

ఏ మాత్రం ఆలస్యం చేయకుండా వాడి నుండి ఫోటోలు, కాగితం లాక్కొని డ్రాయరులో పడేశాను.

"ఈ మాత్రానికేనా ? తప్పకుండా చేయిస్తాను !" అంటూ అతడివేపు 'ఇక నువ్వు వెళ్ళొచ్చు !' అన్నట్లు చూసేను.

వాడు వెళ్ళిన రెండు నిమిషాలు తిరక్కుండానే బైరాగి మూర్తి వచ్చాడు ! వాడు లాబరెటరీలో టెక్నికల్ అసిస్టెంటుగా పని చేస్తున్నాడు. లాబరెటరీ కూడా మా ఆఫీసు బిల్డింగులోనే ఒక వైపుకు వుండటం వల్ల సాధ్యమయినంతవరకూ 'ఎక్కవుంట్సు సెక్షను' లోనే తిరుగుతూ వుంటాడు వాడు! 'కార్మికులకి కొత్తగా అప్పులిచ్చే పథకాలు ఏవైనా వచ్చాయా?' అంటూ నిరంతరం అన్వేషిస్తూ వుంటాడు.

"అమ్మయ్యా ! లంచ్ సమయంకదా, ఎటయినా వెళ్లిపోయావేమోననుకున్నాను !" అంటూ కుర్చీలో సెటిలయిపోయాడు.

"ఏమిటి కథ ?" అన్నాను.

"ఈవేళ ఉదయం సౌజన్యంగారు మా ఇంటికి వచ్చేరు" అన్నాడు.

"సౌజన్యంగారు ఎవరు ?" అన్నాను.

నా తెలియని తనానికి సిగ్గుపడుతున్నట్లు తల ఆడించి తర్వాత ఫెళ్లున నవ్వేడు బైరాగిమూర్తి.

"సౌజన్యంగారు తెలీదూ ? నువ్వు ఆంధ్రప్రదేశ్‌లో వుంటున్నావా ? అండమాన్ నికోబారు దీవుల్లో వుంటున్నావా ?" అంటూ ఎదురు ప్రశ్న వేశాడు.

తెల్లబోయినట్లు కాసేపు మౌనంగా వుండిపోయాను.

"సౌజన్యంగారు ఇంతకుముందు ప్రభుత్వంలో సెక్రెటరీగా పని చేశారు. ఈ మధ్యనే కొత్త ప్రభుత్వం వచ్చాక రాజీనామా చేసి ఈ వూరు వచ్చి 'పండరీపురం'లో ఇల్లు కట్టుకుని సెటిల్ అయిపోయారు. మా ఇంటి ఎడంప్రక్క ఇల్లే ఆయనది ! కుడిప్రక్క ఇల్లు తెలుసుకదా, మాజీ రాష్ట్రపతిగారి అల్లుడు తమ్ముడిది ! అంటే వీరేశ్వరప్రసాద్‌గారన్నమాట! మా ఎదురిల్లు మాజీ పాడి పరిశ్రమ శాఖా మంత్రిగారిది ! ఏవో గొడవలొస్తే అప్పట్లో రాజీనామా చేసేరులే ! ఆయన ఇంట్లో స్విమ్మింగ్‌పూల్ కూడా వుంది ! కాస్త అవతలికి వెళ్తే రంజిత్ గారిల్లు ! ఆయన దుబాయ్‌లో ఇంజనీరుగా వుంటున్నారు. నెలకి ముప్ఫయివేలు




జీతం ! ఆయన ఇంటి కిచెన్‌లో పెట్టిన పొగ గొట్టం అమెరికాలో వెయ్యి డాలర్లు పెట్టి కొన్నారట ! నేలమీద పరిచిన రాళ్ళు బేతంచెర్ల నుండి పబుల్ పాలిష్ పెట్టి తెప్పించారు. కాస్త సముద్రం వేపుకు వెళ్తే మన రాజాగారిల్లు ! చాలా మంచివాడు ! నేను ఇల్లు కడుతూ వుంటే నాకు సిమ్మెంటుకు సహాయం చేశాడు ! వీళ్ళందరూ మనకి స్నేహితులయిపోయారు ! ఇంతమంది స్నేహితులయిపోవటం వల్ల మనకి 'ఆబ్లిగేషన్స్' తప్పటంలేదు ! ఇంతకీ నేను ఏదో చెప్పబోయి బోలెడు కథ చెప్పేశాను ! నేను ఎవరి గురించి మాట్లాడుతున్నానో జ్ఞాపకం వుందా ?'' అంటూ ఆగేడు.

నాకు అప్పటికే కుర్చీలో చిన్న కునుకు పడుతోంది ! వాడి ఆఖరు ప్రశ్నతో తెలివి వచ్చింది.

ఆర్జెంటు పేపర్లు టైపు చేయటం అవలేదు, అది అయితేగాని భోజనానికి వెళ్లటం కుదరదు ! ఆకలి, నీరసం అన్నీ ముంచుకొస్తున్నాయి !

బైరాగిమూర్తి వదిలిపెట్టేలా లేదు !

''నువ్వు పాంచజన్యంగారి గురించి మాట్లాడినట్లు జ్ఞాపకం ... '' అంటూ ఆవులించి చిటికెలు వేసుకున్నాను.

''మధ్యాహ్నం పూట ఆవులింతలేమిట్రా ? అదీ ఆఫీసులోనా ? అంటే నీ ఆరోగ్యంలో ఏదో లోపం వుందన్నమాట! మధ్యాహ్నం ఆవులించటం చాలా చెడ్డ లక్షణమని నిన్న సాయంకాలం మాలతీ కేస్కర్ చెప్పింది ... మాలతీ కేస్కర్ తెలుసుకదా ?''

''తెలీదు !''

మళ్ళీ పెళ్ళున నవ్వేడు బైరాగిమూర్తి !

''మాలతీ కేస్కర్ వుమెన్స్ కాలేజీలో కరాటే ఫైటింగ్ నేర్పుతుంది ! ఫల్గుణా కేస్కర్ కూతురు ! ఆయనకి ఊరు చివర పెద్ద బిస్కెట్ల కంపెనీ వుంది ! యు. పి.లో ఒక పేపరు మిల్లులో బోలెడు షేర్లు వున్నాయి !

నేనూ, మాలతీ కేస్కర్ కలిసి రోజూ మార్నింగ్ వాక్‌కి వెళ్తుంటాం! మా ఆవిడ పర్మిషన్ ఇచ్చిందిలే!... అవును! మీ అబ్బాయికి ఇంటర్మీడియెట్‌లో సీటు దొరికిందా?'' అన్నాడు.

''ఇంతవరకూ దొరకలేదు! అన్ని కాలేజీలకూ అప్లికేషన్లు పెట్టాను! నువ్వు కాస్త సహాయం చెయ్యరాదూ?'' అన్నాను.

''నువ్వేం భయపడకు! మీ అబ్బాయికి సీటు ఖాయం!'' అన్నాడు.

నా చెవులను నేనే నమ్మలేకపోయాను!

''నీకు చాలా ఋణపడి వుంటాను!'' అన్నా.

''శివనారాయణమూర్తిగార్కి చెప్తానులే! ఇంతకీ శివనారాయణమూర్తిగారంటే ఎవరనుకున్నావ్?'' అన్నాడు.

తెలియనట్లు మొహం పెట్టేను.

నా అజ్ఞానానికి మళ్ళీ పెళ్ళున నవ్వేడు బైరాగిమూర్తి.

''ఒక ప్రముఖ కాలేజీకి సెక్రేటరీ! రాజు తల్చుకుంటే దెబ్బలకు కొదవా? ఆయన తల్చుకుంటే కాలేజీలో సీటు తక్షణం ఇప్పించగలడు! ఆయన మా 'పండరీపురం లేఅవుట్'లోనే ఇల్లు కట్టుకున్నారు! నీకు భాగ్యరాజా తెలుసుకదా? వాళ్ళింటి ప్రక్కదే శివనారాయణమూర్తిగారిల్లు!'' అన్నాడు.

మళ్ళీ దొరికిపోయాను!

''భాగ్యరాజా ఎవరు?'' అన్నాను.

ఈసారి వాడు నవ్వలేదు! నా వంక అడివి మనిషివేపు చూసినట్లు చూశాడు.

''నీకు శ్రీ ఎన్టీరామారావు తెలుసునా?'' అన్నాడు.

సిగ్గుతో ''ఎందుకు తెలీదూ?'' అన్నాను.

''హైదరాబాద్‌కు ఎన్టీ రామారావు ఎలాగో, మన విశాఖపట్నానికి భాగ్యరాజా అలాగ! ఆయనకి పొజిషన్ వుంది, ఈయనకి పొజిషన్ లేదు, అంతే తేడా! ఈయనకి ఈ వూళ్ళో అపోజిషన్ కూడా లేదు, అదీ సంగతి! నువ్వి విశాఖపట్నంలో బ్రతకటానికి పనికిరావు!'' అన్నాడు.

భాగ్యరాజాను గురించి కనీసం ఇంతవరకూ నేను విననందుకు సిగ్గుపడ్డాను.

''ఇంతకీ నేను ఎవరి గురించి చెప్తున్నానూ?...''

''పాంచజన్యంగారి గురించి...'' అన్నాను.

''పాంచజన్యంగారు కాదు, సౌజన్యంగారు... ఆయన ఉదయం స్వయంగా మా ఇంటికి వచ్చేరు. వచ్చి ఓ చిన్న సహాయం చెయ్యమన్నారు. ఆయన లైసెన్సుకి ఫోటోలు అతికించి ఆఫీసులో సంతకాలు చేయించాలిట! చేస్తానని మాట ఇచ్చి అవి తీసుకున్నాను. ఆయన పెద్దవాడు కదా! మనం సహాయం చేస్తే పుణ్యం, పురుషార్థం దక్కుతాయి. ఎలాగూ ఆ ఆఫీసు మీ ఇంటిముందే కదా, నీకిచ్చిపోదామని వచ్చేను! ఈ పని చేయించి రేపు సాయంకాలం మీ అబ్బాయిని తీసుకురా, శివనారాయణమూర్తిగార్కి పరిచయం చేస్తాను...'' అని రెండు క్షణాలాగి ''రేపు వద్దులే! ఎల్లుండి సాయంకాలం రా!'' అన్నాడు.

''అలాగే! ఆ కాగితాలు ఇవ్వు!'' అంటూ బైరాగిమూర్తి దగ్గరనుండి సౌజన్యంగారి లైసెన్సు కాగితం, ఫోటోలు తీసుకున్నాను.

''రేపు సాయంకాలం నిన్ను ఎందుకు రావద్దన్నానో తెలుసా?'' అంటూ అడిగేడు.

''తెలీదు!''

''రేపు సాయంకాలం భాస్కర మహదేవ్ వాళ్ళింటికి 'టీ'కి పిల్చేరు! అక్కడికి వెళ్ళాలి! మా పండరీ పురంలోనే సముద్రపొడ్డు ఇల్లు వాళ్ళది! మహదేవ్ తెలుసుకదా?'' అన్నాడు.

తెలియదనబోయి నాలిక కరుచుకుని ఊరుకున్నాను.

''మహదేవ్ స్టీలుప్లాంటులో కంట్రాక్టరు! లక్షలకొద్దీ వ్యాపారం! ఈ వూళ్ళో నాలుగు ఐస్ మిల్లులు వున్నాయి! వాళ్ళ వూర్లో ఆరు రైసుమిల్లులున్నాయి... మా ఆవిడకీ వాళ్ళావిడకీ మంచి దోస్తీ! నాకు ఎప్పుడయినా అర్జెంటుగా ఫోన్ చేయాలంటే వాళ్ళింటికి చెయ్! నెంబరిస్తాను! వెంటనే కబురుపెడతారు!'' అన్నాడు.

''అయితే నీకు పెద్ద పెద్ద వాళ్ళందరూ మిత్రులయిపోయారన్న మాట!'' అంటూ వాడిచ్చిన కాగితాలు జాగ్రత్త చేశాను.

బైరాగి మూర్తి కుర్చీలోంచి లేస్తూ ''ఈవేళ తిథి ఏమిటి?'' అన్నాడు సీరియస్‌గా.

''ద్వాదశి'' అన్నాను ఎందుకు అడిగాడో అర్థంకాక చూస్తూ.

''ఈ వేళ ద్వాదశి... అంటే రేపు త్రయోదశి... ఎల్లుండి చతుర్దశి... తర్వాత పౌర్ణమి!...'' అని గొణుక్కుంటూ వెళ్ళిపోయాడు. వాడు వెళ్ళినవంకే తేరిపారచూస్తూ వుండిపోయాను. అంతలోనే నాయుడు హడావుడిగావచ్చి ''పున్నమినాగు వెళ్ళిపోయాడా?'' అన్నాడు.

అర్థంకానట్లు నాయుడువంక చూశాడు.

''వాడే బైరాగిమూర్తి! వాడు బీచ్ దగ్గరలో ఇల్లు కట్టుకోవటం కాదుకాని పున్నమి ముందు మూడు రోజులు, తర్వాత మూడు రోజులు సాయంకాలంనుంచీ రాత్రివరకూ బీచ్‌లో ఇసకలో పడి దొర్లుతున్నాడు. 'పండరీపురం లేఅవుట్'లో పెద్దవాళ్ళమధ్య వీడిల్లు కట్టేడు కదా, అప్పటినుండీ వీడి ధోరణి మారిపోయింది'' అన్నాడు నాయుడు.

''అవును మరి! విశాఖపట్నంలో 'పండరీపురం లేఅవుట్' అంటే బొంబాయిలో 'జుహూ బీచ్' 'ఏరియా'లాంటిదన్నమాట! విశాఖపట్నానికి అదొక 'స్టేటస్ సింబల్!' ఇంత సుందరమైన సముద్రపొడ్డు, అందులోనూ పండరీపురంలాంటి కోలనీ; మరి ఆసియాలో ఎక్కడా కన్పించదని ప్రఖ్యాత సినీదర్శకుడు భానుచందర్ 'కాకమ్మకథ' సినిమా షూటింగ్ సందర్భంలో అన్నాడట! ఆ మాటకూడా బైరాగిమూర్తే చెప్పేడు!'' అన్నాను.

''అదిగో నా డ్రైవింగ్ లైసెన్సు, ఇవిగో ఫోటోలు. ఇవి ఆర్. టి. వో. ఆఫీసులో ఇచ్చి సంతకాలు చేయించిపెట్టు!'' అంటూ చనువుగా

జగ్గయ్యపేట విశ్వప్రేమసమాజ నాట్యమండలివారు ఇటీవల ''మాయాబజార్'' నాటకమును ఉచిత ప్రదర్శన యిచ్చిన సందర్భంలో వృద్ధకళాకారులను సన్మానించారు. కె. చెన్నకేశవరావు (స్టేజి డైరెక్టరు), ఎ. కాంతారావు, ఎం. గోపాలం, ఎం. సైదేశ్వరరావు, ఎం. పాండురంగారావు, ఎస్. ఎల్. ఎన్. ఆచారిగార్లని చిత్రంలో చూడవచ్చు.









ఓ కవరు నా దగ్గిర పడేసి'' బైరాగిమూర్తితో పనుంది ! మళ్ళీ వస్తాను !' అంటూ వెళ్ళి పోయాడు నాయుడు.

ఈ మధ్య బైరాగిమూర్తి పేరు అందరి నోళ్ళలోనూ ఆడుతోంది !

ఎప్పుడో పది సంవత్సరాలక్రితం 'వుడా'కి ఎప్లయి చేస్తే వాళ్ళు బైరాగిమూర్తికి 'పండరీపురం లేఅవుట్'లో స్థలం కేటాయించేరు. ఆ స్థలంలో కంపెనీవాళ్ళు ఇచ్చిన అప్పుతో ఓ ఇల్లు కట్టేడు. అందినచోటల్లా అప్పుచేసి మొత్తానికి ఇల్లు పూర్తయిందనిపించేడు. నాడా దొరికింది కదా అని గుర్రాన్ని కొన్నట్లయింది వాడి పరిస్థితి! చుట్టూ కోలనీలో పెద్ద పెద్ద భవనాలు లేస్తూంటే వాటితోబాటు పరుగుపెట్టడంతో కాస్త ఇరుకున పడ్డాడు ! అయితే ఆ ఇంటితో వాడి స్టేటస్ పెరిగిపోయింది! — కాదు ! వాడే పెంచేసుకున్నాడు. సెక్రెటరీలు, ప్రొఫెసర్లు, బడా కాంట్రాక్టర్లు, మాజీ మంత్రులు, స్పెషలిస్టులు; వీళ్ళుతప్ప మామూలు మనుషుల్ని రిఫర్ చెయ్యటం మానేశాడు. వాడు చేస్తున్నది 'టెక్నికల్ అసిస్టెంటు' ఉద్యోగమయి నా మాటలు మాత్రం 'అసిస్టెంటు డైరెక్టరు' లెవల్లో వుంటున్నాయి.

సరే ! ఈ ఆర్టీవో ఆఫీసు మా ఎదురింటిలోకి రావటం వల్ల చిన్నరకం కష్టాలు ప్రారంభమవుతున్నాయని మెల్లిగా తెలియవచ్చింది !

లైసెన్సులు, ఫొటోలు అన్నీ కలిసి ఒక కవరులో సర్ది నా బ్యాగులో పడేసుకున్నాను.

ఆ సాయంకాలం ఇంటికి బయలుదేరటానిక్కి ఇంకా పదినిమిషాలు సమయం వుందనగా, మా బాస్‌రూం నుంచి పిలుపు వచ్చింది.

హడావుడిగా వెళ్ళేను !

''కూర్చోవోయ్ !'' అన్నారు.

ఉద్యోగంలో అడుగుపెట్టేక మా బాస్ కూర్చోమని నాకు చెప్పటం ఇదే ప్రథమం ! ఉబ్బితబ్బిబ్బయ్యాను !

''ఫర్వాలేదు ! సార్ !'' అంటూ నిలబడే వుండిపోయాను.

''కూర్చో !'' అన్నారు మళ్ళి.

ఇంక తప్పదని, కుర్చీ కందిపోతుందన్నట్లు కూర్చున్నాను.

''ఆర్. టి. వో. ఆఫీసు మీ ఎదురింట్లోకి మార్చారుటకదా !'' అన్నారు.

ఆహా ! ఏమి నా భాగ్యము ? ఆర్.టి.వో. ఆఫీసు మా ఎదురింట్లోకి మార్చినందుకు మొట్టమొదటిసారిగా సంతోషించాను !

''అవునుసార్ !''

''నువ్వు నాకు సహాయం చెయ్యాలోయ్ ! ఇంతకీ ఆ ఆఫీసులో నీకు ఎవరయినా తెల్సునా?''

''అబ్బే ... తెలియకపోవటమేమిటిసార్ ! బ్రేక్ ఇనస్పెక్టర్లు మనకి ఫ్రెండ్స్ ! కొత్త ఆర్. టి. వో. గారు మా వేలు విడిచిన మేనమామకి తోడల్లుడే!'' అంటూ అర్జెంటుగా అబద్ధాలు ఆడేశాను.

మా బాస్ నా వంక క్షణంసేపు అదోలా చూశారు

''కొత్తగా వచ్చిన ఆర్టీవోగారు నాయుడు గారుకదా ... నువ్వేమో ... '' గొంతులో వెలక్కాయ పడినట్లయింది ! అబద్ధాలు కూడా ఎన్ని ఆపదలు తెచ్చిపెడతాయో అవగతమయింది ! రోటిలో తలదూర్చి రోకటిపోటునకు వెరవదీరునా ?

అర్జెంటుగా మరో అబద్ధం 'ఫేబ్రికేట్' చేశాను.

''మా మేనమామది ఇంటర్‌కేస్ట్ మేరేజీలెండి ! '' అన్నాడు చిర్నవ్వుతో.

''ఐసీ ! వెరీగుడ్ ! అయితే మీది చాలా 'ఫార్వర్డ్ ఫేమిలీ'అన్నమాట! నువ్వు ఎలాగయినా ఈ పనులు చేయించి పెట్టాలి ! ఇది నాకారు 'సి' బుక్కు, ఏడాదికి టాక్సు కట్టాలి ! ఇది మా అమ్మాయి 'లూనా' లైసెన్సు కాగితం ! ఈ ఫోటోలు అతికించి సంతకాలు చేయించాలి ! ఇది మా అబ్బాయి కారు లైసెన్సు ! ఇదీ డిటోయే ! మిగిలినవన్నీ మన డైరెక్టర్లవి ! ఏ లైసెన్సుకి ఆ ఫోటోలు పెట్టి పిన్ను గుచ్చే వున్నాయి. ఇవన్నీ కాస్త తొందరగా చేయించాలి! టాక్సు కట్టటానిక్కి ఇదిగో రెండు వందలకు డ్రాఫ్టు ! మిగిలినవాటికి డబ్బులు అవసరం లేదు!'' అంటూ కాగితాలు నా ముందరకు తోసి, రెండు వందల రూపాయల డ్రాఫ్టు కూడా అందించేరు.

''వస్తాను సార్ ! ఈ సాయంకాలం వెళ్ళగానే మీ పని చేయిస్తాను !'' అంటూ బయటకు వచ్చేను. మా బాస్‌కి సహాయం చేయగలిగే అవకాశం నాకు వచ్చినందుకు ఆకాశమంత ఎత్తుకు ఎదిగిపోయినట్లనిపించింది.

నా సీటు దగ్గర పేపర్లన్నీ సర్ది బీరువాకు తాళంవేసి వాచీ చూసుకున్నాను. కంపెనీ బస్సు బయలుదేరటానిక్కి ఇంకా ఎనిమిది నిమిషాలు మాత్రమే వ్యవధి వుంది. అది కాని తప్పిపోతే సిటీబస్సులో వెళ్ళాల్సిందే ! గబ గబా గదిలోంచి బయటకు వస్తుంటే వీరపాండ్య కట్టబ్రహ్మన్న అడ్డుపడ్డాడు !

వీరపాండ్య కట్టబ్రహ్మన్న అసలు పేరు వరదరాజ మొదలియార్ ! తమిళ సోదరుడు ! మా కంపెనీ వార్షికోత్సవము సందర్భంగా కట్టబ్రహ్మన ఏకపాత్ర అభినయించటంవల్ల అతనికా పేరు స్థిరపడి పోయింది. అతడు మామూలుగా మాట్లాడలేదు ! అన్నిటికీ శివాజీగణేశన్‌లా మొహం పెట్టి, పిడికిళ్ళు బిగించి, దవడ కండరాలు మెలిపెట్టినట్లు ఫీలింగ్ ఇచ్చి మాట్లాడతాడు. ఆ మధ్య అతనికి కూతురు పుట్టిందని చెప్పటానిక్కి మా బాస్ రూంలోకి వెళ్ళేడు ! అయితే అతని వాలకం, నడకతీరు, పిడికిలి బిగింపులు, ఆవేశం ఇవన్నీ చూసి ఇంక్రిమెంటు ఆపినందుకు కోపంతో తనని కొట్టడానిక్కి వచ్చేడేమోనని మా బాస్ భయపడిపోయి వాచ్‌మేన్‌ని పిలిచి నానా హంగామా చేసేడు ! తర్వాత నిజం తెలిసి నవ్వుకోటం జరిగింది ! !

''మూరిదీ...'' అన్నాడు మొదలియార్ !

''మూర్తి ! '' అని పిలవటం సొంపు అది !

అతడికి తెలుగు అర్థం అవుతుంది ! కాని

అతడు మాట్లాడితే మనకి అర్థం కాదు !

"ఒందు సహాయము దా... సేయవలె..." అంటూ ఏదో చెప్పబోయాడు! నేను అర్జెంటుగా అడ్డుపడ్డాను,

"నువ్వు ఇంగ్లీసులోగాని, అరవంలోగాని చెప్పు ! తెలుగులో మాత్రం చెప్పకు !,' అవతల బస్సు వెళ్ళిపోతుంది !" అన్నాను అసహనంగా.

ఇంగ్లీషులో అతని గొడవ అర్థమయి, అతడి దగ్గిర రెండు ఫొటోలు, ఒక లైసెన్సు కాగితం తీసుకునేసరికి నాకు అయిదు నిమిషాలు పట్టింది ! పరుగున వచ్చి కదుల్తున్న కంపెనీ బస్సెక్కి ఊపిరి పీల్చుకున్నాను.

* * *

ఇంట్లో ఆదరాబాదరాగా కాఫీ త్రాగేసి ఎదురుగావున్న ఆర్టీవో ఆఫీసుకు వెళ్ళేను ! అక్కడ పరిచయమైన ముఖం ఒక్కటీ కనబడ లేదు ! ఎవరి హడావుడిలో వాళ్ళు వున్నారు. ఈ లైసెన్సుల గురించీ ఎవరిని అడగాలో కొంతసేపు అర్థం కాలేదు. ఒక మూల గదిలోకి వెళ్తే ఒకాయన తీరిగ్గా కూర్చుని సీలింగు ఫేను వంక చూస్తున్నాడు. ఆయన చుట్టూ లైసెన్సు కాగితాలు, ఫొటోలు గుట్టలు గుట్టలుగా పడి వున్నాయి. నా ఉనికిని సూచిస్తూ చిన్నగా దగ్గేను !

నా దగ్గును ఆయన పట్టించుకోలేదు!

"సార్ !" అన్నాను.

"రేప్పొద్దున్న పదకొండు గంటలకు—" అన్నాడాయన చూపు మరల్చకుండా.

నా వెనుక ఎవరయినా వున్నారేమోనని అనుమానంతో ఇటూ అటూ పరికించాను. ఆ గదిలో మరెవ్వరూ లేరు !

"లైసెన్సులకి ఫొటోలు అతికించి సంతకాలు చేయించాలి సార్ !" అన్నాను.

"రేప్పొద్దున్న పదకొండు గంటలకు !" అన్నాడు.

ఆయనకి చెముడేమోనని అనుమానం వచ్చింది.

"కారు టాక్సు కట్టాలి ! ఎక్కడో చెప్తారా ?" అన్నాను గొంతు పెంచి.

"రేప్పొద్దున్న పదకొండు గంటలకి—!"

"అన్నీ రేప్పొద్దున్నే తీసుకుంటారా ?" అతడు విసుక్కోవడం లేదుకనక మళ్ళీ అడిగేను.

"రేప్పొద్దున్న పదకొండు గంటలకి !" ఫీలింగ్స్‌లో, గొంతులో మార్పులేకుండా అన్నాడు.

"దెన్ అయివిల్ కమ్ టుమారో మార్నింగ్ ! థేంక్యూ !" అన్నాను.

"అయితే ఎల్లుండి పొద్దున్న పదకొండు గంటలకు !" అన్నాడాయన.

"అదేమిటి సార్ ?" అన్నాను ఆశ్చర్యంగా.

"ఇంగ్లీషులో మాట్లాడినా, ఇంగ్లీషులో అప్లికేషన్లు రాసినా ఎల్లుండి ఉదయం పదకొండు గంటలకి !... తెలుగులో అప్లికేషన్లయితే ముందు పరిశీలించమని మాకు ఆదేశాలున్నాయి. తెలుగు అప్లికేషన్లు రేప్పొద్దున్న పదకొండు గంటలకు!" అన్నాడు.

ఆయన నోట్లోంచి మరిన్ని కొత్తమాటలు వినగలగటం నాకు నూతనోత్తేజాన్నిచ్చింది.

"వస్తాను సార్ ! అన్నీ తెలుగులోనే రాస్తాను !" అంటూ వచ్చేశాను.

* * *

మర్నాడు ఉదయం తొమ్మిది గంటలకు ఆఫీసుకు వెళ్ళిపోయాను.

పది గంటలకు బాస్ రూంలోకి వెళ్ళేను.

"మూర్తీ ! మన పని ఎంతవరకూ వచ్చింది ?" అన్నాడాయన నన్ను చూస్తూనే.

"సార్ ! ఉదయం పదకొండు గంటలకు సరిగ్గా రమ్మన్నారు. అందుకని రెండు గంటలు పర్మిషనిస్తే సిటీబస్‌లో వెళ్ళివస్తాను !" అంటూ నీళ్ళు నమిలేను.

"భలేవాడివే ! నా పనిమీద వెళ్తూవుంటే నిన్ను సిటీబస్సులో పంపిస్తానా ? బయట డ్రైవరు వుంటాడు. కారు తీసుకువెళ్ళు !" అన్నాడాయన.

ఊహించని ఈ గౌరవానికి నాకు మతిపోయి నంత పనయింది !

నాకా క్షణంలో మా బాస్ దేవుడిలా కనుపించేడు.

"థేంక్యూ సార్ !" అంటూ బయటకు వచ్చేను.

నాకు ఏనుగెక్కినంత సంబరంగా వుంది. ఈల వేసుకుంటూ గబగబా నా టేబిలుమీద కాగితాలు సర్దేసి బీరువా తాళం వేస్తున్నాను.

"ఏమిటి బ్రదర్ ! అన్నీ సర్దేస్తున్నావ్ ? కొంపదీసి ఆఫ్ డే లీవు పెట్టావా ?" అన్నాడు ప్రక్క సీటులోని అనంతం !

"లేదు ! ఆర్టీవో ఆఫీసుకు వెళ్ళి బాస్ పని చక్కబెట్టుకురావాలి ! ఆయన కారు తీసికెళ్తున్నాను !" అన్నాను గర్వం, గంభీరత మిళాయించిన స్వరంతో.

"ఆహా ! ఏం అదృష్టం? కార్లో వెళ్తున్నావన్న మాట !"

"అవును !" అన్నాను.

"ఇంతకీ ఎక్కడికి వెళ్తున్నావో చెప్పేవు కాదు !"

అనంతంతో వచ్చిన చిక్కే ఇది ! ఒక వాక్యంలో రెండు పనులు చెప్తే ఒకటి మరిచి పోతాడు.

"ఆర్. టి. వో. ఆఫీసుకి..." అన్నాను.

"ఆర్. టి. సి. కాంప్లెక్సుకా? ఎందుకు?"

మతిమరుపుతోబాటు సరిగా విన్పించుకోక పోవటం మరో దుర్లక్షణం వీడిలో !!

"నీతో ఇంకో అయిదు నిమిషాలు మాట్లాడితే నాకు ఉన్న మతికాస్తా పోయి ఆర్. ఎమ్. ఎస్. ఆఫీసుకు వెళ్ళిపోతాను. అసలు పనికాస్తా మండిపోతుంది." అన్నాను చికాకుతో.

" 'ఆర్.ఎమ్.ఎస్.'ఆఫీసుకు వెళ్తున్నావా? మరి, ఆ సంగతి చెప్పవేం ? ఈ ఉత్తరం 'క్యూ. ఎమ్. ఎస్.'లో పడెయ్ ! అర్జెంటుగా అహ్మదాబాద్ వెళ్ళాలి ఇది !" అంటూ జేబు లోంచి ఒక కార్డు తీసి ఇచ్చేడు, "దీన్ని 'క్యూ. ఎమ్. ఎస్.'లో పడెయ్యమని వారం దినాల్క్రితం మా ఆవిడ నా జేబులో పెట్టింది. రోజూ మరిచిపోతున్నాను !" అన్నాడు మళ్ళీ.

"ఇలా ఇవ్వు !" అంటూ విసుగ్గా వాడి దగ్గరనుండి కార్డు అందుకున్నాను." దారిలో పడేస్తానులే !" అంటూ హామీ ఇచ్చేను.

"దారిలో పడెయ్యకు ! 'క్యూ.ఎమ్.ఎస్.' డబ్బాలో పడెయ్ !" అంటూ తన జోక్‌కు తానే ముసిముసిగా నవ్వుకున్నాడు అనంతం !

"హు !" అని విసవిసా నడిచి వచ్చేస్తూంటే "బ్రదర్ ! ఇలారా ! మా తమ్ముడు అనకాపల్లినుండి నాకు రాసిన ఉత్తరం నీకు ఇచ్చేశాను ! అహ్మదాబాద్ ఉత్తరం ఇదిగో, నా జేబులోనే వుంది. దీన్ని తీసికెళ్ళు !" అంటూ వేరే ఉత్తరం అందించాడు. అందిస్తూ "సరిగ్గా చూసుకోవేం ?" అని సణిగేడు ! ఉరుము తున్నట్లు అనంతం వంక చూసి బయటపడ్డాను.

* * *

'ఆర్టీవో' ఆఫీసు ఇంకా ఫర్లాంగుదూరంలో వుండగానే కారు ఎడంప్రక్కకు తీసి ఆపేశాడు డ్రైవరు !

"ఇంక ఎదరకివెళ్తే 'పార్కింగ్ స్పేస్' వుండదుసార్ !" అన్నాడు.

కారుదిగి ఆఫీసువైపు నడిచాను.

ఆఫీసు ఎదర తీర్థ ప్రజలావున్నారు జనం ! ఆఫీసులోంచి బయటకు వచ్చిన క్యూ, రోడ్డు అంతా నిండిపోయి మా ఇంటి ప్రహారీలోకి వెళ్ళిపోయింది ! ముందుగా జనాన్ని తప్పించుకుని మా ఇంట్లోకి వెళ్లటాన్కి ప్రయత్నం చేశాను. కాని జనం వెనక్కి నెట్టేస్తున్నారు. మా ఇంట్లోకి వెళ్లటంకంటె 'ఆర్టీవో' ఆఫీసులోకి వెళ్ళటమే సులువుగా కనుపించింది !

"ఈ క్యూ అంతా ఎందుకు ?" అని అడిగేను.

"ఫొటోలతో లైసెన్సులు 'రిన్యూ' చేయించుకోటానికి ! పదకొండు నుంచి పన్నెండు గంటలవరకే తీసుకుంటారు! పన్నెండు దాటిపోతే మళ్ళీ రేపు రావలసిందే !" అన్నారు ఎవరో !

నా గుండెల్లో రాయిపడింది !

మెల్లిగా ఆఫీసు లోపలికి వెళ్ళి నిన్న 'రేప్పొద్దున్న పదకొండు గంటలకి' అంటూ అరిగిపోయిన గ్రామఫోను ప్లేటులా మాట్లాడిన ఆయన కన్పిస్తారేమోనని చూశాను !

ఆయన అదే సీటులో వున్నాడు ! చుట్టూ కొంచెం తేడాగాని నిన్నటి వాతావరణమేవుంది !

# చెమటకాయల బాధనుండి ఉపశమనానికి టాల్కం పౌడర్ కాదు నైసిల్ కావాలి!

## నైసిల్ వాడండి

**చెమటకాయల బాధనుండి శీఘ్ర ఉపశమనం పొందండి.**






నైసిల్ చెమటకాయల బాధనుండి ప్రతిదశలోనూ ఉపశమనాన్నిచ్చేందుకై ప్రత్యేకించి రూపొందించబడిన ఔషధయుక్త పౌడర్. ఇది దురదను, మంటను, చిరచిరను వెంటనే ఉపశమింపజేస్తుంది. టాల్కం పౌడర్లవలెకాక ఇది క్రిమిచర్యను అరికట్టి బాధ శ్రుతిమించకుండ చేస్తుంది.

నైసిల్ – చెమటకాయల బాధనుండి ఉపశమనానికి నమ్మకమైన, నిరపాయకరమైన మార్గం.

1. అతిగా వచ్చే చెమటను ఆపుతుంది. 2. చెమటను పీలుస్తుంది.
3. దుర్గంధకారక క్రిములను ధ్వంసం చేస్తుంది. 4. శరీరానికి హాయినిస్తుంది.

మంచి ఆరోగ్యానికి మూలస్థానం

**గ్లాక్సో**

HTB-GLL/8806

కాకపోతే మరిన్ని లైసెన్సులు, మరికొన్ని ఫొటోలు! అంతే! సంఖ్య పెరిగింది! ఆయన ఎటో చూస్తూ చూపుడు వేలుతో గారడీ చేస్తున్నట్లు ఇటూ అటూ ఆడిస్తున్నాడు. కొంతసేపు నేను ఆశ్చర్యంతో ఆయన చూపుడు వేలు వంకే చూస్తూ వుండిపోయాను.

ఆ చూపుడు వేలితో పెద్ద అట్టని, అయస్కాంతం ఇనుపముక్కని దగ్గరకు లాగినట్లు లాగేడు! మంచినీళ్ళ గ్లాసుని చూపుడు వేలుతో అమాంతం దగ్గిరకి తీసుకున్నాడు జేబులోని పెన్నుని చూపుడు వేలుతో బయటకులాగేశాడు!!

''సార్! మీకు మంత్రాలు . వచ్చునా ?'' అన్నాను ఆశ్చర్యంగా.

''కాదు. బంక!'' అన్నాడాయన నిర్లిప్తంగా.

''బంకా ?'' అన్నాను, నాకేం అర్థం కాలేదు.

''అవును! బంక!'' అన్నాడు మళ్ళీ.

''యూ మీన్ జిగురా ?'' అన్నాను.

''అవును! ముమ్మాటికీ అవును!'' అన్నాడాయన.

అర్థంకానట్లు ఆయన వంక చూశాను.

''ఈ లైసెన్సులమీద ఫొటోలు అంటించటాన్కి ఈ వేలితో బంక రాసిరాసి ఆఖరికి వేలు ఇలా అయిపోయింది. పదిహేనురోజులబట్టీ ఇదే పని చేస్తున్నా. ఎనభై రెండువేల ఫొటోలు అంటించాను. వేలు ఎంత కడిగినా బంక వదలటంలేదు. వేలి చుట్టూ ఒక అంగుళం మేర బంక ఒక పొరలా ఏర్పడిపోయింది'' మాటలు ముగించి చూపుడు వేలుతో సిగరెట్టు జేబులోంచి బయటకు లాగేడు.

ఆయన మాటల్లో ''రేప్పొద్దున్న పదకొండు గంటలకు!'' అని ఇంతవరకూ దొర్లనందుకు సంబరపడుతూ ఆయన ఎదుట కుర్చీలో కూర్చున్నాను.

''బంక ... '' అంటూ ఆయన ఏదో చెప్పబోయేటంతలో నేను ఆయన మాటలకు అడ్డుపడ్డాను'' సార్! నేను ఈ ఆఫీసు

# మహాపురుష లక్షణం

ఎదురింట్లో వుంటున్నాను. మా ఇంటికి ఎదురుగా ఆఫీసు వుండటంవల్ల నా మిత్రులు చాలామంది ఆఫీసు పనులు నాకు అప్పజెప్పేరు. బయట క్యూ చూస్తే చాలా పొడవుగా వుంది! పని తొందరగా అవాలంటే ఏం చేయాలి సార్?'' అన్నాను వినయంగా.

''వెనక వీధిలో 'ఇచ్చట అన్నిరకముల మోటారు వాహనములకు సంబంధించిన ఆఫీసు పనులు చేయబడును' అనే బోర్డుతో ఒక బ్రోకరాఫీసు వుంటుంది. 'అక్కడికి వెళ్ళండి!' అని మేం చెప్పకూడదు మీకు! అక్కడికి వెళ్ళి చేయించుకుంటే పని అరగంటలో అయిపోతుం దని అసలు చెప్పకూడదు! అందరూ చెప్పినా నేను మాత్రం అస్సలు చెప్పకూడదు, ఎందుకంటే ఆ బ్రోకరాఫీసు మా బావమరిదిదేకనుక! మీరు ఇక్కడ అసలు కూర్చోకూడదు!'' అన్నాడాయన.

''థాంక్యూసార్!'' అంటూ కుర్చీలోంచి లేచి బయటకు వచ్చేస్తూవుంటే ''చూడండి...'' అంటూ బంకగారు పిల్చేడు.

''ఆ ఫొటోలు ఊడబెరికి అలా టేబిలు మీద వుంచండి!'' అన్నారు.

''ఏ ఫొటోలు ?'' అన్నాను ఆశ్చర్యంగా.

''మీరు వెనక్కు తిరగండి!'' అని నేను తిరగ్గానే ఆరు ఫొటోలని లెక్కబెడుతూ నా ఫేంటు వెనుక భాగం నుండి ఊడబెరికాడాయన!

''మీరు కుర్చీలో కూర్చోబోతూ వుంటే 'బంక' అంటూ చెప్పబోయాను! మీరు విన్నారు కాదు! లైసెన్సుల మీద అంటించటాన్కి ఆరు ఫొటోలకి బంకరాసి రెడీగా కుర్చీలో వుంచేను. మీరు వాటిమీద కూలబడ్డారు!'' అన్నాడాయన.

రుమాలుతో పేంటు వెనుక భాగానికి అంటిన బంక తుడుచుకుంటూ బయటకు వచ్చేను.

అక్కడి నుండి బ్రోకరాఫీసుకు వెళ్ళేను!

అక్కడ ఆఫీసులో ఆయన నన్ను చూడగానే ఎదురుగావచ్చి చేతిలోని కవరు లాక్కొని కాగితాలు బయటకు తీసి 'టాక్సుకి సాదరు పది, రిన్యువల్ కి సాదరు అయిదు' అంటూ ఎక్కాలు వల్లించినట్లు గబగబా లెక్కకట్టి'' మొత్తం సాదరు అరవై అయిదు రూపాయలు అవుతుంది. డబ్బిచ్చి ఇక్కడే కూర్చోండి' అరగంటలో మీ పని చేయించుకొస్తాను!'' అంటూ నా జేబు లోంచి చొరవగా వందరూపాయల నోటు లాగి, ''ఒరే! కుర్రాడా! చూసుకో! ఇప్పుడేవస్తాము!'' అంటూ ఓ కుర్రాడి వంక చూసి; నా కవరూ, డబ్బూ పట్టుకుని హడావిడిగా ఆఫీసు వైపు వెళ్ళిపోయాడు.

నేను మంత్ర ముగ్ధునిలా అలాగే వుండిపోయాను అయిదునిమిషాలు!

''అలా కూర్చోండి సార్!'' అంటూ ఆ కుర్రాడు చెప్పటంతో కుర్చీలో కూలబడ్డాను.

అన్నమాట ప్రకారం సరిగ్గా అరగంటలో 'సి' బుక్కులు, లైసెన్సులు ఎదుట పడేశాడు. వందరూపాయల్లో మిగిలిన డబ్బు లెక్కచెప్పి అప్పగించేడు. తిరుపతి గుడి క్యూలో దైవదర్శనార్థం వేలాది ప్రజలు వేచివుండగా, తిన్నగా పాతిక రూపాయల టిక్కెట్టు మీద లోనికి వెళ్ళి వచ్చేస్తే ఎలా అనిపిస్తుందో; ఆ క్షణంలో సరిగా నాకు అలాగే అనిపించింది.

విజయగర్వంలో కాగితాలు తీసుకుని బయటకు వచ్చాను.

అంతే ఆ రోజు నుంచే ప్రారంభం!

నేను ఆర్టీవో ఆఫీసులో పనులు క్షణాలమీద చేయించగలనని మా కంపెనీలో అందరికీ తెలిసిపోయింది!

ఆ వారం ఆఖరుకు లెఖ్ఖకడితే మూడు వందల నలభై రూపాయలు బ్రోకరుకు నేను జేబులోంచి స్వతంతంగా చెల్లించినట్లు తేలింది!!

అప్పుడే నాకు మెరుపులా ఒక ఆలోచన వచ్చింది!!!

ఆ ఆలోచనా ఫలితంగా నా జీవన విధానం మారిపోయింది!






# కొత్త గొంతులు

— టి.యల్. కాంతారావు

కవిత్వానికీ జీవితానికి – జీవితానికీ, సమాజానికీ–సమాజానికీ దాని సంప్రదాయానికీ ఒక విడదీయరాని బంధం ఎప్పుడూ ఉంటుంది. వ్యక్తి తన చుట్టూ విస్తరించిన సాంఘిక జీవన విధానానికి ఎలియనేట్ అయి ఎప్పుడూ జీవించలేడు; అట్లాగే కవి కూడా. కవి అయినా, రచయిత అయినా జీవితం పట్ల, సమాజం పట్ల ఒక విశ్వాసాన్ని కలిగి ఉంటాడు. ఆ విశ్వాసమే రచనలో అతని దృక్పథంగా వ్యక్తం అవుతుంది. ప్రాపంచిక శ్రేయస్సే కళలకు పరమావధి అనుకుంటే ఈ శ్రేయోమార్గాలు వ్యక్తి వక్తికీ భిన్నంగా కనబడతూ ఉండటం సర్వసాధారణమైన విషయం. ఈ భిన్నత్వమే కవిత్వంలో అనేక రూపాల్లో వ్యక్తం కావటం, రకరకాల, విమర్శలకు దారితీయటం తెలియని విషయం కాదు.

తెలుగు కవిత్వ చరిత్రలో గురజాడ అప్పారావుగారి ఆవిర్భావం ఒక అద్భుతమైన ఘటన. ఆయనలోనే ఆధునిక తెలుగు సాహిత్య స్వరూప సాక్షాత్కారం ఆరంభమైంది. హేతువాదం, సంస్కరణవాదం, మానవతావాదం సాహిత్య భూమికలుగా జీవద్భాషా ప్రయోగం ప్రాణ భూతమైన లక్షణంగా గురజాడ సాగించిన సాహిత్య సృష్టి అనంతర కవుల మార్గాన్ని సుగమం చేసింది. అభ్యుదయ కవితోద్యమం ఊపిరి పీల్చడానికి పూర్వం భావకవిత్వం పేరుతో, వ్యక్తిస్వేచ్ఛకు పట్టంకడుతూ కాల్పనిక కవితావేశం తెలుగు నేలను కొన్ని దశాబ్దాలు కవిత్వపరంగా సుసంపన్నం చేసింది.

అభ్యుదయ కవిత్వం పాత విశ్వాసాలను, సంప్రదాయాలను కాదని ఆర్థిక దృక్పథ పునాదిగా, సామ్యవాద వ్యవస్థా నిర్మాణం లక్ష్యంగా, 'శ్రమైక జీవన సౌందర్యమే' ధ్యేయంగా కొన్ని దశాబ్దాలు సాహిత్య చరిత్రను, సామాజిక చరిత్రను శాశించింది. ప్రజలే ప్రాణం అని నమ్మిన సిద్ధాంతం వ్యక్తిత్వపు అస్తిత్వ పోరాటంలో ప్రజలను, వారి సమస్యలను విస్మరించి ఊహాలోకాల్లోకి, వ్యక్తిగత అధికార, అహంకారాల్లోకి ప్రయాణించి క్రమక్రమం క్షీణత్వంలో పరాకాష్ఠకు చేరుకుంటున్న సమయంలో, జాతి యావత్తూ మగతనిద్రలో జోగుతున్న కాలంలో, ఉద్యమాలు నీరసించి నిస్తేజ ప్రవృత్తి సమాజ సమస్తాంగాల్లోనూ వ్యాప్తిచెందిన కాలంలో దిగంబర కవులు ఒక కూటమిగా ఉద్యమించటం జరిగింది. ఆదిలో వారిది వ్యక్తివాదమైనా, శూన్యవాదమైనా, నిరాశావాదమైనా వారిచ్చిన షాక్ ట్రీట్‌మెంట్ మాత్రం తెలుగు కవిత్వాన్ని ఒక ఊపు ఊపింది. సమాజం మారాలనే తపనతో, వేదనతో, దుఃఖంతో, ఆవేశంతో కవిత్వం రాస్తున్నప్పుడు, ఈ సమాజంపై నున్న కసిని కవిత్వంలో ప్రదర్శించేటప్పుడు కొన్ని అశ్లీల పదాలు దొర్లవచ్చు. అంతమాత్రంలో దిగంబర కవుల్లో కవిత్వాంశ లేదని కొట్టిపారవెయ్యటం ఆనాటి విజ్ఞులకుగాని, ఎప్పటికీ ప్రాజ్ఞులుగానే మిగిలిపోదామనుకునే వారికిగాని మంచిదికాదని

## ముగింపు

ఆనాడూ, ఈనాడూ కూడా చాలామంది భావించారు. 1965 తరువాత తెలుగు కవిత్వం తిరిగిన అనేక మలుపులలో దిగంబర కవులు నిర్వహించిన చారిత్రిక పాత్ర విస్మరించరానిది.

1965 నుంచీ వచ్చిన ఆధునిక తెలుగు కవులలో కొంతమందిని మాత్రమే ఈ 'కొత్త గొంతులు' శీర్షికక్రింద ఆంధ్రసచిత్ర వారపత్రికలో పరిచయం చెయ్యటం జరిగింది. ఆనాటినుంచీ దిగంబర కవిత్వం, పునరుజ్జీవనం పొందాలనే తపనతో వచ్చిన అభ్యుదయ కవిత్వం, జాతీయభావం భూమికగా, వ్యక్తి వికాసం ఆత్మిక లక్షణంగా వచ్చినా చేతనావర్త కవిత్వం, కవిత్వంలో రాజకీయ వాసన వుండకూడదనే భావంతో వ్యక్తి అనుభూత ప్రధానంగా వచ్చిన కవిత్వం, అంత్యమంగా కల్లోల నక్సల్బరీ దశాబ్దంగా పేర్కొంటూ వచ్చిన విప్లవ కవిత్వం, ఇదికాక మార్మికవాద, అస్తిత్వవాద, ప్రతీకవాద సమిశ్ర కవిత్వాలు– ఇవన్నీ ఈ అతి తక్కువకాలంలో తెలుగు పాఠకులను ప్రభావితులను, దిగ్భ్రాంతులను కూడా చేశాయనటం ఆశ్చర్యంకాదు.

రచనచేసే ఏ ఒక్కడూ తాను చదువుకొనడానికి మాత్రమే రచన చెయ్యడు. కనుక రచనాసృష్టి వైయక్తికమే అయినా దాని అనుభవం సామాజికం. ఏఒక్కడూ మరొకడిలా రాయడు; వాడు వాడిలాగానే రాస్తాడు. మరోడిలా రాస్తే ప్రతిధ్వనే అవుతుందిగాని ధ్వనికాదు. అలా అని ఇటీవల వచ్చిన ఒక సేనా ఉద్యమం ఋజువు చేసింది. అదొక ఉద్యమంగా భావించి దాన్లో ప్రవేశించిన యువకులు కొందరు ఆ పద్యకవితా విరాట్ స్వరూపానికి దిష్టిబొమ్మలుగా మిగిలిపోవటం తెలుగు కవిత్వ పాఠకులకు తెలియని విషయం కాదు.

సృజనాత్మక సాహిత్యంలో భిన్నత్వం ఉన్నట్లుగానే విశ్లేషణాత్మక సాహిత్యంలో కూడా భిన్నత్వముంటుంది. సమకాలీన కవిత్వం మీద ఏకాభిప్రాయం కలిగిన సమీక్షకులు; విమర్శకులు ఏ కాలంలోనైనా చాలా తక్కువ మంది ఉంటారు. అసలు ఉండకపోవటం కూడా కద్దు. మార్క్సిజం యొక్క అభిమానిని మాత్రమే నేను. నా ఈ పరిచయ కార్యక్రమంలో ఈ అభిమానం స్పష్టంగా కనపడినా, ఈ తరంలో వచ్చిన కవులలో కొంత మందిని వారి వారి మార్గాల్లోంచే పరిచయం చెయ్యడానికి ప్రయత్నించాను. ఎంతైనా జీవలక్షణం బహిర్గతం కాక మానదు గదా!

ఇంకా ఈ తరంలో అనేక మంది కవులు కవితా వ్యవసాయాన్ని సాగిస్తున్నారు. వారందరినీ ఈ శీర్షిక క్రింద పరిచయం చెయ్యలేక పోయినాను. వారి కృషిని, ప్రతిభను, కవితా శక్తిని తక్కువగా అంచనా కట్టడం కాదు. మిత్రులెందరో ఉత్తరాలు రాశారు. వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

1983 జనవరి మాసం నుంచీ ఇప్పటివరకూ ఈ శీర్షికను ప్రచురించిన ఆంధ్రసచిత్రవారపత్రికకు కృతజ్ఞుణ్ణి. ★

---

అంతే! పదిహేను వందల రూపాయలు నెలకు తెచ్చుకునే నా ఉద్యోగానికి రాజీనామా జేసేను!

ఇదంతా ఆరు నెలల క్రిందటి సంగతి !!!

ప్రస్తుతం మీరు మా యింటికి వస్తే వీధి గదికి ఒక బోర్డు వేలాడుతూ కన్పిస్తుంది. "ఇచ్చట ఆర్. టి. వో. ఆఫీసుకి సంబంధించిన అన్ని పనులూ సరసమయిన ధరలకు చేయబడును" అని దానిమీద వ్రాయబడి వుంటుంది.

"బంగారం లాంటి కంపెనీ ఉద్యోగం

## మహాపురుష లక్షణం

వదులుకుని ఆఖరుకు బ్రోకరు ఉద్యోగం ప్రారంభించేవా? ఇదేం బంగారం షాపు అనుకున్నావా, నమ్మినవాళ్ళని దోచుకు తినటానికి?" అని నా మిత్రులు, శ్రేయోభిలాషులు ఇప్పటికీ నన్ను మందలిస్తూనే వున్నారు.

అయితే ఆ ఉద్యోగంకన్న ఈ బ్రోకరు పని ఎంత లాభసాటిగా వుందో వాళ్ళకేం తెలుసు ?!

'ఉద్యోగం పురుష లక్షణం' అన్నారు పెద్దలు! నేను కాదనను!

ఈ బ్రోకరు పని 'మహాపురుష లక్షణం!' అంటాను నేను !!

కాదనేవాళ్ళను నా దగ్గరకి తీసుకురండి! వివరిస్తాను వాళ్ళకి !!! ★

> **గమనిక**
>
> "ఈ కథలో పాత్రలు, స్థలాలు, సన్నివేశాలు కేవలం కథా సౌలభ్యం కోసం ఎన్నుకొన్నవి. ఎవరినీ, దేనినీ కించపరచే ఉద్దేశ్యంతో కాదు." — రచయిత

## కలిమిశ్రీ — కొత్తరెడ్డి పాలెం

తాను సృష్టించుకున్న మనికి తానే బానిస అయిపోతున్నాడు మనిషి. కారణం ?

★ మనీ శక్తి అంత గొప్పది. మనిషికి లేని శక్తి దానికుంది.

## ఇ. యు. ఆర్. — కుత్తుం

నేను ఒక అమ్మాయిని ప్రేమించాను — ఆమె నా ప్రేమను అర్థం చేసుకోడంలేదు. అందుకు మీ సలహా ?

★ ఏముందీ ! యింకో అమ్మాయిని ప్రేమించి తెలియచేయవచ్చు కదా ? !

## విజయ — సామర్లకోట

కులాంతర వివాహం చేసుకున్నవారి పిల్లలది ఏ కులం అవుతుంది ?

★ ఇది పితృ స్వామ్యం. తండ్రిది ఏ కులం అయితే పిల్లలది ఆ కులం అవుతుంది.

## ఎం. ఆర్. ఆర్. బి. — ఉరవకొండ

సృష్టికి మూలం స్త్రీ అని మనకు సంప్రదాయం వుందికద. అది ఎంతవరకు నిజం?

★ ఏం మీరెక్కడైనా పురుషుడు ప్రసవించగా చూశారా ?! సృష్టికి ప్రతిసృష్టి చేసే శక్తి స్త్రీకే యిచ్చింది ప్రకృతి.

## విజేంద్ర — ఆదోని

పేదవాడి పేదరికంమీద కథలు రాసే రచయిత నిజజీవితంలో తారసపడే పేదవాడికి పది పైసలు దానం చేయలేడు సరికదా — కసురుకుంటాడు — ఎందుకు ?

★ ఎందుకేమిటి బ్రదర్, పది పైసల అవసరం — వూహించకలడేగాని— అనుభవించలేడు కనుక. దాన్నే — సమాజం మారాలని; సమసమాజం అనీ — దోపిడీ అనీ ఏదోదో — గీపెట్టి కథల్లో అరుస్తాడు — అది వాళ్ల వాస్తవికత.

## ఎం.బి ఆర్. — కుర్చీపాకా (ఖిలాయి)

మీరు భానుమతిగారి లాగా హాస్య రచనలు ఏమైనా చేశారా ?

★ లేదు. దానికి ప్రత్యేకమైన నేర్పు కావాలి.

మీరు బాగా నవ్వుతారట — విన్నాను.

★ ఏమిటి ? నా నవ్వా ?! అంత దూరం వినిపించిందా ?!

## పి.ఎల్.ఆర్. — మెట్టపల్లి

మీ ఫొటో కావలెను. పంపించగలరు.

★ ఇదిగో—లారీ బుక్ చేయమని చెప్పాను.




## వై.ఎల్.ఎమ్. — పాతమంచిర్యాల

నేను ఒక అమ్మాయిని ప్రేమించాను. పెళ్లి కూడా చేసుకోవాలని నిర్ణయించుకున్నాం. మాకు అంతస్తులు, కులాలు అడ్డు వస్తున్నాయి.

★ చూశారా ! ఎప్పుడూ యింతే కథ. ప్రేమకి కులాలు, అంతస్తులు అడ్డు రావు. పెళ్లికి — వస్తాయి. అందుకే — ప్రేమించే ముందు కూడా వీటిని గురించి ఆలోచించనైనా ఆలోచించాలి. లేదా — వాటినధిగమించే శక్తి గలదైనా అయి వుండాలి — ప్రేమ.

## ఎం. పి. ఎస్. — పలమనేరు

ఆడపిల్ల పుడితే లక్ష్మి అంటారు. అదే ఆడపిల్లకి పెళ్లి కాస్త ఆలస్యంగా అయితే — ఆడిపోసుకుంటారు ఎందుకు ?

★ అలవాటు. కాని ఇలాంటి దరిద్రపు అలవాట్లు మారాలి, మార్చడానికి తల్లి తండ్రులు సహకరించాలి. కన్న పిల్ల — ఆడైతేనేం ? మగ అయితేనేం— అన్న సమదృష్టి కల్గి పిల్లల్ని పెంచడం అలవాటు చేసుకోవాలి!

## పి. డి. కె. — కలకత్తా

నేను ఒక బెంగాలీ అమ్మాయిని ప్రేమించాను. నా తల్లితండ్రులు అంగీకరించరేమోనని అనుమానంగా వుంది.

★ అంచేత—గుస్‌చిప్‌గా వారు చూడమన్న క్యూలో అమ్మాయిలని చూసి రావడంకాదు — మీ అభిమతాన్ని వారికి చెప్పి ఒప్పించండి. ఆఫ్టరాల్, చదువుకున్నారు. ఉద్యోగం వుంది. మీ భార్యని మీరు పోషించకలరు. ఇంకా ఎందుకు పిరికితనం ?

## షన్ముఖ — సునాబేడ

పెళ్లి — ప్రేమ తూర్పు పడమరలతో సమానం అని నా నమ్మకం. మీరేమంటారు ?

★ ఏముందీ, చిన్నప్పుడు సైన్సు పాఠాలు వినలేదా, "ఆపోజిట్ పోల్సు — ఎట్రాక్ట్" అని!

## ఎం.వి.వి.ఆర్ — చెల్లూరు

ఎన్.టి.ఆర్. అవతార పురుషుడంటారు. మరి మీరు ?

★ అవతార పురుషుడు కాదుకాని — ఆంధ్రకి చాలా అవసరమైన పురుషుడు.

## డి.హెజ్.ఎం.ఆర్. — సికింద్రాబాదు

మీరు చనిపోతే... ప్రశ్నావళి ?

★ బాగుంది. తను నిద్రిస్తే ప్రపంచం ఆగిపోతుందనుకుంటాడు ఒక్క — అవివేకి. నేను కాదనుకుంటున్నాను !!



LANGUAGE ...
DATE

ఇటీవల జరిగిన విశాఖ సాంస్కృతికసంస్థ (హైదరాబాదు) భావనకు అనుబంధంగా రంగారెడ్డి జిల్లాశాఖ ప్రారంభోత్సవ కార్యక్రమాల సందర్భంగా వేదికపై శ్రీయుతులు పి. గోపాలరెడ్డి (సంస్థ అధ్యక్షులు) డా. సుమనశ్రీ (సంస్థ ఉపాధ్యక్షులు) శ్రీ పి.ఎస్.ఆర్. ఆంజనేయశాస్త్రి, డా. సి.ఆనందారామం, డా. అక్కినేని నాగేశ్వరరావు, డా. సి. నారాయణరెడ్డి, డా. కె. వి. కృష్ణకుమారి, శ్రీ ఎ. ఎస్. ఆర్. శాస్త్రి, శ్రీ హరిశ్చంద్రప్రసాద్, శ్రీ బి. అంజయ్యగౌడ్ (సంస్థ కార్యదర్శి), శ్రీ పి. ఎస్. తిలక్ గార్లని చిత్రంలో చూడవచ్చు.



స్త్రీ మనోభావాలకు
అందమైన
భాషలు ఎన్నెన్నో.
అందులో విమల్ ఒకటి.




చీరలు
జార్జెట్ • షిఫాన్
వాయిల్ • టిష్యూ • క్రేప్



దాసరి, సుజాత 'బోళాశంకరుడు'లో

## శోభన్‌తో ఎ. కోదండరామిరెడ్డి దర్శకత్వంలో "బావా మరదళ్లు"

ఎమ్. నరసింహారావు నిర్మించే రాశీమూవీస్ వారి పై చిత్రం షూటింగ్ సెప్టెంబర్ 5న ప్రారంభమైంది. శోభన్‌బాబు, మురళీమోహన్, రావు గోపాలరావు, అల్లు రామలింగయ్య, నూతన్ ప్రసాద్, మాధా, ధమ్, చిట్టిబాబు, రాధిక, సుహాసిని, అన్నపూర్ణ, ప్రత్యేక పాత్రలో గుమ్మడి పాల్గొంటున్నారు. జి. సత్యమూర్తి, చక్రవర్తి, వేటూరి, ఎన్. నవకాంత్, భాస్కరరాజా, సలీమ్, వి. కొండలరావు ప్రభృత సాంకేతిక వర్గంతో మంతెన దేవేంద్రరాజు సమర్పిస్తారీ చిత్రాన్ని.

'భార్యాభర్తల సవాల్'లో అరుణ



## "పాపికొండలు"

"అక్టోబర్ రెండవ వారంనుంచి నవంబర్ 15 వరకు రాజమండ్రి, రంపచోడవరం, పాపికొండలు ప్రాంతాల్లో జరిగే షూటింగ్‌తో దాదాపు పూర్తయినట్లే," అన్నారు కృష్ణ ప్రసాద్. ఈయన సమర్పించే అమరా పిక్చర్స్ "పాపికొండలు" చిత్రం షూటింగ్ ఇటీవల మద్రాసులో జరిగింది. నరేష్, తులసి, రాజా, వనిత, ప్రభాకరరెడ్డి, గిరిబాబు, స్మిత పాత్రధారులు. ఎన్. ఆర్. నంది మాటలు, కోపెల్ల, శివరాం పాటలు రాశారు. చక్రవర్తి సంగీతం, గోపాల్ ఛాయ, వెంకటేశ్వరరావు శిల్పం, పి. సి. మోహన్ కూర్పు నిర్వహిస్తున్నారు. గవిని కృష్ణమూర్తి దర్శకత్వంలో బోర శ్రీరాములు, బోర లక్ష్మణరావు నిర్మాతలు.

## "భామా-రుక్మిణి"లో భర్తను లొంగదీసుకోడానికి నాగేష్ చిట్కాలు !

భామ (రాధిక) సోఫాలో కూర్చొని ఆల్బం చూస్తూ దీర్ఘంగా ఆలోచిస్తోంది. ఆదరా బాదరాగా వచ్చాడు లాయర్ శేషు (నాగేష్). "ఎప్పుడు చూసినా ఆల్బం పట్టుకుని కూర్చుంటావేగాని, కట్టుకున్నవాడ్ని గుప్పెట్లో పెట్టుకోవాలనే అభిప్రాయమే లేదా ? ఇదే రుక్కూ అయితే చక్కగా బుట్టలో పెడుతుంది." అన్నాడు.

"ఎలా పెడుతుంది ?" అడిగింది భామ.

"వాడికిష్టమైన ఫలహారాలన్నీ బాగా తిండి, పక్కనే కూర్చొని, నోట్లో పెడుతుంది."

"నోట్లో పెడుతుందా ?"

"లేకపోతే ముక్కులోనో, చెవులోనో పెడుతుందేమిటే ? తిన్న ఇంటికి వాడెప్పుడూ ద్రోహం చెయ్యడు. ఆ దెబ్బతో రుక్కే దిక్కనుకొని, ఆ కొంపలోనే పడిఉంటాడు."

"అయ్యయ్యో ! ఇప్పుడేం చెయ్య



సినిమ

మంటావ్ ?"

"వాడ్ని నీ వైపుకి కుక్కను లాగినట్టు లాక్కో ! ఫలహారాలు వండిపెట్టి, పక్కనే కూర్చొని ప్రేమగా తినిపించు... ఒకటి చెప్పనా నీకు ? రుక్కూ అయితే భోజనం అవగానే విస్తరితీస్తుంది. నువ్వు తియ్యకు. అదే విస్తట్లో వాడికి ఎదురుగుండా కూర్చొని చక్కగా మెక్కు."

"మెక్కితే ఏమవుతుంది ?"

"పొట్ట ఉబ్బుతుంది ... మొద్దూ ! మొగుడు అమాంతం మైకంలో సోలిపోతాడు."

భాగ్యరాజా కథ, స్క్రీన్‌ప్లే సమకూర్చి నాయకుడుగా నటించిన ఎస్.వి.ఎస్. క్రియేషన్స్ "భామా-రుక్మిణి" హాస్య ప్రధాన చిత్రంలో భాగ్యరాజా భార్య భామగా రాధిక, మరో భార్య రుక్మిణిగా ఆయన నిజ భార్య స్వర్గీయ ప్రవీణ నటించారు. వసంతకుమార్ సంభాషణలు, వేటూరి గీతాలు, ఎం. ఎస్. విశ్వనాథన్ సంగీతం, రవి కూర్పుతో సహదేవ వెంకటేశ్వరరావు నిర్మించిన ఈ చిత్రానికి ఆర్. భాస్కర్ దర్శకుడు.



## "విముక్తి కోసం"లో ఋణ విముక్తి

రచ్చబండ దగ్గర ఊరి పెద్దలు సమావేశమయ్యారు. వినమ్రంగా నిలుచొనున్న వీరాసామి వంక తవిటి నాయుడు చుర చుర చూస్తూ, "రార్నా కొడకా ! యియ్యాలేదో తేల్చేస్తాను. రాయరా భూమి," హూంకరించాడు.

"పంటంతా పాయిదా కింద కొలుస్తున్నాను. మరిప్పుడు భూమి రాసీయమంటే యెలా, బాబూ !" వీరాసామి ప్రాధేయపడ్డాడు.

"భూమి రాయకపోతే, నువ్వు అప్పెప్పుడు తీరుస్తావురా ? మూడేళ్ళయి తీర్చలేనప్పు యింకెన్నేళ్ళకు తీరుస్తావు ?"

వీరాసామి తన పక్కనున్న పెద్దల వంక దీనంగా చూస్తూ, "బాబులూ ! అప్పుకిందైతే నా గుడిసె, యెడ్లు కట్టేసుకోమనండి...భూమి నాదిలేయమని సెప్పండి," అన్నాడు.

తవిటి నాయుడు రెచ్చిపోయాడు. "తోస్తే తొంబై దిక్కులు పడిపోతాయిరా నీ బోడెద్దులు. యెవడిక్కావాలి ?"

"యిన్నాళ్ళూ యీ భూదేవిన్నమ్ముకునే బతికాను—కావాలంటే సంవత్సరం తమ కింద సాకిరీ సేయమన్నా సేస్తాను. భూమి నాది లేయండి, బాబూ !"

## విశేషాలు

-జి. వి. జి.

తవిటి నాయుడు, ఒక పెద్ద మనిషి దగ్గరికెళ్ళి, "చూడండి, పాపినాయుడుగారూ కూలినా కొడుకుల వేషాలూ ! వెయ్యి రూపాయలప్పుకి పావలా సేయని పాకా, పరక సేయని యెద్దులూ నా కంటగట్టేసి; పనికొచ్చిన భూమి నుంచేసుకోడానికి చూస్తున్నాడు," అన్నాడు.

పాపినాయుడు తల పంకిస్తూ, "తవిటి నాయుడు సెప్పిందే సబబురా. భూమి రాసిస్తే గాని బాకీ తీరదు," అన్నాడు వీరాసామితో.

తవిటినాయుడు పత్రాలు తీస్తూ, "యెవరు సెప్పినా వినకుండా వున్నావేరా, దొంగ నాకొడకా ! రావయ్యా, కరణపయ్యా, యీడి సేత ముందేలిముద్రేయించు...పెట్రా నా కొడకా యేలు ముద్రెట్టు," అని బలవంతంగా పెట్టించాడు.

ఎక్కడా ప్రతిఘటన లేదు. నిస్సహాయంగా ఎవరికి వారు నెమ్మదిగా జారుకుంటున్నారు. చివరికి వీరాసామి ఒక్కడే మిగిలాడు. అతని కళ్ళు చెమ్మగిల్లాయి. కుప్పలా కూలబడ్డాడు. దోసిలితో మట్టి పట్టుకొని, "తల్లీ, భూదేవితల్లీ ! యిన్నాళ్ళూ నిన్నమ్ముకు బతికాను. యిప్పుడెలా బతికేది ?" అంటూ బావురుమన్నాడు.

అతని ఆర్తనాదం వినేవారెవరు ?

ఉదయకుమార్ దర్శకత్వంలో పి. సురేందర్, ఎస్. లక్ష్మణరావు నిర్మించే ప్రజా చిత్ర ప్రొడక్షన్స్ "విముక్తి కోసం" లో నారాయణరావు, సాయిచంద్, కాకరాల, చలపతిరావు, గరగ, ప్రతాప్, పద్మ, జయమాల పాత్రధారులు.



'సంఘర్షణ'లో చిరంజీవి

## శోభన్‌తో కట్టా దర్శకత్వంలో వై. వి. రావ్ చిత్రం

"19వ తేదీ నుంచి ఊటీలో షూటింగ్," అన్నారు రవి చిత్ర ఫిలిమ్స్ అధినేత వై.వి.రావ్. ఈయన నిర్మించే కొత్త చిత్రానికి సెప్టెంబర్ 16న ఎ. వి. ఎం. స్టూడియోస్‌లో ప్రారంభోత్సవం జరిగింది. శోభన్‌బాబు, జయసుధ, రాధిక, రావుగోపాలరావు, ప్రభాకరరెడ్డి, అల్లు రామలింగయ్య, సుత్తివేలు, సత్యరాజ్, పెమ్మసాని రామకృష్ణ, ఎస్. వరలక్ష్మి, పుష్పలత, బేబీమీన పాల్గొంటున్నారు. బాలమురుగన్ కథకు పూసల మాటలు రాశారు. ఆత్రేయ, సి. నారాయణరెడ్డి గీతాలకు సత్యం స్వరకర్త. దేవరాజ్ ఛాయ, డి. రాజగోపాలరావు కూర్పు, సలీమ్ నృత్యాలు, ఎం. కృష్ణ శిల్పం, వి. సుందరం నిర్వహణ, ఎస్. రామకృష్ణ సహకార దర్శకత్వంతో కట్టా సుబ్బారావు దర్శకుడు.



చక్రవర్తి, మురళీమోహన్, ప్రభ 'దేవి – శ్రీదేవి' లో

కె.యస్.నారాయణ శెట్టి సమర్పించు
విజయసాయి ఫిలింస్ వారి

DIMPLE

సింహపురి సింహం

కలర్

నిర్మాతలు మహేష్.గోపీనాథ్ కథ-స్క్రీన్‌ప్లే-దర్శకత్వం కోడి రామకృష్ణ



85 చిత్రాలతో
18 రూపాయలకే

వైవాహిక జీవితం సెక్స్

మీ దాంపత్య జీవితం హాయిగా వుండాలని అనుకోవడం ఎంత సహజమో సెక్స్ శాస్త్రీయ విజ్ఞానం మీరు తెలుసుకోవడం అంత అవసరం.

ప్రతి విషయం వివరంగా, సులభశైలిలో, అందంగా రూపుదిద్దుకున్న ఈ పుస్తకం మీ జీవితాంతం దాచుకోదగ్గది. అంతేగాదు-నూతన దంపతులకు ఇవ్వదగిన అమూల్యమయిన కానుక.

10 రూపాయలు M.O. చేయండి V.P.P. లో పుస్తకం అందుకుంటారు పోస్టేజీ ఉచితం.

ఏజెంట్లకు 25% కమీషన్

సైన్స్ స్టోర్ పబ్లికేషన్స్
12-2-460/6
జీవన్ కళ్యాణ్
మెహదీ పట్నం
హైదరాబాద్
500 028



నువ్వు రొటేషన్ చక్రవర్తివైతే
నేను మెజీషియన్ మన్మధరావుని!

చలసాని బ్రదర్స్ సమర్పించు

సత్యశక్తి పిక్చర్స్

శుభముహూర్తం

తాతినేని ప్రసాద్ B.A.

నిర్మాతలు: C.R.R. ప్రసాద్ C.K.R. ప్రసాద్

VAANI KRISHNA

## సినిమా

### డైరెక్టర్ తాతినేని ప్రసాద్ చిత్రాలు

★ చంద్రమోహన్, మురళీమోహన్, సుహాసిని, పూర్ణిమ, మారుతీరావు నటించిన "శుభముహూర్తం" సెప్టెంబర్ విడుదల. గణేశ్‌పాత్రో సంభాషణలు, చక్రవర్తి సంగీతంతో సి. ఆర్. ఆర్. ప్రసాద్, సి. కె. ఆర్. ప్రసాద్ నిర్మాతలు.

★ శేషయ్య నిర్మించే శ్రీ రంగశాయి పిక్చర్స్ "మనిషికి మరో పేరు" చిత్రం షూటింగ్ పూర్తయింది.

★ నందమూరి బాలకృష్ణ హీరోగా అక్టోబర్‌లో షూటింగ్ ప్రారంభమయ్యే చిత్రాన్ని అశోక్, రాకేష్ నిర్మిస్తారు.

★ ఎ. వి. ఎం. స్టూడియోస్‌వారు శివాజీ గణేశన్ కొడుకు ప్రభు, స్మిత నాయకా నాయికలుగా నిర్మించే "మూరకోట్టై సింగకుట్టి" చిత్రాన్నితెలుగులో చిరంజీవిహీరోగా అక్టోబర్‌లో ప్రారంభిస్తారు. చక్రవర్తి సంగీత దర్శకుడు.




"సంసారపక్షంగా వుండే ఏ పాత్రనయినా పోషించడానికి నేను రెడీ!"

### నమోదు చేయబడిన చిత్రాల పేర్లు

క్రాంతి ఇండస్ట్రియల్ క్రియేషన్ "నిరుద్యోగీ, నీ జీవిత దారి ఎటు?" ఆది దేవీ ఫిలిమ్స్ "దేవీ కన్యకా పరమేశ్వరి," పి.ఎస్.ఆర్. పిక్చర్స్ "జగజ్జాణ," శ్రీ బాలాజీ చిత్ర మందిర్ "పులిపిల్ల," భారత్ చంద్రా ఎంటర్ ప్రైజెస్ "మహర్జాతకుడు".



'లంకె బిందెలు'లో జయసుధ, కృష్ణ ★ పద్మ, సాయిచంద్ 'విముక్తికోసం'





సుహాసిని, గొల్లపూడి మారుతీరావు 'శుభముహూర్తం'లో

## విశిష్టమైన రీతిలో "ముందడుగు" విజయోత్సవం !




''కె. ఎస్. ప్రకాశరావుగారి కుటుంబం లోంచి వచ్చిన దర్శకులు కె. రాఘవేంద్రరావు, కె. బాపయ్య మా సంస్థలు తీసిన 16 చిత్రాలకు దర్శకత్వం వహించారు. అన్ని చిత్రాలూ విజయవంతమైనవే. మా కొత్త చిత్రం 'సంఘర్షణ' డైరెక్టర్ మురళీమోహనరావు కూడా ఈ కుటుంబంలోని వాడే. భారీ తారాగణంతో రూపొందించిన మా చిత్రాలన్నిటిలోకీ 'ముందడుగు' రికార్డును సృష్టించింది. మా సంస్థలో గత పదిహేనేళ్ళుగా పని చేస్తున్న సిబ్బందిని ఈ సందర్భంలో తగు రీతిలో సత్కరించడం నా ధర్మం. యాభై వేల రూపాయలను సీనియారిటీ ప్రకారం వారి వారి పేర్లతో బాంక్‌లో డిపాజిట్ చేసి, వారికి కొన్ని బహుమతులను కూడా ఇస్తున్నాను,'' అన్నారు డి. రామానాయుడు. ఈయన నిర్మించిన సురేష్ ప్రొడక్షన్స్ ''ముందడుగు'' చిత్రం 18 కేంద్రాలలో శతదినోత్సవం, 6 కేంద్రాలలో రజతోత్సవం జరుపుకున్న సందర్భంగా ఆగస్టు 28న మద్రాసు తాజ్ కోరమాండల్ హోటల్లో విజయోత్సవం వైభవోపేతంగా జరిగింది.

''శ్రీలంకలో పెక్కు ఇడుములకు లోనైన తమిళ సోదరులకు పదివేలు, మన రాష్ట్రంలోని వరద బాధితులకు పదివేల రూపాయల విరాళాల్ని ఇస్తున్నాను,'' అని డి. రామానాయుడు సభాముఖంగా ప్రకటిస్తూ, ''ఆదిలో మా చిత్రాలు కొన్నింటిలో ఎన్. టి. ఆర్. గారికి డూప్‌గా సత్యనారాయణ పారితోషికం తీసుకోకుండా నటించారు. ఈ సందర్భంలో ఆయనకు ఐదువేల రూపాయలను బహూకరిస్తున్నాను,'' అన్నారు. ఆ మొత్తాన్ని సత్యనారాయణ కూడా శ్రీలంకలోని తమిళ సోదరులకు, మన రాష్ట్రంలోని వరదబాధితులకు చెరిసగం విరాళంగా ప్రకటించారు.

అన్నపూర్ణా స్టూడియోస్
శ్రీరంగనీతులు
వెంకట్ అక్కినేని, నాగార్జున అక్కినేని
అన్నపూర్ణ

కృష్ణ నటించిన పద్మాలయా స్టూడియోస్ సమర్పించు



రత్నామూవీస్

# ప్రజారాజ్యం



దర్శకత్వం: ఎం.మల్లికార్జునరావు
నిర్మాత: జి.నాగరత్నమ్మ
నిర్వహణ: జి.ఆదిశేషగిరిరావు B.Sc.,
స్క్రీన్‌ప్లే: జి.హనుమంతరావు

PADMALAYA PUBS.



'కురుక్షేత్రంలో సీత'లో రంగనాథ్, బలరామ్, రాజసులోచన, అంబిక, సత్యం, కామేశ్వరరావు

# హిందీ చిత్ర విశేషాలు!

★ తన సుదీర్ఘ సినిమా జీవితంలో ఇంతవరకు ఏ స్టంట్ మాస్టర్‌నూ వినియోగించుకోని దర్శక నిర్మాత వి. శాంతారాం తన ''జన్జార్'' చిత్రానికి మానెక్ ఇరానీ అనే ఫైట్ కంపోజర్‌ను బుక్‌చేశారు.

★ స్వర్గీయ మహ్మద్ రఫీ కొడుకు షహీద్ రఫీ కూడా నేపథ్య గాయకుడయ్యాడు. వారిస్ ఫిలిమ్స్‌వారి ''సోచానాథా'' చిత్రానికి ఆగస్టు 23న తొలిసారిగా గానం చేశాడు. ఇతని తండ్రి కూడా 1942 ఆగస్టు 23నే తొలిగీతం గానం చేశాడు.

★ దిలీప్‌కుమార్, సైరాబానూలు ఇటీవల అమెరికా వెళ్లినప్పుడు బసచేసిన మియామీ హోటల్లో కొన్ని నగలను పోగొట్టుకున్నారు.

★ మాడరన్ మూవీస్ ''యాదోంకి కసమ్'' చిత్రంతో జీనత్‌అమన్ తొలిసారిగా ద్విపాత్రలు నిర్వహిస్తోంది. ఆమెకు స్పెషల్ మేకప్‌ను లాస్ ఏంజెల్స్‌లోని టామ్ బర్మన్ స్టూడియోలో చేయించారు. ''గాడ్ ఫాదర్, క్లోస్ ఎన్‌కౌంటర్స్ ఆఫ్ ది థర్డ్ కైండ్, రిటర్న్ ఆఫ్ ది జెడి'' వగైరా హాలివుడ్ హిట్ చిత్రాలకు టామ్ బర్మన్ స్పెషల్ మేకప్‌లు చేశారు.

★ ''బేతాబ్'' చిత్రానికి పని చేసిన వారందరూ సింగ్‌లే! హీరో సన్నీడియోల్ అసలు పేరు అజయ్‌సింగ్. హీరోయిన్ అమృత్‌సింగ్. నిర్మాత బిక్రమ్‌సింగ్. దర్శకుడు రాహుల్ రావైల్ అసలు పేరు రాహుల్‌సింగ్. ఛాయాగ్రాహకుడు మన్‌మోహన్‌సింగ్. శబ్దగ్రాహకుడు నరేందర్‌సింగ్. ఈ చిత్రానికి బొంబాయి పంపిణీదారుడు ఎస్. వకీల్‌సింగ్, తూర్పు పంజాబ్ పంపిణీదారుడు నరేందర్‌సింగ్.

★ బి. ఆర్. ఇషారా చిత్రం ''లోక్ క్యా కహేంగా'' రెండు ప్రింట్లు బొంబాయి నుండి బీహార్ పంపిణీదారులు వైశాలీ పిక్చర్స్‌కు పంపబడ్డాయి. గమ్యస్థానం పాట్నాలో ఆ ప్రింట్ల డబ్బాలు తెరిచి చూస్తే, ఫిలిమ్ ప్రింట్లకు బదులు ఉల్లిపాయలు, టొమేటోలు, బంగాళాదుంపలు ఉన్నాయట! ఇటువంటి ఫిలిమ్ ప్రింట్ల తస్కరణకు పేరు మోసిన మొఘల్‌సరాయ్ జంక్షన్‌లో అవి గల్లంతయి ఉండాలని భావించబడుతోంది.

★ రాజశ్రీవారి ''ఆద్మీ భూల్ జాతాహై''లో రాజేష్‌ఖన్నా సరసన జయప్రద, టీనా మునీమ్‌లు నాయికలు.




## కృష్ణ, కృష్ణంరాజులతో దాసరి దర్శకత్వంలో "యుద్ధం'

''సెప్టెంబర్ 2 నుంచి 10 వరకు ఫస్ట్ షెడ్యూల్ జరిగింది. అక్టోబర్‌లో రెండు షెడ్యూల్... నవంబర్‌లో ఆఖరి షెడ్యూల్,' అన్నారు విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ అధినేత టి. త్రివిక్రమరావు. ఈయన దాసరి నారాయణ రావు కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, పాటలు, దర్శకత్వంలో నిర్మించే ''యుద్ధం'' చిత్రంలో కృష్ణ, కృష్ణంరాజు, సత్యనారాయణ, రావు గోపాలరావు, ప్రభాకరరెడ్డి, గొల్లపూడి మారుతి రావు, అల్లు రామలింగయ్య, జయసుధ, జయప్రద



'త్రివేణీ సంగమం'లో పవిత్ర శ్రీ

సుజాత, జయమాలిని, స్మిత నటిస్తున్నారు చక్రవర్తి, భాస్కరరాజా, కోటగిరి వెంకటేశ్వర రావు, సి. వి. రమణబాబు, పి. ఎస్. కృష్ణ మోహన్‌రెడ్డి, యమ్మనూరు ప్రభాకర్ దోనపల్లి కోటేశ్వరరావు, గోపీకృష్ణ ప్రభృతి సాంకేతికవర్గంతో టి. ప్రద్యుమ్నరావు సహ నిర్మాత.

## అమితాబ్ బచ్చన్‌కు ముద్దుపేర్లు!

అప్తులు ''అమిత్‌జీ!'' అని, జీనత్ అమన్ ''ఎ. బి.'', రాజీవ్ గాంధీ ''ఫోర్–ఎ' (పేరులో 4 'ఎ' ఉన్నాయి గనుక) అని, రణధీర్ కపూర్ ''లంబూజీ'' అని, తల్లిదండ్రులు ''మున్నా!'' అని పిలుస్తారు.

# ట్రిలో

## ఉపయోగించడానికి మీకొక మంచి కారణం:




## ఇతర ప్రముఖ డిటర్జెంట్ బిళ్లలకన్న **దీని ధర 30% తక్కువ.**

ఇదిగో, ఇంకా మూడు కారణాలు:

### మరింత నురుగు



దీని సమృద్ధమైన నురుగు మరే డిటర్జెంట్ బిళ్లకన్న ఎక్కువ బట్టలను శుభ్రం చేస్తుంది.

### మరింత ఉతికే శక్తి

అతిగా మాసిన బట్టల్ని కూడ చక్కగా శుభ్రం చేయగలది ట్రిలో. అందులోనే ఉన్న బ్లూ తెల్లటి బట్టలకు వాటి అసలు తెల్లదనపు మెరుపు తెస్తుంది.



### మరింత మన్నిక




ట్రిలో సులువుగా మెత్తబడిపోదు. అందుకే అందులో వృథాపోయేది ఎంత మాత్రం ఉండదు. పూర్తిగా అరిగిపోయేదాకా ట్రిలోను వాడవచ్చు.

**ట్రిలో** — <u>మరింత</u> ఉపయోగకరమైన నీలి డిటర్జెంట్ బిళ్ల.

Godrej

CHAITRA-GS-188 TEL

# మధుర గాయకుడు పూర్ణచందర్



శాస్త్రీయ సంగీత విద్వాంసులు — లలిత సంగీతంగాని, సినిమా గీతాలుగాని పాడ లేరేమోనని ఇదివరకు కొందరు సంశయించే వారు.

ఆ సంశయాన్ని పటాపంచలు చేసిన గాయకుడు పూర్ణచందర్.

'మేఘ సందేశం' టైటిల్ సాంగ్‌లో ఆయన మధుర గానానికి ఎందరో ముగ్ధులయ్యారు.

కేసెట్ల ద్వారా, రికార్డుల ద్వారా విడుదలైన "ఆనందభైరవి" చిత్రంలోని "తిల్లానా"కు పరవశులయ్యారెందరో.

"శుభలేఖ" చిత్రంలో అక్కడక్కడ వినిపించిన 'హమ్మింగ్' బాలసుబ్రహ్మణ్యందేనా నని అడిగినవారూ లేకపోలేదు. ఆ సందేహానికి బాలసుబ్రహ్మణ్యమే ఓ సినీ వారపత్రికలో సమాధానమిచ్చారు — అంత శ్రావ్యంగా హమ్ చేసిన వ్యక్తి పూర్ణచందర్ అని.

ఏడవ ఏట నుంచే కర్నాటక శాస్త్రీయ సంగీతాన్ని క్షుణ్ణంగా అభ్యసించిన పులిపాక పూర్ణచంద్రరావు హిందూస్థానీ శాస్త్రీయ సంగీతంలోనూ నిష్ణాతులు. ఉర్దూ ఘజల్స్ పాడే కర్నాటక సంగీత విద్వాంసుడు ఈయ నొక్కడే. వయొలిన్ వాద్య నిపుణుడు కూడా. సోలో కచ్చేరీలు ఇచ్చారు; మంగళంపల్లి బాలమురళీకృష్ణకు ఎన్నో కచ్చేరీలలో వయొలిన్ వాయించారు. "నేనెవరో ప్రపంచానికి తెలియజేసింది బాలమురళీ గారయితే, నన్ను సినిమా రంగానికి పరిచయం చేసింది జి. కె. వెంకటేశ్‌గారు," అంటారీయన.

ఈయన తొలుదొల్త గానంచేసిన చిత్రం "సనాది అప్పన్న" (కన్నడం). కర్నాటక రాష్ట్రంలో ఈయన సుప్రసిద్ధులు.

1966లో జాతీయ స్కాలర్ గౌరవాన్ని పొందారు. అప్పట్నుంచి మద్రాసులో స్థిర నివాసమేర్పరచుకున్నారు.

మద్రాసు, ఢిల్లీ, లక్నో, కాన్పూర్, బొంబాయి, సికింద్రాబాద్‌లలో పలు ఘజల్స్ కచ్చేరీలు ఇచ్చారు.

1971 నుంచి మద్రాసు ఆలిండియా రేడియోలో నిలయ విద్వాంసుడుగా ఉంటున్నారు.

"నేను మద్రాసుకు వచ్చినప్పట్నుంచి నాకు గురువు, గైడ్, ఫిలాసఫర్ మా బంధువు ముదిగొండ లింగమూర్తిగారు," అనే పూర్ణచందర్‌కు డైరెక్టర్ కె. విశ్వనాథ్, ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యంలు కూడా బంధువులే.

నాదమే ప్రాణంగా, సంగీతమే జీవిత పరమార్థంగా భావించే పూర్ణచందర్ సినిమా రంగంలోనూ బిజీ అయ్యేరోజు చేరువలోనే ఉంది.

—జి. వి. జి

## "శ్రీరంగనీతులు"లో అంతర్నాటకం

రాజేష్ (ఎ. ఎన్. ఆర్.) బెడ్ మీద పడుకొని ఉన్నాడు. మంచానికి ఆనుకుని నిలుచున్న విజయ (శ్రీదేవి) గోళ్లు గిల్లుకుంటూ, ఓరకంటితో చూసింది. "ఏమండీ!... మీ నాన్నని... పాపం, ఎందుకలా టీజ్ చేస్తారు?" తటపటాయిస్తూనే అడిగింది.

రాజేష్ నవ్వాడు. "ఏం, నీకు జాలిగా వుందా? అదుగో అవన్నీ నీకనవసరం. ఇటువంటి అడ్డు ప్రశ్నలు వెయొద్దని నే నెప్పుడో చెప్పాను. ఇలా రా! కూర్చో... ఇంకా దగ్గరగా కూర్చో... మరింత దగ్గరగా," అంటూ ఆమె భుజంమీద చేతులేశాడు.

విజయ విదిలించుకుంటూ, "ఇప్పుడెందు కండీ ఇది? మీ నాన్నగారు చూస్తున్నప్పుడే ఇలా నటించమన్నారు కదా?" అంది.

"అదే... ఆయన చూస్తున్నప్పుడు నటించ డానికి ఇప్పుడిది రిహార్సల్," అంటూ ఆమెను బలంగా దగ్గరికి లాక్కున్నాడు.

"అబ్బా! వదలండి... ప్లీజ్! ఎల్లకాలం ఈ రిహార్సల్సూ, నటనేనా?"

"హాయ్! నువ్వీ ప్రశ్న ఎప్పుడు వేస్తావా అని ఎదురుచూస్తున్నాను... చూడూ! నువ్వీ నటన పర్ఫెక్ట్‌గా విజయవంతం చేస్తే, ఆ నటన్నే నిజం చేసేయడం నా చేతుల్లో ఉంది," అంటూ ఆమెను అక్కున చేర్చుకున్నాడు.

పారవశ్యం చెందిన విజయ కిమ్మనలేదు.

శ్రీమతి అన్నపూర్ణ సమర్పణలో వెంకట్ అక్కినేని, నాగార్జున అక్కినేని నిర్మించే "శ్రీరంగనీతులు" చిత్రానికి ఎ. కోదండరామి రెడ్డి దర్శకుడు. కొడాలి ఆంజనేయ చౌదరి ఎగ్జిక్యూటివ్ నిర్మాత.

'సింహపురి సింహం'లో మారుతిరావు, సత్తిబాబు, జయ



## "జగన్"లో దూషణ - భూషణ

కోవలం బీచ్‌కి వెళ్ళే దారిలో కల్యాణి రెస్ట్‌హౌస్‌లో లలితాలయ మూవీ మేకర్స్ వారి "జగన్" చిత్రం షూటింగ్... మాజీ ముఖ్య మంత్రి (గొల్లపూడి మారుతీరావు) చుట్టూ ఉన్న వందిమాగధులు "ఈసారి మీరే మళ్ళీ ముఖ్యమంత్రిగా రావడం ఖాయం" అని స్తోత్ర వచనాలు పలుకుతూండగా పక్కనే ఉన్న మాజీ ముఖ్యమంత్రి ప్రధాన కార్యదర్శి (బెనా) "పదవిలేనివాడు ప్రభుత్వం ప్రతినెలా పడిపోతుందను కుంటాడు. పదవిలో ఉన్నవాడు – మరో అయిదు సంవత్సరాలదాకా ఎలెక్షన్లేరావు; తానే కంటిన్యూ అయిపోతానని అనుకుంటాడు. ఇది ఆనవాయితీ, ఆచారం; దీన్నెవరూ కాదనలేరు. మార్చలేరు," అన్నాడు గుక్కతిప్పుకోకుండా.



జయసుధ 'అమ్మాయి మనసు'

"ఛీ! నోర్ముయ్" అన్నాడు మాజీ ముఖ్యమంత్రి.

కార్యదర్శి నోటికి అడ్డుగా చేతిని ఉంచుకునేశాడు.

దాసరి నారాయణరావు కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, పాటలు, దర్శకత్వంలో ఎస్. ఎస్. భట్ సమర్పించే "జగన్" చిత్రంలో శోభన్‌బాబు, జయసుధ, జగ్గయ్య, అల్లురామలింగయ్య పేకేటి, ఉమామహేశ్వరరావు, ప్రమోద్‌కుమార్, డాక్టర్ రాధాకృష్ణ, వై. జి. మహేంద్రన్, సుమలత, జయమాలిని. నిర్మల, కె. ఆర్. సావిత్రి పాల్గొన్నారు. సంగీతం : చక్రవర్తి. ఛాయ : కె. ఎస్. హరి. కూర్పు : కృష్ణ. శిల్పం : రామచంద్రసింగ్. నిర్వహణ : దండమూడి కోటేశ్వరరావు, సారిక రామచంద్రమూర్తి. సహ దర్శకత్వం: కమల్‌తేజ్. సహకార దర్శకత్వం : డివిట్‌రావు, సత్యనారాయణ, వెంకటేశ్వరరావు. నిర్మాతలు : వజ్జె సుబ్బారావు, విజయ శంకర్.




DIMPLE



సీరియల్

# మేఘ ముత్యాలు

## యలమంచిలి ఝాన్సీలక్ష్మి

(గత సంచిక తరువాయి)

ఆ సాయంత్రమే ఆషా యింటికి వెళ్ళాడు సారథి! సలీమ్ మరునాడు వస్తాడని చెప్పడానికి!

ఆషా కాలేజి నుంచి రాలేదని తెలిసి కాలేజికి వెళ్ళాడు. అప్పటికే బాగా చీకటి పడిపోయింది. ఆ వేళ ఏదో ఫంక్షను వుందని తెలిసింది. కానీ అప్పటికి అది పూర్తయిపోయిందనీ, స్టూడెంట్సు వెళ్లిపోయారనీ తెలిసి యింటి దారి పట్టాడు.

మధ్యలో తోటి లెక్చరరు కలిస్తే పది నిమిషాలు మాట్లాడాడు!

"ఎనిమిదయిపోయింది! ఆషా యింటికి వెళ్లుంటుందిపాటికి!" అనుకుంటూ నడిచాడు. కొంతదూరం వెళ్లిన తరువాత ఎవరో తూలుతూ నడుస్తున్నట్లనిపించింది. ఓ అమ్మాయిలా కన్పించి ఆగాడు.

"ఆషా! నువ్వా? ఏమైందమ్మా?" ఆషా నిలబడడానిక్కూడా ఓపికే లేనట్లు తూలి పోతోంది! జుట్టంతా రేగిపోయింది! ముఖాన అక్కడక్కడ గాట్లున్నాయి! రక్తం కూడా వస్తోంది ఆ గాయాల నుంచి!

"ఏమైందమ్మా?" సారథి ఆందోళనతో వణికిపోయాడు!

"నన్ను... యింటికి జేర్చు... అన్నయ్యా! ప్రాణం పోయేట్టుంది!" సారథి వెంటనే టాక్సీని పిలిచాడు.

ఆషా సారథి భుజంపైన వాలిపోయింది! అతని మనస్సు కీడు శంకిస్తోంది?

"ఏమైంది? ఆషాకి? ఏ రౌడీ వెధవో ... నో! నో! అలాంటిదేంజరిగి వుండదు! ఏదైనా యాక్సిడెంటయి వుంటుంది! వీళ్లన్నయ్య డాక్టరేగా! చూస్తాడు!"

సారథి మనస్సులో వేల ఆలోచనలు!

ఇల్లు రాగానే ఆషా తల్లిని పిలిచాడు. ఆమె గుండెలు బాదుకుంటూ కొడుకుని పిలిచింది.

"ఏమైందమ్మా! అరే! స్పృహ తప్పింది! ముందు యింట్లోకి తీసుకెళ్దాం పుండు! సారథీ! ప్లీజ్! హెల్ప్మీ,! ఆషా అన్న అక్బర్ లోనికి తీసుకు వెళ్లాడు. సారథి తాను చూచినంత వరకు చెప్పాడు. ఆషాకి యింకా తెలివి రాలేదు.

"ఏమైంది అక్బర్?" సారథి ఆతురత నణుచుకోలేక ప్రశ్నించాడు.

"యాక్సిడెంటయినట్టుంది! మోటరు సైకిలుగానీ స్కూటరుగానీ డాష్ యిచ్చి వుండాలి! పెద్ద గాయాలేమీ లేవుమరి!"

ఆషాకి ఎప్పటికో తెలివి వచ్చింది. కళ్లువిప్పి ముందుగా సారథిని చూసింది. ఆమె పెదవులు దుఃఖంలో వణికిపోతున్నాయి. కళ్ళ నిండుగా అశ్రుబిందువులే! తల్లివైపు చూసి వెంటనే కళ్ళు వాల్చుకుంది!

"ఏమైందమ్మా?" సారథి ప్రశ్నించాడు.

"సలీమ్... రాలేదా?..." ఆమెమాట్లాడ లేకపోతోంది దుఃఖంతో.

"కాస్త రెస్ట్ తీసుకో ఆషా! అమ్మా! కాసిని వేడి పాలివ్వు ఆషాకి!" అక్బర్, సారథితో పాటు ఆ గదినుంచి బయటికి వచ్చాడు; ఓ అరగంట కూర్చుని సారథి ఆషా దగ్గర కెళ్ళి చూశాడు.

"వీడే!... వీడే! పట్టుకోండి?" ఆషా సారథిని చూడగానే పెద్దగా అరిచి పడిపోయింది.

"పెద్ద ప్రమాదాన్ని చూసి వుంటుంది! భయం వదలలేదింకా! పడుకోనివ్వమ్మా!" అక్బర్ మాటలు విని ఆషా తల్లి ధైర్యం తెచ్చుకుంది.

సారథి మరికొంతసేపు కూర్చుని వుదయమే వస్తానని చెప్పి వెళ్ళిపోయాడు.

అతడు వెళ్ళేటప్పటికి సీత యింటి దగ్గర లేదు! ప్రక్క యింటివారమ్మాయి తాళంచెవి తెచ్చి యిచ్చింది.

సారథి అలసిపోయాడు బాగా! కుర్చీలో కళ్ళు మూసుకుని కూర్చున్నాడు. ఆషా 'కన్నీళ్లూ', భాధతో వణికిపోయిన ఆమె ముఖమే పదేపదే గుర్తుకు వస్తున్నాయి.

అంతలో సీత వచ్చింది.

"శ్రీనివాస్ వచ్చే నెలలో అమెరికా వెళ్ళి పోతాట్ట! రేఖని మోసం జేసేట్టున్నాడా మనిషి! డైరీ యిక్కడ మర్చిపోయి వెళ్ళాడు! జేబులో నుంచి పడిపోయి వుంటుంది! అందులో రాసి వుంది! రేఖ అంటే 'ఓ ... విస్కీసీసా' అని రాసుకున్నాడు. నా గుండెలు తరుక్కుపోయాయి! వెళ్ళి నాలుగు దులిపివచ్చాను! తిన్నగా కోర్టుకి వెళ్తానని ముఖంమీదే చెప్పేశాను! నన్ను ... చంపేస్తానన్నాడు! ఏడు జన్మలెత్తినా అంత ధైర్యం నీకు రాదని చెప్పాను. ఎంత రాక్షసత్వం? ఆ మనిషిలో! నీకు ... చెప్పడానికి నాకు సిగ్గుగా వుంది! ఆ ... మనిషి ... ఓ ... ఆడపిల్లని... నాశనం చేయబోతూంటే ... కోపం పట్టలేక అక్కడేవున్న కుర్చీని విసిరేశాను!... కానీ ఆ ... మూర్ఖుడికి తగల్లేదు! నాపైన విసిరేశాడేదో! తలకి ... దెబ్బ తగిలింది! స్పృహతప్పి పడి పోయాను! నాకు తెలివివచ్చి చూసేసరికి హాస్పటల్లో వున్నాను. ఆ అమ్మాయిని తీసుకుని...

**జరిగినకథ — 11:** సలీంకు సారథిపట్లగల ఆరాధనను మనస్సులోనే మెచ్చుకొంటుంది శశిరేఖ. సారథి శశిరేఖతో విసిగి ఆమెను వదిలేసి సీత దగ్గరకు వెళుతాడు. సీత భర్త శ్రీనివాస్ అని తెలుసుకుంటాడు. శశిరేఖను చూడాలంటుంది సీత. తను విజయకు తగనని సోమయాజులు గారితో అంటాడు సారథి. మనిషికి మనస్సు ముఖ్యం కానీ, కులం ప్రధానం కాదని చెపుతాడు సోమయాజులు. సోమయాజులుగారికి పక్షపాతం వస్తుంది. విజయను, రాజ్యంను ఆయన దగ్గరకు తీసుకెళతాడు సారథి. సోమయాజులుగారికి సలీంను పరిచయం చేస్తాడు. సీత సారథి ఇంటికి వచ్చి అక్కడ శశిరేఖను చూస్తుంది. శ్రీనివాస్‌కన్నా మంచివాడిని తెచ్చి పెళ్లి చేస్తానని సారథి శశిరేఖకు చెప్పబోగా ఆమె అతని మాట వినకుండా అతనితో ఘర్షణ పడుతుంది. మెల్ల మెల్లగా విజయ మనస్సును సారథి ఆకట్టుకొంటుంటాడు. సారథి తీసుకు వచ్చిన కుర్రాడు తనకు నచ్చలేదని చెబుతుంది విజయ. విజయ మాతి దగ్గర కాలు జారి పడగా కాలు ఫ్రాక్చరవుతుంది. విజయ మాటల వలన ఆమె మనసులో తనకు స్థానం ఉందని సారథికి స్పష్టంగా తెలిసిపోతుంది. సారథి హైదరాబాదునుంచి వస్తాడు. సారథి, విజయ ఒకరిపై ఒకరికి గల ప్రేమను వ్యక్తం చేసుకుంటారు. సారధి హైదరాబాదుకు రాగానే శశిరేఖ తను శ్రీనివాసును పెళ్లి చేసుకోబోతున్నట్లు చెపుతుంది. అది విని బాధపడతాడు సారథి. శ్రీనివాస్ ప్రవర్తనకు అసహ్యపడి అతడిని వెళ్లిపొమ్మని శాసిస్తుంది శశిరేఖ. ఆషా, సలీమ్‌ల పెళ్లి నిశ్చయమవుతుంది. రేఖకోసం వచ్చిన శ్రీనివాస్ సీతను చూస్తాడు. రేఖ మాటలకు తికమకపడతాడు శ్రీనివాస్. సీతని పెళ్లి చేసికోమని శ్రీనివాస్‌ను కోరుతుంది రేఖ. తను రేఖ కోసమే పుట్టానంటాడు శ్రీనివాస్.

## 'దేవి – శ్రీదేవి'లో దేనికైనా ఒకే పమాధానం

ఆఫీసు రూమ్... దేవి (జయసుధ) తన టేబుల్ దగ్గర్నుంచి లేచి, మేనేజర్ (చక్రవర్తి) ్టటు వద్దకు వెళ్ళింది. "సార్ !"

"ఏమ్మా, నేనేం చేయగల్ను ?" అన్నాడు మేనేజర్.

"తల నొప్పిగా ఉంది, సార్... హాఫ్ డే ్వ్ కావాలి."

"కుదరదమ్మా. కొత్తగా ఉద్యోగంలో చేరినవాళ్ళు అత్యవసరమైతే రిజైన్ చెయ్యాల్సిందే తప్ప — నెల్లాళ్ళ వరకు ఒక్క రోజైనా సెలవు పెట్టకూడదని అయ్యగారు ఆర్డరు వేశారు... నేనేం చేయగల్ను ?"



'చండీ—చాముండి'లో విజయలలిత

"అవునూ... అయ్యగారికి ఇంకా లంచ్ టయిమ్ కాలేదా ? మీరెళ్ళి ఒకసారి గుర్తుచేసి రాకూడదూ ?"

"అది నా డ్యూటీ కాదమ్మా.. నేనేం చేయగల్ను ?"

"పాపం ! స్టెనో కూడా అక్కడే ఉంది. ఆకలవుతుంది కదా — నే వెళ్ళి పిల్చిరానా ?"

"అది నీ డ్యూటీ కాదమ్మా... నేనేం చేయగల్ను ?"

"అది కాదు... ఆ స్టెనో, బాస్‌తో అంత చనువుగా బిహేవ్ చేస్తుందే! ఎప్పుడూ అంతేనా ?"



'ఖైదీ'లో సంయుక్త, మాధవి, చిరంజీవి

"ఆవిడ ఉద్యోగంలో చేరినప్పట్నుంచీ — అంటే, షుమారు పదేళ్ళుగా ఎప్పుడూ ఇలాగే ప్రవర్తిస్తూంది... దానికి నేనేం చేయగల్ను ?"

ఇంతలో ప్యూన్ వచ్చి, "అయ్యగారు అర్జంట్‌గా అక్కౌంట్స్ ఫైల్ తీసుకు రమ్మన్నారు," అన్నాడు

"లంచ్ అవర్‌లోనా ?" అంది దేవి.

"అయ్యగారు అడిగినప్పుడు లంచ్ అవర్ అయినాసరే — తీసుకెళ్ళాల్సిందేనమ్మా... నేనేం చెయ్యగల్ను ?" అన్నాడు మేనేజర్.

దేవి విసుక్కుంటూ కదిలింది.

షాట్ ఓకే అయ్యాక డైరెక్టర్ రాజాచంద్ర "ఈ చిత్రంలో ప్రభ పాత్ర పేరు కూడా ప్రభే!" అన్నారు. మురళీమోహన్ ప్రధాన పాత్ర నిర్వహిస్తూ సమర్పించే జయభేరీ ఆర్ట్ ప్రొడక్షన్స్ "దేవి – శ్రీదేవి" చిత్రాన్ని కిశోర్ నిర్వహణలో మాగంటి వెంకటేశ్వరరావు నిర్మించారు.

## కృష్ణ, పి. సి. రెడ్డి కాంబినేషన్‌లో "పులిజూదం"

"గ్రామీణ వాతావరణంలో సెంటిమెంట్‌తో పాటు క్రయిమ్ కథాంశం అక్టోబర్‌లో పాటలు రికార్డవుతాయి నవంబర్‌లో షూటింగ్ ప్రారంభించి, డిసెంబర్ జనవరి నెలల్లో మూడు షెడ్యూల్స్‌లో పూర్తిచేస్తాం," అన్నారు పి చంద్రశేఖరరెడ్డి. ఈయన దర్శకత్వంలో పి. జె. ప్రభాకరరెడ్డి నిర్మించే ఉషశ్రీ క్రియేషన్స్ "పులిజూదం" చిత్రంలో కృష్ణ, జయసుధ, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, నూతన్‌ప్రసాద్, కె విజయ, అన్నపూర్ణ ఆదిగా గలవారు పాల్గొంటారు. ఉషశ్రీ సమకూర్చిన కథ, స్క్రీన్‌ప్లేకు మోదుకూరి జాన్సన్ సంభాషణలకర్త. కె. వి. మహాదేవన్ సంగీత దర్శకుడు. సుఖదేవ్ ఛాయాగ్రాహకుడు.

రాగిణి, మేనక, గిరిబాబు 'లంకెబిందెలు'



వాడికి చావు మూడిందిలే! పైగా మా సలీమ్ జేబూకు మంచి స్నేహితుడట!''

సీతకి తల పగిలిపోయినంత పనైంది వినగానే! అక్కడే పడిపోతానేమో అన్నంతగా వణికిపోయింది! ఆ చెప్పినామెకు సీత, సారథి చెల్లెలని తెలియదు.

మళ్ళా సలీమ్ గదిలోకి వెళ్ళింది గుండెల్ని అరచేతిలో పెట్టుకుని.

''అన్నయ్యా... నువ్వూ నమ్ముతున్నావా?'' అని అడిగింది వణికే స్వరంతో.

''నన్నేమీ అడక్కు!... సీతా! నేనేమీ చెప్ప లేనమ్మా!... ఆషాతోపాటు నేను కూడా పోతే బావుండేది.'' కన్నీళ్ళు అతని ముఖాన్ని తడిపివేయ సాగాయి. పసిపిల్లవాడిలా ఏడుస్తున్న సలీమ్‌ని చూస్తొంటే సీత మనస్సు తరుక్కుపోయింది.

''నువ్వంటే వాడికి ఎంత ప్రాణమో నీకు తెలియదా అన్నయ్యా? ఆషాని స్వంత చెల్లెలి కన్నా ఎక్కువగా చూసుకునేవాడు. ఇంత పనిచేయగలడా? ఒక్కసారి ఆలోచించు అన్నయ్యా!'' సీత చెక్కిళ్ళు తడిసిపోయాయి అశ్రుధారలతో.

''నేనూ రక్షించలేనేమోనమ్మా!''

''అన్నయ్యా!...'' సీత పెద్దగా అరిచింది.

''అవునమ్మా! ఆషా వాడితో యింటికి వచ్చింది. వాడిని చూసి ఏడ్చింది. పెద్దగా అరిచింది! ఆఖరికి ప్రాణం పోతూంటే...వాడినే కలవరించింది. ఇవన్నీ చూసిన వాళ్ళకి బలమైన సాక్ష్యాలు! నేనేం చెప్పినా వాళ్ళెవరూ విన్పించు కోవడం లేదమ్మా! నేను... ఆషా కోసమే గాదు ఏడుస్తున్నది ... వాడి కోసం ... కూడా! వాళ్ళిద్దరూ నాకు ప్రాణంతో సమానమైన వాళ్ళు...'' సలీమ్ గొంతు తగ్గించి బయటి వాళ్ళకి విన్పడకుండా చెప్పాడు. అతని ముఖం కళావిహీనమైంది. సర్వమూ కోల్పోయిన వాడిలా, యోగిలా కూర్చుని వున్నాడతడు.

టెక్కలి సాహిత్య సాంస్కృతిక సమాజం ఆధ్వర్యంలో ప్రచురించిన ''శ్రీనివాస వైభవం'' గ్రంథావిష్కరణోత్సవ సందర్భంగా సంస్థ అధ్యక్షుడు శ్రీ ఆర్. పద్మనాభరావు రచయిత శ్రీ నేరెళ్ల పేరిశాస్త్రికి ''అభ్యుదయ కవి'' బిరుదు ప్రదానం చేస్తున్న దృశ్యం.



# మూగ ముత్యాలు

ఎప్పటికో అన్నాడతడు.

''రేఖ ఏందమ్మా!''

''లేదు! ఏదో ఫూరు వెళ్ళినట్టుంది!''

''రేఖనోసారి పంపించు!... రేఖ మనకన్నా ధైర్యంగలది! నాకు ధైర్యం చెప్పి... సాయం చేస్తుంది!''

''అన్నయ్యా! నువ్వు... వాణ్ణి... రక్షించక పోతే... నాకు... నాకెవరూ... లేరు! వాడింత వరకు సుఖపడి ఎరుగడు! రేఖ, వాణ్ణి... ఓ సన్యాసిగా మార్చివేసింది!''

''ఏమమ్మా! రేఖ బాధతో కృశించి పోతోంది. నాకు మొన్న ఉత్తరం కన్పించింది! రాగానే వెళ్తే అక్కడా కన్పించింది! ఏమిటి రేఖ అంటే నవ్వింది! ''నన్ను మొదటిసారిగా అన్నయ్యా! అని పిల్చింది', ''నా బ్రతుకులో సుఖం లేదని తెలిసే పిచ్చిదానిలా ఆ సుఖాన్ని అన్వేషిస్తూ వచ్చానన్నయ్యా!'' అన్నది. ఆమె ఎప్పటిలా చలాకీగా, వుత్సాహంగా లేదు. ఏదో కోల్పోయిన మనిషిలా నడిచి వెళ్ళి పోయింది! రేఖకి చాలామంది తెలుసు! ఓ స్నేహితురాలి తండ్రి పోలీస్ ఆఫీసరు! ఒక్కసారి నా దగ్గరకు పంపించు!''

అంత దుఃఖాన్ని గుండెల్లో దాచిపెట్టి సీతకు ధైర్యం చెప్పాడతడు!

సీత వెళ్ళగానే గోడకిచేరగిలబడి రుమాలుతో ముఖం కప్పుకుని ఏడవసాగాడు నిశ్శబ్దంగా.

''ఆషా!... ఎందుకిలా చేశావ్?... నేను నీకు గుర్తే రాలేదా? నీ కోసం ఎన్ని కలలు గన్నానో! ఎన్నిసార్లు నీకు నా మనసు విప్పి చెప్పాను! నా గుండెలు పగిలిపోయేట్టున్నాయి ఆషా! నిన్ను... కలుసుకుందామంటే... వీలు గావటం లేదు! వాడు... సారథి యూ... వ్యూహంలో బంధించబడ్డాడు! వాణ్ణే ముందు... రక్షించుకోవాలి! అప్పుడు ఏడవడానికీ, చావ డానికీ... వీలుంటుంది!'' అని మనస్సు విలవిల లాడిపోసాగింది.

సీత మౌనంగా లేచి వెళ్ళిపోయింది. ఇంటికి ఎలా చేరుకుందో ఆమెకే తెలియదు.

ఆనాటి వార్తాపత్రికలో అప్పటికే 'యూ ఆత్మహత్య గురించి' వివరాలు ప్రకటించబడ్డాయి. సారథి ఫోటోకూడా వేసింది ఓ పత్రిక.

సీత ఆ పేపర్ని చింపి ముక్కలు చేసింది కసిగా. ఆ సాయంత్రమే రేఖ వచ్చింది. సర్వం కోల్పోయినదానిలా కూర్చున్న సీతని చూసింది.

''ఏమైంది? సీతా?''

సీత తలెత్తింది. ఆమె కళ్ళల్లో గిర్రున నీరు తిరిగింది.

''ఆషా చచ్చిపోయింది!'' నిర్లిప్తంగా చెప్పింది.

''వాట్! ఎప్పుడూ?'' రేఖ కొయ్యబారి పోయింది.

''నిన్న! ...''

''ఎందుకూ? ...''

''ఎవరో ఆమె శీలా...''

''ఎవరు? తెలిసిందా? ...''

'''సారథి' అని ... చెప్పి... సాయూ పోతూ!''

''ఏమిటి నువ్వనేది? నీకేమైనా పిచ్చెక్కిందా?''

''అలాగే వుంది నిన్నటినుంచి! అన్నయ్యని అరెస్టుచేసి పట్టుకు వెళ్తూంటే ... ఏమీ చేయలేకపోయాను!''

''సలీమ్ నమ్మాడా?''

''నమ్మకేం చేస్తాడు? స్నేహాన్ని మించింది శీలం! అదీ తనకి ప్రాణంతో సమానమైన ఆషా శీలం! పిచ్చివాడిలా అరిచాడు అడిగితే!''

''ఎంతపని జరిగిపోయింది? ఓ మై గాడ్!'' రేఖ మంచంమీద కూర్చుండిపోయింది ఏం చేయాలో తోచక.

''ఇప్పుడే వస్తానుండు! నాకా ఇనస్పెక్టరు తెలుసు! ఓసారి అతడిని కలుసుకుని వస్తాను! శ్రీనివాస్‌నికూడా పిలుచుకురావాలి!'' రేఖ పరుగెత్తినట్లే నడిచి వెళ్ళిపోయింది.

ఆ వెళ్ళడం వెళ్ళడం బాగా చీకటిపడిన తరువాత యింటికి వచ్చింది.

''ఆ ఇనస్పెక్టరు దొరకలేదు సీతా! మా ఫ్రెండ్ నాన్నగారు మంచి ప్లీడరు! ఆయనతో చెప్పివచ్చాను! శ్రీనివాస్‌కూడా లేడు!''

''అలాంటివాళ్ళు మనకేమీ చేయలేరు రేఖా!''

''అందుక్కాదులే! ఎక్కడికి వెళ్ళాడో! నేను నా ఫ్రెండుతో కలిసి గోల్కొండ చూసి వద్దామని వెళ్ళాను! అక్కడినుంచి ఓ పల్లెటూరు వెళ్ళాం వాళ్ళ బంధువుల్ని చూడడానికి! ఇలా వెళ్తున్నానని శ్రీనివాస్‌క్కూడా చెప్పాను! నాతో చెప్పకుండా ఎక్కడికీ వెళ్లడే?...''

''ఇప్పుడతనెందుకు రేఖా? ఆ యినస్పెక్టరుగారిని కలుసుకో ముందు!'' రేఖకి ఆమె మాటలు విన్పించనేలేదు. ఆమె ఏదో ఆలోచిస్తోంది తీవ్రంగా.

''నువ్వు ఆషాని చూడలేదుగదూ యింత వరకు!''

సీత లేదన్నట్లు తల వూపింది.

''నిన్నగానీ, మొన్నగానీ నువ్వు శ్రీనివాస్ దగ్గరకెళ్ళావా?'' సీత సమాధానం చెప్పలేదీసారి.

''చెప్పవన్నమాట!''

''మధ్యన ఆయన సంగతెందుకిపుడు?'' సీత విసుక్కుంది.

''ముందు ఆయన్నే పట్టుకోవాలి! నన్ను మోసంజేస్తున్నాడని తెలిసింది! అందుకే వూరు వెళ్ళినట్లు వెళ్ళి వెంటనే వచ్చేశాను! కానీ నేను వచ్చేసరికే అతడు లేడు రూమ్‌లో!''

''అయితే వెళ్ళి అతడినే వెతుక్కో!



# వేడి మీ శక్తిని పిండి పిప్పి చేస్తున్నప్పుడు...



## గ్లూకోన్-డి ® తీసుకోండి

**అదనపు శక్తి కోసం—అలా మీకు కావలసినప్పుడల్లా.**

అలసట కలిగించడంలో వేడిని మించిందిలేదు. అలా వేడి వాతావరణంలో పనిచేస్తున్నప్పుడు అలసట, దాంతో పాటే నీరసం వచ్చేస్తుంది. అప్పుడే మీకు కావాలి ఉత్సాహాన్నిచ్చే, చల్లదనాన్నిచ్చే గ్లూకోన్-డి. అది మీకు అదనపు శక్తిని ఇస్తుంది. అలా మీకు కావలసినప్పుడు.

గ్లూకోన్-డి, లక్షలాది మంది 30 ఏళ్ళుగా విశ్వసిస్తూ వస్తున్న గ్లాక్సోజ్-డికి కొత్త పేరు. పళ్ళరసం, పాలు, టీ, కాఫీ, నీళ్ళు—దేనిలోనైన అలా దాన్ని కలుపుకు తాగండి లేక దేనితో కలపకుండా అలాగే తాగండి. శక్తి అలా ఉరకలు వేస్తూవచ్చే అనుభూతిని పొందండి.

గ్లూకోన్-డి మీ కుటుంబంలో నివారందరి కోసం. పనుల్లోనూ, ఆటల్లోను వారికి చురుకుదనం కోసం. గ్లూకోన్-డి—అందరికీ పరిచయమున్న అదే పచ్చ ప్యాక్‌లో వస్తుంది.







**విటమిన్ డి, కాల్షియం ఫాస్ఫేట్‌తో బలపరచబడిన అసలైన గ్లూకోజ్ పౌడర్—గ్లాక్సో సమర్పణ**

HTB-GLL-6591-TG

అన్నయ్య సంగతి నీకెందుకుగానీ ?'' సీత వ్యంగ్యంగా అన్నది.

''నిజమే! నా బ్రతుకు నేనే చూసుకోవాలి! వస్తానుమరి!'' అని మళ్ళీ సుడిగాలిలా వెళ్ళిపోయింది.

''ఈ మనిషి ఏ పదార్ధంతో చేయబడింది? ఇంత ఘోరం జరిగినా చీమయినా కుట్టనట్లే వెళ్ళిపోయింది! ముందు తన బ్రతుకు చూసుకుంటుందట! అన్నయ్యా నువ్వు పాముకి పాలు బోసి పెంచుతున్నావురా! ఎలా వెళ్ళిపోయిందో చూడు! సారధి అన్న మనిషిని ఎరగనట్లే మాట్లాడింది శ్రీనివాస్ వెళ్ళిపోయాడనగానే! ఎంత విచిత్రమైన మనిషి? రక్తసంబంధం కూడా యీమెని కదిలించదా ?''

సీత వున్న కోపాన్నంతా రేఖపైన గుమ్మరించింది.

ఆ రాత్రి ఎంతోసేపటివరకు రేఖ వస్తుందేమోనని ఎదురుచూసింది. కానీ ఆమె రానేలేదు. ''ఎంత పిచ్చిదాన్ని ? ఈ రేఖ నన్నుద్దరిస్తుందా ?'' అనుకుంది తెల్లవారిపోతూంటే.

కానీ రేఖ ఎక్కడెక్కడో తిరిగి సలీమ్ దగ్గరకు వెళ్లిందని ఆమెకు తెలియక కోపం తెచ్చుకుంది.

సలీమ్‌ని చూడగానే రేఖ చేతుల్లో ముఖం దాచుకుని ఏడ్చింది.

సలీమ్ నిశ్శబ్దంగా కన్నీరు కారుస్తూ... పెదవుల్ని నొక్కుకుంటూ—దుఃఖాన్ని నిగ్రహించడానికి సర్వప్రయత్నాలు చేసి విఫలుడైపోయాడు. మోకాళ్ల మధ్య ముఖం దాచుకుని రోదించసాగాడు.

''ఆషానీ, నిన్నూ చూసి నేనెంత గా సంబరపడిపోయేదాన్నో! చెప్పలేనన్నయ్యా! నా కలలకి రూపం పోసుకున్నట్లుండేవాళ్లు మీ యిద్దరూ! కానీ ... యిలా ... జరుగుతుందని నేను కలలో కూడా వూహించలేదు!'' రేఖ దుఃఖాన్నుంచి తేరుకుని అన్నది.

సలీమ్ కళ్లు వత్తుకుంటూ అన్నాడు—

''ఆషా మనస్సు చాలా సున్నితమైంది రేఖా! ... ఆ మనస్సుని ముక్కలు ముక్కలుగా కోసివేశారెవరో... అందుకే ప్రాణంతో ప్రాణమైన నన్నిలా జీవచ్ఛవాన్నిజేసి... వెళ్లిపోయింది! నీకు... తెలియదేమో! ... ఆషాని ... ఏ దుర్మార్గుడో... తన... పశు వాంఛ కోసం... బలి తీసుకున్నాడమ్మా!''

''అన్నయ్యా!'' రేఖ నిర్ఘాంతపోయింది.

''అవునమ్మా! ముందు నేనూ నమ్మలేకపోయాను! ... గానీ అక్బర్...నిన్న ఆషా గదిలో పడున్న చిన్న వుత్తరం తెచ్చి చూపించాడు! ఇదుగో! చూడు! దీనివలన... మనకి ఏమైనా ఆధారం దొరుకుతుందేమో! ఆషా అన్నగారు మండిపోతున్నాడు! సారధిని... అన్ని వైపుల నుంచీ బంధించడానికి వాళ్లన్ని ప్రయత్నాల్ని



చేసి వేశారు! నేను ... ఏం జేసినా రహస్యంగా చేయవలసి వస్తోంది! ఒక్క ఆషాకి తప్ప నా దుఃఖం ఎవ్వరికీ విన్పించదు! నేను సారధి వైపున్నానని తెలిస్తే ముందు అమ్మ గుండెలు పగిలిపోతాయి!''

రేఖ ఆ వుత్తరాన్నందుకుని చూసింది—

''సలీమ్!.. నీ ఆషా... ని ...సర్వనాశనం చేశాడు... వాడు ... వాణ్ణి ... సారధి ...''

అక్కడితో ఆగిపోయిందా వుత్తరం. కన్నీరు పడి పూర్తిగా చెరిగిపోయాయి ఆ తరువాత రాసిన అక్షరాలన్నీ! వుత్తరం నలిగిపోయివుంది బాగా!''

''అన్నయ్యా! నీక్కూడా సారధి పైన అనుమానంగా వుందా ?'' రేఖ గుండెల్ని బిగబట్టుకుని అడిగింది.

## క్షణాల్లో రక్తపరీక్ష!

జపానులోని ఫ్యూజి ఎలక్ట్రిక్ కంపెనీ రక్తపరీక్షకు కొత్త పరికరాన్ని రూపొందించింది. దీని సహాయంతో రక్తంలోని యూరియా శాతాన్ని అతిత్వరలో అతి ఖచ్చితంగా కనుగొనవచ్చును. మూత్రపిండాల వ్యాధితో బాధపడేవారికి అత్యవసర పరిస్థితులలో ఇది సహాయకారిగా ఉండగలదు. 30 సెకన్లలోనే రక్తంలోని యూరియా కొలతను ఒక తెరపై చూపించింది. మరో 30 సెకన్లలో తరువాత పరీక్షకు సిద్ధమైంది. ఈ పరికరం పూర్తిగా సంతృప్తికరమైన ఫలితాలను సాధించటంతో దీనితో పలు రకాల పరీక్షలను చేయటానికి వీలుగా రూపొందించటానికి కృషి చేస్తున్నారు.

''సారధికి ... ఆషా ... రాఖీ కట్టిందమ్మా! ఆషా ప్రాణంతో కలిసిపోయేది నా ప్రాణం కూడా ... సారధి ... యిందులో లేకపోతే! వాడు... మనిషి కాదమ్మా!...దేవుడు...నేను... విస్కీ నిషాతో బ్రతికేవాణ్ణి! ఏ నీతి నియమాలూ నన్ను బంధించగలిగేవి గాదు!... సారధి నన్ను... ఓ మనిషిగా మార్చాడు! ఏ నిషా కూడా నన్నంటుకోలేకపోయింది వాడు నా స్నేహితుడైన క్షణం నుంచి! ఆషా మొదట్లో... నా కోసం... ఏమీ యివ్వలేను పొమ్మంది! కానీ సారధి స్నేహం ఆషాని నా మనిషిగా మార్చివేసింది! వాళ్ళిద్దరూ నా ప్రాణంలో ప్రాణమైపోయారు! ప్రతిరోజూ ఆషాకి ట్యూషను చెబుతూ నా గురించి కూడా విన్పించేవాడు! వాడితోనే మా కథ మొదలైంది!

కానీ ... యిప్పుడు ... వాణ్ణే ... జైల్లోకి త్రోసివేసింది!'' సలీమ్ కళ్ళనిండుగా నీళ్ళే!

''నాకు... తెలుసు... అన్నయ్యా... ఎవ్వరికీ హాని చేయడు! చేయలేడు!'' రేఖ గొణిగింది.

''రేప్రొద్దున్న ... వస్తానన్నయ్యా!'' అని వెళ్ళిపోయింది.

మరునాటి మధ్యాహ్నం విజయ వచ్చింది.

''విజయా! నువ్వా!'' సీత ఆశ్చర్యపోయింది.

''ముందు ఒక కప్పు కాఫీ యివ్వు సీతా! నిన్న పేపరు చూసిన క్షణం నుంచి పిచ్చిదానిలా మంచినీళ్ళుకూడా ముట్టుకోలేకపోయాననుకో! ఇంతకీ ఇందులో... నిజం వుందంటావా ?''

విజయ కళ్ళు లోతుకుపోయాయి. ఆమె ముఖం పాలిపోయింది. సారధి ఆమెకెంత ప్రియమైనవాడో ఆమె కళ్ళే చెబుతున్నాయనిపించింది సీతకి.

మంచినీళ్ళు త్రాగి కుర్చీలో వాలి కళ్ళు మూసుకుంది.

సీత కాఫీ కలిపి తెచ్చి యిచ్చింది. కాఫీ త్రాగిన తరువాత ఆమెకు కాస్త అలసట తగ్గినట్లనిపించింది.

''ఆయనేమన్నారు సీతా?'' అన్నదెప్పటికో.

''అన్నయ్య పిచ్చివాడిలా జైల్లో వున్నాడు విజయా! నేను వెళ్తే మహా యోగిలా నవ్వాడు! 'చూశావామ్మా! ఆషా నాకు చెల్లెలని వాడికి తెలీదూ? నాకు నువ్వూ, రేఖా, ఆషా సమానమని ఎన్నిసార్లు వాడితోచెప్పాను? నా చెల్లెళ్ళి... వద్దులేమ్మా! ఆ... ఘోరాన్ని నేను చెప్పలేను!'' అని తల వంచుకున్నాడు.

సీత జరిగిన సంగతి చెప్పింది.

''మీ అన్నయ్య దేవుడులాంటివాడు సీతా! సలీమ్ ఎలా నమ్మాడసలు ?''

''నమ్మకేం చేస్తాడు? అసలు ఏంజరిగిందో ఎవరికి తెలుసు ? ఆఖరి ఘడియల్లో ఆషా అన్నయ్య పేరు చెప్పడంతో యింత జరిగిపోయింది ?''

''తాతయ్య ఓ రోజంతా పూజ గదిలోనే కూర్చుండిపోయాడు. ''సారధిని భగవంతుడు పరీక్షిస్తున్నాడమ్మా'' అన్నాడు.

''ఒక్కసారి... వెళ్ళి మీ అన్నయ్యను చూసి రావాలి సీతా!''

సీత మౌనంగా లేచి తయారయ్యింది.

''ఓ ప్లీడరు తాతగారిస్నేహితుడికొడుకట. ఆయనని కలుసుకోమన్నారు!'' విజయ దారిలో చెప్పింది.

''రేఖ తనకి తెలిసిన ప్లీడరుతో చెప్పిందట! ప్రొద్దునే ఫోను చేసింది. ఏమైపోయిందోనని హడిలిపోతూంటే ప్రొద్దున్న తిరిగొచ్చి చెప్పింది కబురు. డబ్బు తీసుకురావడానికి బ్యాంకుకు వెళ్ళింది!''

''అవసరమైతే నా దగ్గరా వుంది సీతా!

## మూ గ ము త్యా లు

తాతయ్య రెండు వేలు తీసుకువెళ్ళమన్నారు !'' విజయ అన్నది.

''నా అక్కౌంటుకూడా యిక్కడే వుంది ! అది చాలకపోతే తీసుకుంటానులే !''

అంతలో జైలు వచ్చింది. ఇరువురూ లోనికివెళ్ళారు.

సారధి తలవంచుకుని కూర్చుని వున్నాడు. గడ్డం బాగా పెరిగిపోయింది.

''అన్నయ్యా!'' సీత పిలుపువిని తలెత్తాడు.

విజయనిచూసి నిర్ఘాంతపోయాడతడు. విజయకి కన్నీళ్ళాగలేదతడి ఆకారంచూసి.

''తాతయ్య... బావున్నారా ? '' అతని కంఠం వణికింది.

విజయ సమాధానం చెప్పలేక తల వూపింది.

''రేఖ వచ్చిందా సీతా ?'' సీత ఫోను చేసిందని చెప్పింది.

''నా కోసం ప్లీడర్ని పెట్టిందట ! ఇప్పుడే ఆయనవచ్చి ఏమేమో అడిగివెళ్ళారు ! పిచ్చిపిల్ల! పైకిమాత్రం విరుచుకుపడుతుంది ! లోపల నేనంటే ఎంత ప్రేమవుందో చూశావా ? రాత్రంతా ఆ ప్లీడరుగారిదగ్గరే వుందట ! నన్ను చూడ్డానికి రాలేనన్నదట !'' అతని స్వరం గద్గదమైంది.

''మీరేమీ దిగులు పెట్టుకోకండి ! మీరు నిర్దోషులయినపుడు కోర్టు మాత్రం ఏం చేస్తుంది ? ఈ కేసు పరిష్కారం అయ్యేవరకు యిక్కడే వుండమన్నారు తాతయ్య !'' విజయ ధైర్యం చెప్పింది.

''ఈ కోర్టులో నన్ను శల్యపరీక్ష చేస్తారు విజయా ! నేను గుండెల్లో భద్రంగా దాచుకున్న రహస్యాల్నికూడా నిర్దాక్షిణ్యంగా వెలికి లాగుతారు! నాతోబాటు... నావాళ్ళనికూడా పరిహసిస్తారు ! నన్ను బ్రతికివుండగానే చచ్చినవాడిక్రింద జమ కట్టేస్తుందీలోకం ! ఆఖరికి... రేఖనికూడా... ఎన్నెన్నో కోణాల్లోనుంచి పరిశీలించి లేనిపోని మాటలంటారు ! నా రక్తం సలసలా కాగిపోతుం దపుడు ! నిన్నుకూడా నా కథలో నిలబెడతారు ! వూహించడానికే మనసొప్పని విధంగా మన అను బంధాన్ని చిత్రిస్తారు! అప్పుడు నన్ను... నన్ను.. క్షమించు విజయా !'' సారధి దీనాతిదీనంగా అర్థించాడు.

విజయ కళ్ళనిండుగా అశ్రుబిందువులే ! సీత నిశ్శబ్దంగా ఏడవసాగింది.

''సీతా ! ... నేనీ పరాభవాన్ని భరించ లేనమ్మా ! నన్ను... ఆ బోనులో... నిలబడగానే ...కాల్చేయమని రేఖతో చెప్పు !''

''దయచేసి ఆపండి ! మీకు నమస్కారం పెడతాను !'' విజయ సజల నేత్రాలతో చేతులు జోడించింది. సీత దుఃఖాన్ని పట్టలేక మరో వైపుకి వెళ్ళిపోయింది.

''ఇప్పటికే నా గురించి ఎందరికో తెలిసి పోయి వుంటుంది ! ఇంకా కొందరికి తెలుస్తుంది కొన్నాళ్ళలోపలే! తాతయ్యతో చెప్పు విజయా ! మళ్ళీ ఆయన్ని చూడ్డం పడదేమో ... నన్ను మీకు గార్డియన్‌గా వేశారట ! మరొకరిని ... నియమించమని చెప్పు !''

విజయ దుఃఖంతో నోరెత్తలేకపోతోంది.

''వెళ్ళండి ! సాధ్యమైనంతవరకు రాకుండా వుండడానికే ప్రయత్నించండి ! ఈ అపఖ్యాతి నాతోనే పోనివ్వండి !''

''మీరెందుకిలా విరక్తిని పెంచుకుంటు న్నారు ? న్యాయం గుడ్డిది కాదు ! ఆ పైన... మీకు...నేనున్నాను ! ఈ విజయ ఎప్పటికీ మీదే ! తాతయ్యతో చెప్పివచ్చాను యీ మాటే ! మీ కోసం ఎంతయినా ఖర్చుపెట్టదలచుకున్నాను ! నా జీవితమే మీదని గుర్తుంచుకోండిక !''

అతడు నవ్వాడు విరక్తిగా,

''రేపు కోర్టులో నన్ను నిలబెట్టి ప్రశ్నించి నపుడు యీ మాట అన్నందుకు నువ్వు సిగ్గు పడతావు విజయా ! సీతా ! విజయని తీసుకు వెళ్ళు !'' సారధి సీతను పిలిచి చెప్పాడు.

''వద్దు ! విజయా ! ఇంకేమీ చెప్పకు ! వెళ్ళు !'' అతడు విజయ ఏదో చెబుతూంటే కాదని వారించాడు.

సీత, మౌనంగా విజయ చేతినందుకుని కళ్ళతోనే చెప్పింది.

విజయ చేసేదేమీలేక సీత ననుసరించింది.

''ఎంత పిచ్చిదీ విజయ ? ఇంకా నన్ను ప్రేమిస్తోందా ? ఈ జీవచ్ఛవాన్ని ఎవరు ప్రేమించగలరు?'' సారధిలో విరక్తి అలలా లేచి పడింది. ఆ తరువాత అతనికి తన గురించి ఆలోచించాలన్పించలేదు. తల వాల్చుకుని గోడకి జేరగిలబడ్డాడతడు.

( ఇంకా వుంది )


ఆంధ్రపత్రిక

దిన పత్రికలో

* మన సినిమాలు

* వింత యదార్థం

శీర్షికలు

చూస్తున్నారా ?



**రచయితలకు మనవి**

స్థానికంగా వున్న రచయితలు, కార్టూనిస్టులు కూడా మా కార్యా లయానికి వచ్చి వారి రచన లంద జేస్తున్నప్పుడు వాటితోపాటు స్వంత చిరునామాగల స్టాంపులంటించిన కవరు పెట్టడం అవసరం. సం.





సెక్సు, సుఖవ్యాధులు, సంతానము. గర్భాశయ వ్యాధులు, మొలలు, చర్మ వ్యాధులకు అనుభవచికిత్స. పోస్టు ద్వారా చికిత్స కలదు.

సరోజ నర్సింగ్ హోమ్,

డాక్టర్ యస్. సరోజిని,

H.O. కొత్తపేట చౌకు, విజయవాడ-1.

బ్రాంచి : శీలంవారివీధి,జిన్నాటవర్,గుంటూరు.



సినీతారలు

మీకు నచ్చే నలుగురి తారల సెక్సీ ఫొటోసెట్ 10 రూ.

మీరు మెచ్చే ఒక నటి,నటుడి ఫొటో సెట్ 5 రూ.

నటీనటుల అడ్రసులగల డైరీ 2రూ.

కావలసినవారు M.O.చేయుండి.

వై.కె.మూర్తి,

వాసగంవారివీధి విజయవాడ-2.



డా. కె.యల్. నారాయణ



వైద్యవిద్వాన్, వైద్యాచార్య

చర్మవ్యాధులకు, స్త్రీల వ్యాధులకు, పక్షవాతం, సుఖ వ్యాధులకు, సెక్సు, నరముల బలహీనతలకు, ఆయుర్వేద చికిత్స.

పోస్టుద్వారా చికిత్స కలదు.

లక్ష్మీ కుమారి క్లినిక్,

మెయిన్ రోడ్, తెనాలి.

# డాక్టర్ సలహాలు

డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

## ఎమ్.ఎల్.ఎస్. — మద్రాస్

నా వయస్సు 67 సంవత్సరములు. సుమారు ఏడాదినుండి మల విసర్జన సమయంలో ఆ ప్రేగు ఒక అంగుళం బయటికి వస్తోంది. మరలా అదే లోపలికి పోతూ వుంటుంది. ఒక్కొక్క సమయంలో కొంచము శ్రమపడితేనే గాని లోపలికి పోవటంలేదు.

★ దీనిని ప్రొలాప్స్ రెక్టం అని అంటారు. దీనికి శస్త్ర చికిత్స అవసరం అవుతుంది.

## యం. సి. — భిలాయి

నా వయస్సు 33 సం॥లు. నాకు ఇద్దరు పిల్లలు. వేసెక్టమీ ఆపరేషన్ చేయించుకోవాలని ఉంది. నా మిత్రుడు పురుషులు వేసెక్టమీ చేయించుకొంటే సంభోగేచ్ఛ రాను రాను సన్నగిల్లుతుందని చెప్పాడు. దీనిపై మీ సలహా ఏమిటి ?

★ వేసెక్టమీకి, సంభోగేచ్ఛకి ఏమాత్రమూ సంబంధం లేదు. వేసెక్టమీ ఆపరేషన్ వల్ల టెస్టిస్‌లలో ఉత్పత్తి అయ్యే స్పెర్మటోజోవాల సహజ పయన మార్గంలో అవరోధం మాత్రమే ఏర్పరచబడుతుంది. సంభోగేచ్ఛ అనేది టెస్టోస్టిరాన్ అనే హార్మోను మీద ఆధారపడి ఉంటుంది.

## డి.వి.ఆర్. — కాకివాడ

మా అబ్బాయి వయస్సు 12 సం॥లు. చాలా బలహీనంగా ఉంటాడు. వాడు పుట్టిన ఒక గంటకి బొడ్డునుండి చాలా రక్తం పోయింది. ఈ రక్తం పోవటానికీ బలహీనంగా ఉండటానికి ఏదైనా సంబంధం ఉందా ?

★ బొడ్డునుండి రక్తంపోవటానికీ ప్రస్తుత బలహీనానికీ సంబంధంలేదు. ఎవరైనా డాక్టరు వద్ద పరీక్ష చేయించి ఏవైనా రోగాలు ఉన్నాయేమో తీర్మానించవలసి ఉంటుంది. మల పరీక్ష చేయించటం అవసరం.

## ఆర్. — కామారెడ్డి

నా వయస్సు 17 సం॥లు. చిన్నప్పటినుండి ఇప్పటివరకు పక్కలో మూత్రం పోతున్నది. ఎక్కడికైనా వెళ్ళాలంటే సిగ్గుగా ఉన్నది. పోసేముందు గుర్తుకురావటంలేదు. దీనికి తగిన నివారణోపాయం చెప్పగలరు.

★ మీరు వెన్నెముక ఎక్స్—రే తీయించుకోవలసి ఉంటుంది. వెన్నెముక భాగంలో పుట్టినప్పడే ఏర్పడగల అవాంతరాలవల్ల మూత్రకోశంకి (యూరినరీ బ్లాడర్) వెళ్లే నరాలు ప్రేరేపింపబడి మూత్ర విసర్జన జరిగే అవకాశం ఉంటుంది. అలా ఉన్నప్పుడు న్యూరో సర్జన్లు శస్త్రచికిత్స మూలంగా నయంచేయగల అవకాశం ఉంటుంది.

## పి. ఎస్. సి. — పొన్నాపురం

మనిషి పుట్టుకతోనే కొన్ని వ్యాధులు వస్తాయి, వాటిని నయం చేయలేము అని పెద్దలు అంటారు — నిజమేనా ? క్షయ — అంటురోగం; నివారించలేము అంటారు — దీనికి మీ సమాధానం ఏమిటి ?

★ పుట్టుకతో వచ్చే ఎన్నో రోగాలకి ప్రస్తుతం చికిత్స చేయటం జరుగుతున్నది. వీటిలో శస్త్రచికిత్సాపరంగా ఉండే వాటికి చాలామటుకు చికిత్స లభిస్తున్నది. జీన్స్‌లలోని అవకతవకలవల్ల ఏర్పడే రోగాలకి మాత్రం చికిత్స కష్టతరం.

క్షయ అంటురోగమే. ఈ రోగానికి ప్రస్తుతం మంచి చికిత్స ఉంది. క్రమబద్ధంగా మందులు వాడితే తప్పక పూర్తిగా నయమవుతుంది.

## ఎవ్.వి.కె. — హిందూపురం

నాకు చిన్నప్పటినుంచి నాలుక కొనలో మచ్చ ఉన్నది. ఆ మచ్చ ఇప్పటికి చాలా పెద్దదయిపోయింది. మాట్లాడుతూంటే ఎదుటివాళ్ళకి నాలుక నల్లగా కనిపిస్తుంది. ఆరోగ్యరీత్యా ఇలా ఉండటం హానికరమేనా !

★ పుట్టుకతోనే ఉన్న మచ్చకి చికిత్స ఏమీలేదు.

కొందరికి కడుపులో హూక్ వర్మ్‌లు ఉన్నప్పుడు నాలుకమీద మచ్చ ఏర్పడే అవకాశం ఉంటుంది. మలపరీక్షద్వారా ఈ క్రిములు ఉన్నదీ లేనిదీ తెలుసుకోవచ్చును.

ఈ మచ్చలు పుట్టుకనుంచీ ఉన్నవారికి నీటివల్ల ఆరోగ్యానికి ఏమీ హాని లేదని చెప్పవలసి ఉంది. ★

ఏమీలేదోయ్ ఊళ్లో దొంగల భయం ఎక్కువగా ఉందని లోపల కూడా తాళం వేసి వస్తున్నా !!


వెళితే
ఆవిడ తలుపు
తీయదని పేవ్‌మెంటు
మీద పడుకున్న
స్వామి!


ఏమిటో వూరుకునేది?
ఇరవైఏళ్లక్రితం
కట్నం దగ్గర వాటి
దగ్గర ఈయన నన్ను
ఎంతెంత హింస
పెట్టారను -
కున్నావా?


బియ్యంలో
రాళ్లున్నాయంటే -
నేను కావాలని
వేసానంటారా
ఏమిటో?
వండేముందు
ఏరి చావొచ్చు
గదాని....


అతనూ నేనూ ఒకరి
కొకరు విడిపోలేనంత
గాఢంగా ప్రేమించుకున్నాం
- కానీ లక్ష కట్నం
అడిగాడు - అంత
ఇచ్చేకంటే మరొకడ్ని
ప్రేమించటం
మంచిదనిపించింది!
బాపు



# కథ అడ్డం తిరిగింది

'శైలజ'

"మనుషుల అప్పియరన్స్‌నిబట్టి వారి గుణగణాల్ని అంచనావేయడం కష్టం... అందుకే పూర్తి రెస్పాన్సిబిలిటీ అప్పగించేముందు కొత్తగా చేరిన అటెండర్ ప్రవర్తననూ, నిజాయితీనీ పరిశీలించడం ఎంతైనా అవసరం.'' మేనేజర్ రఘురామయ్య తన అసిస్టెంట్ సూర్యారావుకు చెప్తున్నారు.

*　　*　　*

అదొక చిన్న బ్రాంచ్ ఆఫీసు. ఆఫీసు పరిమాణం ఒక పెద్ద హాలు. మూల ఒక చిన్న చాంబర్. అది మేనేజరు రఘురామయ్యకు కేటాయించబడింది. హాలులో రెండు కుర్చీలు, రెండు టేబుల్స్, ఒక స్టూలు. పెద్ద టేబుల్ ముందున్న కుర్చీలో టైపిస్టు శ్యామల. శ్యామలకూ ఈ కథకూ ఏ సంబంధమూ లేదు. కాబట్టి ఆవిడ రంగు, రూపం, జడ వగైరాలను గురించిన వర్ణన ప్రస్తుతం అనవసరం. ఇక మిగిలిన ఆ స్టూలులో కూర్చోడానికీ, మేనేజరూ, వారి అసిస్టెంటూ పిలిచినపుడల్లా పలకడానికి, ఇతర పనులకూ అటెండర్ రాజును అప్పుడే అపాయింట్ చేసారు. ఈ అటెండర్ రాజుని గురించీ మేనేజరు తన అసిస్టెంట్‌తో చర్చిస్తున్నారు.

సూర్యారావు మేనేజర్ ఇన్‌స్ట్రక్షన్స్ అంతా విని బయటికొచ్చి తన కుర్చీలో కూర్చున్నాడు. బీరువా అంతా వెతికి తుప్పట్టిన కాలింగ్ బెల్ తీసి టేబిల్‌మీదుంచి నొక్కాడు.

"ఎస్‌సార్ !'' వెంటనే అటెండర్ రాజు హాజరయ్యాడు.

"ఇందులో వెయ్యి రూపాయలూ, పే ఇన్‌స్లిప్ ఉన్నాయి'' అంటూ ఒక కవరు తీసి రాజు చేతికందించాడు. "దీన్ని తీసుకొని ఎదురుగా ఉన్న బాంకులో డిపాజిట్ చేసి రావాలి.''

'అలాగే సార్ !' అంటూ బాంక్ వైపు బయలుదేరాడు రాజు.

# సంధ్య చీరలు

## ఉచితం...

నగదు బహుమతులు రూ. 5,000/- వరకు
తక్షణం

* ప్రతి "సంధ్య చీర"లో ఒక
నగదు బహుమతి కూపను ఉంటుంది.



**సంధ్య టెక్స్‌టైల్ మిల్స్**

203-205, జవేరిబజార్,
3వ అంతస్తు,
మీర్జా స్ట్రీట్ కార్నర్,
బొంబాయి-2
ఫోను: 325834.

సంధ్య చీరలు అన్ని ముఖ్యమైన షాపుల్లో దొరుకును.
డీలర్‌షిప్ కొరకు మా మిత్ర హోల్‌సేల్ డిపోను సంప్రదించండి

## జైన్ ఫాబ్రిక్స్

3-4-254, గంజ్‌బజార్, మహంకాళిదేవాలయం వెనుక,

## ఇ'వేమన' పద్యాలు




పతుల గోరవేల సుతుల బడయనేల
వెతలు పడుటయెల్ల వెట్టితనము
నేలమన్న బొయి నెత్తికెత్తినయట్లు
విశ్వదాభిరామ వినుర వేమ.

కౌంటర్‌లో పే ఇన్ స్లిప్ ఇచ్చి కవరు లోంచి డబ్బుతీసి లెక్కపెట్టాడు. అనుమాన మొచ్చింది. అందులో పదకొండొందల రూపాయ లున్నాయి. మళ్లీ లెక్కపెట్టాడు. అవును వంద రూపాయలు ఎక్కువగా ఉన్నాయి. వెయ్యి రూపాయలు జమచేసి వెంటనే తిరిగి వచ్చి

## కథ అడ్డం తిరిగింది

సూర్యారావుతో 'మీరిచ్చిన కవరులో వంద రూపాయలు ఎక్కువగా ఉన్నాయండి' అంటూ తిరిగిచ్చేశాడు.

''అరెరె! నేను చూడలేదయ్యా! చాలా థాంక్స్!'' అంటూ తనాడిన నాటకాన్ని కప్పి పుచ్చుకున్నాడు సూర్యారావు.

''మొదటి పరీక్షలో నెగ్గాడండి రాజా. నిన్న కావాలనినేనిచ్చిన ఎక్స్ట్రా వందరూపాయలని తిరిగిచ్చేసాడు. ఇవాళ రెండో పరీక్షలో ఎలా ప్రవర్తిస్తాడో చూడాలి''అంటూ తరువాత రోజు మేనేజరుకు తన రిపోర్టును సమర్పించాడు సుబ్బారావు.

సాయంత్రం అందరూ వెళ్లేక సూర్యారావు రాజాని పిలిచి ''నేనింటికి వెడుతున్నాను. నా టేబిల్‌మీద కాగితాలు చిందరవందరగా పడున్నాయి. వాటిని సర్ది షెల్ఫ్‌లో పెట్టి ఆఫీసు తలుపులేసెయ్'' అనిచెప్పి వెళ్లిపోయాడు.

రాజు టేబిల్‌మీద కాగితాలను సర్దడం మొదలుపెట్టాడు. కాగితాల మధ్య ఏదో గట్టిగా తగిలింది. తీసి చూశాడు. కాషియో పాకెట్ కాల్కులేటర్. జాగర్తగ తీసి దాచిపెట్టాడు.

మర్నాడు సుబ్బారావు రాగానే ''సార్! తమ కాల్కులేటర్ టేబిల్‌పైనే వదిలేశారండీ నిన్న'' అంటూ అందించాడు.

''నిన్న బీరువాలో పెట్టడం మరచిపోయా నన్నమాట— ఈమధ్య మతిమరుపెక్కువయింది. జాగర్తగా తీసుంచినదుకు చాలా సంతోషం'' అన్నాడు సూర్యారావు.

మేనేజర్ రాగానే రెండో పరీక్షలో కూడా రాజా తన నిజాయితీలో నెగ్గాడని విన్నవించాడు సూర్యారావు. రఘురామయ్య సంతోషించారు. ''అయితే సరైన మనిషినే సెలక్ట్ చేసాం. ఇక నుంచీ బాధ్యతతోకూడిన పనులను రాజాకు అప్పగించవచ్చన్నమాట'' అంటూ కాలింగ్ బెల్ నొక్కారు.

రాజు మేనేజర్ చాంబర్‌లో ప్రవేశించాడు. ప్రవేశిస్తూనే తన చేతిలోని కాగితాన్ని అందించాడు. మేనేజరు కాయితాన్ని విప్పి చదివారు. విభ్రాంతి చెందారు. అది రాజా రాజీనామా!

''అదేమిటయ్యా! ఉద్యోగంలో చేరి వారం రోజులైనా అవలేదు... నువ్వు సిన్సియర్‌గా పని చేస్తున్నావని ఇప్పుడే అనుకుంటున్నాను. అప్పుడే రాజీనామా చేస్తున్నావా! ఏమయిందసలు?'' ఆశ్చర్యంగా అడిగారు.

''సార్! నేనిక్కడ చేరినప్పటినుండి చూస్తున్నాను. ఈ ఆఫీసులో అజాగ్రత్త ఎక్కువగా ఉంది. నిన్న బ్యాంకులో డిపాజిట్ చేయడానికిచ్చిన డబ్బు లెక్క సరిగాలేదు. విలువైన వస్తువులను కేర్‌లెస్‌గా వదిలేస్తున్నారు. రేపు ఏదైనా జరిగితే నామీదికొస్తుంది. ఇటువంటి వాతావరణంలో పని చేయడం చాలా కష్టమనిపించి రాజీనామా చేస్తున్నాను'' అన్నాడు.

మేనేజర్ సూర్యారావుని చూశారు.

సూర్యారావు రాజాని చూసేముందే రాజు ఆ గదినుండి బయటపడ్డాడు. ★

# వారఫలం

14–10–1983 శుక్రవారం మొదలు 20–10–1983 గురువారం వరకు

♈ మేషం: మీ కృషి ఫలించి ఆనందిస్తారు. నూతన వ్యవహారం ఏదో చేపట్టనున్నారు. విజ్ఞాన రంగాను భవంతో బాగా పెరిగి పోనున్నారు. అవసరాలు తీరేటంతటి ధనం అందుతుంది. పత్రికా ప్రకటనమయితే నూత్న మార్గాల కొఱకు వెదుక గలరు. స్త్రీలకు: ఉద్యోగంలో అభివృద్ధి గలవారం.

♉ వృషభం: సాటి వార పోటీని ఎదుర్కొన వలసి ఉంటుంది. స్తోత్రప్రియుల బెడద తప్పించుకో వలసి ఉంటుంది. యత్నకార్య సిద్ధి, ఉద్యోగంలో విజయ సిద్ధి చెప్పదగిన వారం. నూతన మిత్రులు కలియనున్నారు. స్త్రీలకు: సగంలో వదలిన ఒకానొక గృహ విషయం పూర్తి చేయనున్నారు.

♊ మిథునం: ఆశయ సిద్ధిగలవారం. ఉద్యోగాభివృద్ధిని కలిగించే వారం. వస్తు వాహనాలు సమకూర్చుకో గలవారం. బంధువర్గీయుల మూలాన శుభ వార్త వింటారు. కార్య సాధనకు నడుము కడుతారు. స్త్రీలకు: ఉద్యోగంలో స్వల్పమార్పు కనిపిస్తుంది. రాజకియంగా మికు మేలు చేకూరుతుంది.

♋ కర్కాటకం: అనవసరమైన ప్రయత్నాలుంటాయి. అలాంటివే ప్రయాణాలు కూడా తగులుతాయి. దూరబంధువులు హటాత్తుగా యింటికి రాగలరు. సంతానం కొరకు చేసిన ఉద్యోగ యత్నాలు ఫలిస్తాయి. ఆదాయానికి లోపంలేదు. స్త్రీలకు: ఒక పని చేయబోయి, మరొక పని చేపట్టటం, అధిక వ్యయం చేయవలసి రావటం జరుగుతుంది.

♌ సింహం: మతిమరపు అధికం కావటంలో, అధికమైన విలువ గల వస్తువులు, పోగొట్టు కొంటారేమో జాగ్రత్త! వ్యాపార రీత్యా అధిక ప్రోత్సాహం కనిపిస్తుంది. విద్యా వినోదాలతో, విందుభోజనాలతో వారం గడుస్తుంది. స్త్రీలకు: వ్యాపార విస్తరణ, వ్యవహారముంటే పరిష్కారం ఆశింపవచ్చు

♍ కన్య: విజయవంతమైన వారం. ధనలబ్ధికి లోటు లేదు. అధిక వ్యయానికి లోటు లేదు. రాజకియంగా మేలు సంభవం. వస్తు సేకరణకు అనుకూల వారం. స్త్రీలకు: ఆశించిన మార్పు ఉద్యోగంలో చెప్పవచ్చు. కార్య విజయం, అమూల్య వస్తు సేకరణకు అవకాశమిచ్చే వారం, గ్రహించాలి.

♎ తుల: శుక్ర శని వారాలు చాలా ప్రోత్సాహ కరంగా ఉంటాయి. రాబడిలో ఏమాత్రం లోపం లేదు గాని అంతకు అంత ఖర్చు చెప్పదగయున్నది. గత కొన్ని వారాలుగా ఉన్న యిబ్బందులు తొలగిపోతాయి. దైవ కార్యాలు నెరవేరుతాయి. ధైర్యంగా ఎదుర్కొనవలసిన వ్యవహారాలు యింకా ఉన్నాయి. స్త్రీలకు: సర్వ రంగాలలో అనుకూల దాయకం.

♏ వృశ్చికం: నూతన వృత్తిని చేపట్టాలని చాల మంది యత్నిస్తారు. అశాంతికి తావు లేదు. డబ్బు సమస్య ఎదురవుతుంది గాని ఎదుర్కొంటారు. కొందరు ఆరోగ్యం లోపం కనిపించటం గమనింప గలుగుతారు. గృహ సంబంధమైన సమస్యలు కూడా తల యెత్తటం గమనిస్తారు. స్త్రీలకు: వృత్తి, ఉద్యోగాలందు పెంపు చేకూర గల వారం.

♐ ధనుస్సు: చాల రహస్యంగా ఉంచుకో వలసిన వ్యవహారాలు బయటు చెప్పటంతో మీకు యిబ్బందులు ఎదురవుతాయి. గ్రహించి మెలగండి. కార్మికులకు విజయప్రదమైన వారం. వ్యవహారాలు ఏవైనా ఉంటే 'గెలుపు మీదే' అని గ్రహించండి. విద్యార్థులకు ప్రోత్సాహకరమైన వారం. మాటకు విలువ పెరగటం గమనిస్తారు. దండగ రాజకియాలలో మిమ్ము ప్రవేశ పెట్టాలని కొందరు ప్రయత్నిస్తారు స్త్రీలకు: సమాజంలో పేరు ప్రతిష్ఠలు, ధనాదాయం చెప్పదగిన వారం.

♑ మకరం: వృత్తి ఉద్యోగ, వ్యాపార, వ్యవహార, ఆదాయ వ్యవహారాలలో మెరుగు కనిపిస్తుంది. వ్యాపార రీత్యా జరిగే దండుగ ఖర్చుల భోగట్టా తెలిసికో గలరు. చాలమందికి దూర ప్రయాణాలు చెప్పదగిన అంశం. స్త్రీలకు: వస్తు వాహన సేకరణ నగలు సమకూర్చుకోవటం ముఖ్యాంశం.

♒ కుంభం: మీ మీద ఏదో అభాండం పడనున్నది. ఓర్వలేని వారి పనులే యివి అని గుర్తించి మెలగండి. వ్యాపార వృత్తులందు నూతన ప్రయోగాలు చేయాలని సంకల్పిస్తారు. ఆర్థికంగా మీరు బాగా పుంజుకొంటారు. అక్కరలేని వ్యవహారాలలో జోక్యం చేసికోకండి. స్త్రీలకు: ఉద్యోగంలో పెంపు, ఆనందోత్సాహాలకు దారి తీసే వారం.

♓ మీనం: కుటుంబంలో కలతలుంటాయి, కాని బాగా పైకి రెచ్చిపోనీయకండి, బంధు విరోధం అనవసరంగా తెచ్చికోకండి. అలాంటి గ్రహస్థితి ఉన్నది. వ్యాపార, ఉద్యోగాలందు ఉత్సాహకరమైన మార్పులు రానున్నాయి. శుభ కార్య ప్రస్తావన లుంటాయి కూడ. స్త్రీలకు: పనులు హడావుడి, ఉద్యోగం కొఱకు ప్రాకులాట స్వల్పంగా ఆదాయం చెప్పదగిన ముఖ్యాంశాలు.

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి ★

# వ్యక్తిగతం



శ్రీ ఎస్. డి. హిందుజా, ఆయన సోదరుడూ ఇరాన్‌ని ఒకప్పుడు ఏలిన 'షా'కి ఆప్తులుగా ఉండేవారుట. వీరి ద్వారా భారత దేశానికి చెందిన వారుకొందరు ఇరాక్‌లో వ్యాపారాన్ని పెంచుకోవడానికి ప్రయత్నించారట. అయితే, మాజీ రాష్ట్రపతి శ్రీ సంజీవ రెడ్డి హిందుజా సోదరులతో ఎవరూ సావాసం చెయ్యరాదనుకునేవారుట, అనేవారుట ...

కీ. శే. భుట్టో కుమార్తె బెనజీర్ భుట్టో ప్రకారం జనరల్ జియా ఉల్ హక్ ఒక నకిలీ ముసల్మాన్. ఆయనేమో ఒక శుద్ధ ఇస్లామ్ రాజ్యాన్ని స్థాపిస్తామంటున్నారు. సింధ్‌లో కొందరు సింధిస్తాన్ ఏర్పడాలంటున్నారుట. బెనజీర్ భుట్టో పాకిస్తాన్ ప్రజల పార్టీ నాయకురాలు. ఆమె జనరల్ జియా ఉల్ హక్‌కి వ్యతిరేకంగా రాసిన పుస్తకం రాతప్రతిని ఆయనతోనే ఢిల్లీకి వచ్చిన ఒక అధికారి రహస్యంగా తీసుకువచ్చారుట !





శ్రీ ఇట్‌జాక్ షమీర్ ఇస్రాయెల్ కొత్త ప్రధాన మంత్రిగా ఎన్నుకోబడుతున్నారు. ఆయన మాజీ గూఢచారి, గెరిల్లా కూడా. ఇస్రాయెల్ విధానాలు మరింత కఠినమవగలవని "పరిశీలకులు" అనుకుంటున్నారు ... ...

సీరియల్

# మానస మురళి

కొడాలి సాంబశివరావు

( గత సంచిక తరువాయి )

రెండు క్షణాలు మౌనంగా కాలం కరిగిపోయింది.

మౌనాన్ని భంగపరుస్తూ చందన వెక్కిళ్ళు... యుగయుగాల నుంచి తీరని మమతల తాలుకు వేదన– రోదన మిళితమైన ఏడుపు ...

"చందనా ! ఊరుకో ! సమయం మించిపోయింది. ఇప్పుడు ఎంత ఏడ్చినా ప్రయోజనం లేదు."

"బావా !–"

"అజ్ఞానంతో ఆరోజు నా నుంచి దూరంగా వెళ్ళిపోయావు. నీవు వదలిపోయిన నా జీవితం కొన్నాళ్ళు శూన్యంగా గడిచిపోయింది... "

"నన్ను... క్షమించు బావా !–"

"ఆ శూన్యంలో చిన్న చిరుదివ్వెను వెలిగించింది మానస –"

"బావా ...!? –" చటుక్కున అతన్ని వదలి దూరంగా జరిగింది చందన.

విజయ్ సూటిగా ఆమె ముఖంలోకి చూడలేకపోతున్నాడు. చూపుల్ని ఎక్కడో నిలిపి భారంగా అన్నాడు "నాకు మళ్ళీ పెళ్ళయింది చందనా ! నేను ఇపుడు మరొకరి సొత్తునయ్యాను–" ఆపైన చెప్పలేనట్లు తలదించేసుకున్నాడు.

ఒక్క క్షణం భూకంపం వచ్చినట్లు ఆమె తల గిర్రున తిరిగిపోయింది. పెనుజ్వాలల మధ్య ఇరుక్కుపోయినట్లు విలవిల్లాడి పోయింది.

రెండు క్షణాలు మాత్రమే ఆమె అంతులేని సంఘర్షణకు గురయింది.

వెంటనే వాటినన్నిటిని అణుచుకుని చిరునవ్వు నవ్వింది.

ఆ నవ్వు విజయ్ గుండెల్ని పిండినట్లయింది.

"చాలా సంతోషం బావా. నేను కోరుకున్నట్లే జరిగింది. ఆకాశమంత సముద్రాన్ని ఎదురుగా వుంచుకుని దప్పిక తీర్చుకోలేని దౌర్భాగ్యురాల్ని. పోనీలే... నీవైనా సుఖంగా వున్నావు..." ఏడ్వలేక నవ్వింది. నవ్వలేక ఏడ్చింది చందన.

విజయ్ ముఖంనిండా కారుమేఘాలు అలుముకున్నాయి. ఏదో తప్పు చేసిన వాడిలా ఆమె ముఖంలోకి సరిగ్గా చూడలేకపోతున్నాడు.

"మానస...! చాలా అందమైన పేరు. నీ ప్రేమను పొందిన ఆమె ఎంతో అదృష్టవంతురాలు. జీవితం అందరికీ వడ్డించిన విస్తరి కాదుగదా ! నీవు ఎప్పటికైనా కనిపిస్తావని నా స్థానం నాకే వుంటుందని భ్రమపడ్డాను. ఆ భ్రమలో బ్రతుకుతూ మ్యూజిక్ పార్టీలో చేరి ఎలాగో జీవితాన్ని లాగుతున్నాను. ఇన్నాళ్ళూ నీ గురించి బాధ వుండేది. ఇప్పుడా బాధ లేకుండా చేసింది మానస. విధి ఆడిన వింత నాటకానికి చివరిగీతం పాడే సమయం వచ్చింది–" వేదనా భరితంగా అన్నది చందన.

ఆమెనెలా ఓదార్చాలో, ఏమని సమాధాన పరచాలో అర్థంగాక పిచ్చి చూపులు చూడసాగేడు విజయ్. "చందనా నీకు చాలా అన్యాయం చేసాను కదూ? పూడ్చలేనిఅగాధాన్ని సృష్టించాను. నన్ను క్షమిస్తావు గదూ ?–" అన్నాడు ఎలాగో.

"ఎందుకు బావా అంత మాట...నా కోసం ఎంతో చేశావు. అనుభవించే ప్రాప్తం లేదు కాబట్టి దురదృష్టం నీ నుంచి నన్ను దూరంగా విసిరింది. ఇక జరిగింది మర్చిపోదాం. నాకోరికల్లా ఒక్కటే. నా బావ సదా ఆనందంగా వర్థిల్లాలి–"

"నా మీద నీకు కోపం కలగడం లేదా చందనా ?"

"దేవుడ్ని ఎవరూ నిందించలేరు. ఈజన్మకు నేనా పని చేయలేను–"

"చందనా !–"

"బావా ! నాకో చిన్న కోరిక వుంది–"

"ఏమిటో చెప్పు..."

"నేను ఉదయం కాకినాడ వెళుతున్నాను. ఎల్లుండి రాజమండ్రి మర్నాడు మరో వూరు... జీవితాంతం ఇలా ఊరూరు తిరుగుతూనే వుంటాను. మళ్ళీ నిన్ను చూస్తానో లేదో... అందుకని ఈ ఒక్క రోజ నాతో గడుపుతావా ? నీ కమ్మని కబుర్లు వినాలని, నీ సమక్షంలో కాస్సేపు వుండాలని వుంది. తీరుస్తావా బావా?"

"అలాగే ముందు ఇంటికి వెళ్దాం పద."

"ఇంటికా ? నేను రాలేను బావా ! మానసను చూసి అసూయను దాచుకోలేకపోవచ్చు; బలహీనమైన నా మనస్సు నా చెప్పు చేతల్లో వుండకపోవచ్చు. స్త్రీ సహజమైన ఈర్ష్య జనించవచ్చు. అందుకే నేను రాదలుచుకోలేదు."

ఆ మాటలలో ఆమె తనను ఎంతగా ఆరాధిస్తుందో అర్థమయిందతనికి.

"నీవు ఎక్కడికీ వెళ్ళాల్సిన పని లేదు. ఒంటరిగా ఇన్నాళ్ళూ కష్టాలు పడ్డావు. ఇక ముందు అలా జరగదు. నేనుండగా నీవు పొట్టకూటికోసం దేశాలు పట్టి తిరగనవసరం లేదు. ఇకనుంచి నీవు కూడా మాతోనే వుండాలి. వుంటావు–"

అతని ఆహ్వానాన్ని, మృదువుగా తియ్యగా తిరస్కరించింది చందన.

"నామీద నీకున్న ఆదరాభిమానాలకు కృతజ్ఞురాల్ని. నా వంట్లో ఇంకా శక్తి వుంది. బ్రతకగలననే నమ్మకం గుండెలనిండా వుంది. దేవుడు నాకు వికృతమైన రూపాన్నిచ్చినా, తీయని కంఠాన్నిచ్చి చాలా మేలు చేశాడు.

**జరిగిన కథ – 14 :** తన చిన్ననాటి స్నేహితుడు శ్రీరామ్ వ్రాసిన ఉత్తరాన్ని చూసి మండిపడతాడు విజయ్. విజయ్ డ్యూటీలో వుండగా అతని దగ్గరకు ఓ పేద బ్రాహ్మణుడు వచ్చి లేచిపోయిన తన కూతుర్ని వెదికి పెట్టమని ప్రాధేయపడతాడు. ముసలి బ్రాహ్మణుని కుమార్తె దమయంతిని, శశికర్‌ను రఘురామ్ లాడ్జిలో పట్టుకొని దమయంతికి మంచి మాటలు చెప్పి ఆమెను ఆమె ఇంటికి చేరుస్తాడు విజయ్. రాజశేఖరంగారి కుమార్తె వాసంతి వివాహ సందర్భంగా ఏర్పాటైన మ్యూజికల్ పార్టీకి వెళ్ళిన విజయ్ అక్కడ చందనను చూస్తాడు. చందన తను చందన కాదని చెప్పగా వేదనతో ఇంటికెళ్ళి గతాన్ని తలుస్తాడు. విజయ్‌కు చందన దగ్గరనుంచి ఉత్తరం వస్తుంది. గతంలో చందన తనకు చేసిన సహాయాన్ని, చూపిన అభిమానాన్ని తలుస్తాడు. ఆమెను చూడడానికి గండవరం వెళుతాడు. రెండేళ్ళనుంచి మంచంలో పడి రోజులు లెక్కపెడుతున్న చందనను చూసి చలించిపోతాడు విజయ్. చందన చివరి కోరిక తీర్చడానికై ఆమెకు తాళి కడతాడు. తనవల్ల తన బావ భవిష్యత్తు అంధకారం కాకూడదనే ఉద్దేశ్యంతో అతనికి దూరమవుతుంది చందన – ఆ విధంగా దూరమయిన చందన గాయనిగా ప్రత్యక్షమయ్యింది. హోటల్ రిడ్జ్‌లో ఆమెను కలుసుకుంటాడు విజయ్.

దానితో ఎలాగో కడుపు నింపుకోగలను. కానీ, మనను నిండని రోజున నీ దగ్గరకు తప్పక వస్తాను.''

అతను ఎంతగానో చెప్పి చూసాడు.

ఆమె తన నిర్ణయాన్ని మార్చుకోలేదు.

ఆ తరువాత ఆమె కోరిక మేర ఆమెతో కలిసి సినిమా చూసాడు. కలిసి భోజనాలుచేసారు. ఆనందంగాకబుర్లు చెప్పుకుంటూ హోటల్ గదికి వచ్చేసరికి దాదాపు రాత్రి పన్నెండు అయింది.

''బావా నీవు ఇంటికి వెళ్లకపోతే నీ భార్య కంగారుపడదా ?''

''లేదు. ఇందాక సినిమాహాల్లోంచి ఫోను చేసి చెప్పాను.''

''ఏమని ?''

''నాకోసం ఎదురుచూడొద్దు. కాస్త ఆలస్యంగా వస్తానని.''

ఇక మరేమీ ప్రశ్నించలేదు చందన. ఆ తరువాత వారిమధ్యన చాలా కబుర్లు దొర్లాయి.

''నాకు నిద్ర వస్తుంది చందనా...'' ఆవలించాడు విజయ్.

''ఇంకేం పడుకో...జోలపాట పాడతాను—'' నవ్వుతూ అన్నది చందన.

''ఇక్కడ నేను పడుకున్నట్లయితే రేపు నామీద ఊర్లో పెద్ద సంచలనమే రేగుతుంది.''

''అయితే వెళ్లిపోతావా'' దిగాలుగా అడిగింది.

''వెళ్లనులే... నీకోసం ఆపాటి త్యాగం చేయగలను. రేపు ఏదైనా వస్తే నేను చూసు కుంటాను. నీవు నిశ్చింతగా పడుకో — ఓ. కే. గుడ్‌నైట్ —'' అని అలసటగా మంచంమీద వాలిపోయాడు విజయ్.

చందన కూడా ప్రక్కనే వున్న మరో మంచంమీద పడుకున్నది.

కొద్దిసేపటికి అతను గాఢనిద్రలోకి జారు కున్నాడు.

చందనకి మాత్రం కనులు మూతబడడం లేదు. ఆమెలో అంతర్యుద్ధం చెలరేగుతోంది. ఒక గంటసేపు ఆలోచనలతో వేగిపోయింది. అప్రయత్నంగా విజయ్ వంక చూసింది. అతను నిద్రలో చిరునవ్వు నవ్వుతున్నట్లుగా వుంది. అతన్ని అలా చూస్తుంటే గుండెల్లో ఏదో మంట రేగినట్లయింది. కను రెప్పల్ని త్రోసుకుని కన్నీళ్లు బయటకు ఉరికాయి. అవ్యక్తమైన ఆవేదనతో ఆలమటించిపోయింది.

చివరకు ఒక నిర్ణయానికి రాగలిగింది.

పెన్ను కాగితం తీసుకుని బావకు ఉత్తరం రాయసాగింది.

'బంగారు బావకు —

కొందరు అదృష్టాన్ని అరచేత పెట్టుకుని పుడతారు. నాలాంటి దురదృష్టవంతులు ఈ లోకంలో ఎవరూ వుండరు. పుట్టుకతోనే అందవిహీనురాలుగా పుట్టాను. తల్లిదండ్రుల్ని కోల్పోయి రోగంతో మంచమెక్కాను. అలాంటి సమయంలో నీ అమృత హస్త స్పర్శ నాకు కొత్త ఊపిరిలూదింది. నా జీవితాన్ని చైతన్యవంతం చేసింది. నీకు తగినదాన్ని కాదని నీనుంచి దూరంగా వెళ్లి ఎన్నో కోల్పోయాను. నిన్ను ఎప్పటికీ మరిచిపోలేనన్న సత్యం ఆ తరువాత తెలుసుకుని ఎంతగానో ఆరాటపడ్డాను. ఇన్నినాళ్ల ఆరాటానికిది చివరి మజిలీ !

నీకు మళ్లీ పెళ్లయిందని — నీ జీవితంలోకి మరో స్త్రీ ప్రవేశించినదని తెలిసిన క్షణం నా మనసు భగ్గున మండింది. అందుకు కారణం నిన్ను అమితంగా ప్రేమించడమే ! నిన్ను మరొకరికి అప్పగించే విశాలత నాలోలేదు. నిన్ను ప్రేమించానేగానీ నీ ప్రేమలోని మాధుర్యాన్ని రవంత కూడా అనుభవించలేకపోయాను. ఎవరికీ కాని ఈ జీవితాన్ని ఎలా ముగించుకోవాలో తెలియక వెళ్లిపోతున్నాను.

ఆశలు చచ్చిన హృదయంతో, బీటలువారిన గుండెతో వెళ్లిపోతున్నాను. ఈ పయనం అంతు తెలియని ఏ సుదూర తీరాలకో నాకే స్పష్టం గావడంలేదు. ప్రస్తుతం కొన్నాళ్లు హృషీకేశ్‌లో గడుపుతాను. ఆ తరువాత త్రివేణి సంగమంలో కలుస్తాను. మళ్లీ జన్మలోనయినా నేను కోల్పోయిన అనురాగాన్ని, అనుభూతుల్ని పంచు కునేందుకు నీ ప్రేమ వల్లరిగా పుట్టాలని కోరిక.



28-10-83 సంచికలో ప్రారంభం

స్వర్గీయ ప్రఖ్యాత నవలా రచయిత్రి

మాదిరెడ్డి సులోచన

చిట్ట చివరి అద్భుత నవల

యక్షగానం

ఆంధ్ర సచిత్ర వార పత్రికలో

సీరియల్‌గా వెలువడబోతున్నది !

కావలెను

ఒక ప్రముఖ వార్తాపత్రిక సంస్థ వెలువరించే దిన, వార, మాస పత్రికలకి నెల్లూరు జిల్లాలో చందాదారులను చేర్చేందుకు సేల్స్ ప్రమోటర్‌లు కావాలి. వీరు నెల్లూరు కేంద్రంగా చేసుకుని కృషి చెయ్యవలసి ఉంటుంది మంచి ప్రతిఫలం లభించగలదు. ఈ రంగంలో అనుభవం గల స్థానికులకి ప్రాధాన్యం ఇవ్వబడుతుంది. ఎదురుచూసే వేతనం వివరాలతో ఇతర వివరాలతో దరఖాస్తులని, బాక్సు నెం. 65, ఆంధ్రపత్రిక, విజయవాడ-2 కి పంపాలి.

వైద్యంనుండి చక్కటి ఫలితాన్ని పొందండి

తెల్లమచ్చలకు చికిత్స





తెల్లమచ్చలు నయంకాని వేమీ కాదు. సకాలంలో సరైన చికిత్స చేస్తే మిగిలిన జబ్బులలాగే ఇది కూడ నయంచేయొచ్చు. మా నిరంతర పరిశోధనల ఫలితంగా తెల్లమచ్చ (బొల్లి)ను నయం చేయటంలో మేము విజయం సాధించాం. ఈ మందు ఎంత శక్తివంతమైందంటే ఎంత వేగంగా తగ్గిస్తుందంటే—ఉపయోగించిన వెంటనే చర్మం రంగు మారటం ప్రారంభిస్తుంది, కుదుళ్ళను నాశనం చేస్తుంది. మరియు చర్మం యొక్క సహజరంగును త్వరగా పునరుద్ధరిస్తుంది. ఇతర వైద్యులతో మీరు విసిగిపోయి వుంటే మా మందును ఒక్కసారి వాడినంతనే మీకు తృప్తి కలుగుతుంది. మీ జబ్బును గురించిన పూర్తి వివరాలు వ్రాసి మా ఉచిత సలహాను అడగండి.

**SRI AYURVEDIC PHARMACY** (Regd.)
**P.O. KATRI SARAI (GAYA)**

## మానస మురళి

వచ్చే జన్మలోనయినా నన్ను నీ పాదాల చెంతకు చేర్చుకుంటావా బావా ? నీ పద సన్నిధిలో నా జీవితం పులకించి పరవశించి బ్రతుకు పండాలి.

ఎండిపోయిన నా బ్రతుకులో నాలుగు ప్రేమ చినుకులు వర్షిస్తాయన్న ఆశతో ఇన్నాళ్ళూ బ్రతికాను. హృదయ పేటికలో ఎన్నో ఆశల్ని భద్రపరుచుకున్నాను. ఆ ఆశలన్నీ నేడు అడియాశలైనాయి...'

గుండెలో బాధ అధికం కాగా రాస్తున్న ఉత్తరాన్ని ఆపేసి లేచి కిటికీ వద్దకు వెళ్లి నిలుచున్నది చందన. ఆమె కళ్ళు అవిరళధారగా వర్షిస్తున్నాయి. కాస్సేపు మౌన వేదనను అనుభవించి తిరిగివచ్చి ఆపివేసిన ఉత్తరాన్ని అందుకున్నది.

'నిను వదిలిపోతున్న ఈ క్షణంలో నీతో ఎన్నో మనసు విప్పి చెప్పాలని వుంది బావా ! నా పిచ్చినంతా కాగితంపై పెట్టాలని తహతహలాడుతున్నాను. ఒకప్పుడు నిన్ను పొందాలనుకున్నాను. అది ప్రలోభమేనని అత్యాశేనని తెలుసు. ప్రేమ క్షణికమే కావచ్చు; అశాశ్వతమే అవవచ్చు. కానీ ఆ క్షణాలు... ప్రేమను అనుభవించిన ఆ నాలుగు క్షణాలు ఎంతో అపురూపమైనవి. విలువైనవి. ఆ సమయంలో— కొన్ని కోట్ల రోజాలనుంచి తపిస్తున్న మనసు శాంతతను పొందుతుంది. నాకలాంటి అదృష్టం ఒక్క క్షణమైనా కలగలేదు.

నా గుండెల నిండుగా ప్రేమ వాహిని ప్రవహిస్తున్నది.

ఆ ప్రేమను నీకు పంచివ్వాలని, క్షణ క్షణం తపిస్తూ, అనుక్షణం జపిస్తూ ఊహలతో రమిస్తూ— ఎన్ని కలలు— ఎన్ని ఆశలో ...! అవన్నీ తుషార స్వప్నాలయ్యాయి.

నేటితో ఆ భ్రమలకు స్వస్తి పలుకుతున్నాను.

ఈనాడు నాకు దక్కని ప్రేమానురాగాల్ని వచ్చేజన్మలోనయినా దక్కుతాయన్న ఆశతో వెళ్లిపోతున్నాను. నా ప్రేమ దాహాన్ని రేపటి కోసం మిగుల్చుకుంటాను. అంతవరకూ జన్మ జన్మల మధ్యన నా ఆత్మ తీరని దాహంతో ఊగిసలాడుతూనే వుంటుంది. నీ మనసు నొప్పిస్తే క్షమించుతావు గదూ ?

నీది కాలేకపోయిన చందన—'

పూర్తిచేసిన ఉత్తరాన్ని మడిచి టేబిల్ పైన పెట్టింది చందన. చక చక తన సూట్‌కేసు సర్దుకుంది. ఒక్క క్షణం అతని మంచం వద్దకు వచ్చి నిలబడింది— చివరిసారిగా తన ఇష్టుడైన బావ రూపాన్ని తనివితీరా చూసుకుంది.

ఆ ఒక్క క్షణంలో చందన హృదయంలో ఎన్నోవేల భావాలు ఉత్పన్నమయ్యాయి. వణికే పెదవులతో నెమ్మదిగా వంగి, తెల్లగా మెరుస్తున్న అతని పాదాలను సున్నితంగా,ఆర్తిగా ముద్దాడింది. తలలోని పూవులు తీసి పాదాల చెంత పెట్టి భక్తిగా, ఆరాధనగా నమస్కరించింది.

అంతే... గుండె పగుళ్లంలోంచి తన్నుకు వస్తున్న జ్వాలల్ని అణుచుకోలేక సూట్‌కేసు అందుకుని వడివడిగా ఆ గది దాటి వెళ్లిపోయింది చందన.

## 30

గంభీరంగా ఇంట్లోకి అడుగు పెట్టాడు విజయ్.

రాత్రంతా భర్తకోసం ఎదురుచూసి నిద్రలేమితో అలసిపోయిన మానస చటుక్కున ఎదురు వచ్చింది.

"అబ్బ ! వచ్చారా... రాత్రంతా ఎక్కడికి వెళ్లారు ? మీ కోసం ఎదురు చూసి చూసి కళ్లు కాయలు కాచాయి—" మృదువుగా మందలిస్తూ భర్త దగ్గరగా వెళ్లింది మానస.

"ఎందుకు ఎదురు చూడ్డం ? ఫోను చేసి చెప్పాగా—" రవంత చికాకు ధ్వనించిందతని కంఠంలో.

"మీకేం మగమహారాజులు అలాగే చెబుతుంటారు. అయినా వేళాపాళా లేకుండా ఏమిడ్యూటీ అండీ ! లోకంలో మీరొక్కరే చేస్తున్నారా ఉద్యోగం ? రాత్రుళ్లు కూడా డ్యూటీ చేస్తే మీ ఆరోగ్యం ఏంకావాలి ?" అని ఇంకా ఏదో అనబోయింది మానస.

"ఎప్పుడు డ్యూటీచేయాలో, ఎలావుండాలో నా గురించి నాకు తెలుసు. అనవసరంగా నన్ను విసిగించక అవతలకు వెళ్లు—" కసురుకున్నట్లుగా అని తన గదిలోకి వెళ్లి అలసటగా మంచం మీద పడిపోయాడు విజయ్.

మానస మనసు చివుక్కుమన్నది. ఏనాడూ పల్లెత్తి మాట అని ఎరుగడు భర్త. ఈరోజు ఏదో చికాకుమీద వున్నాడని సరిపెట్టుకుంది. చకచకా స్టౌవ్ వెలిగించి వేడివేడి కాఫీ కలిపి తీసుకు వచ్చింది.

"లేవండి. కాస్త వేడి కాఫీ త్రాగుదురు—" నెమ్మదిగా పిలిచింది మానస.

అతను బదులు పలకలేదు. కళ్లు మూసుకుని పడుకున్నాడు.

"మిమ్మల్నే ..." అని చిన్నగా చేతితో తట్టింది.

విజయ్ కళ్లు తెరిచి క్రోధంగా చూస్తూ "నన్ను విసిగించవద్దని ఎన్నిసార్లు చెప్పాలి ?—" అని విసురుగా ఆమె చేతుల్ని నెట్టేశాడు. ఆ ఊపుకు ఆమె చేతిలోని కాఫీ కప్పు భళ్లున క్రిందపడి పగిలిపోయింది. కాఫీ చుక్కలు చింది ఆమె చీరనిండా చిందాయి. భర్త ముఖంలోని కాఠిన్యతకు, కళ్లలోని కోపానికి ఆమె వణికిపోయింది. భయంతో పాటు చప్పున కన్నీళ్లు కూడా తిరిగాయి. మరేం మాట్లాడలేక పగిలిన గాజు ముక్కల్ని ఏరి అవతలకు వెళ్లిపోయింది మానస.

విజయ్ ఆరోజు శెలవు పెట్టాడు. రోజంతా తన గదిలోనే వుండిపోయాడు. ఉదయం నుండి తిండి నీళ్లు లేకుండా అలాగే పడుకున్నాడు. భర్త కోపానికి కారణమేమిటో తెలుసు కోవాలన్న తపనగా వున్నా అడిగే ధైర్యం లేక మౌనంగా వుండిపోయింది. ఆమె మనసు పరిపరి విధాల పోతోంది. తను కూడా పచ్చిగంగ ముట్టలేదు.

సాయంత్రం దీపాలు పెట్టేవేళ గదిదాటి బయటకు వచ్చాడు విజయ్.

సోఫాలో దిగాలుపడి కూర్చున్న భార్యను చూసాడు. అతని హృదయం కలుక్కుమన్నది. 'చందన వెళ్లిపోయిందన్న కోపాన్ని మానసమీద చూపించాడు. తనెంత మూర్ఖుడు —' అని పాశ్చాత్తాప పడ్డాడు విజయ్.

"మానసా !—" మృదువుగా, ప్రేమగా పిలిచాడు.

మానస సోఫాలోంచి లేచి తల దించుకుని నిలబడింది.

"ఐయామ్ సారీ ! నా మనసు బాగాలేదు. నీ పట్ల కర్కశంగా ప్రవర్తించాను కదూ ?" లాలనగా అడిగాడు.

మానసకు దుఃఖం ఆగలేదు. చటుక్కున భర్తను చుట్టుకు పోయింది.

"నేను మీ భార్యనండి. నన్ను తిట్టే అధికారం, కొట్టే అధికారం మీకున్నది. మీరేం చేసినా సహిస్తాను. నా గురించి కాదు— మీరెందుకలా వున్నారు ? మీ బాధేమిటో తెలుసుకోకుండా విసిగించాను. మీ బాధను నేను పంచుకోకూడదా?"

"ఏం కాదు... నిన్న ఓ కేసులో దొంగ పరారీ అయ్యాడు. అతన్ని పట్టుకోలేకపోయాను. నా సర్వీసులో ఎప్పుడూ ఇలా జరగలేదు. అదిసరే నీవు భోజనం చేయలేదు గదూ ?"

"మీరు తినకుండా నేనెలా తింటాను ? సుఖమైనా కష్టమైనా మీతోనే —"

ఆమె పట్ల అతనికి విపరీతమైన జాలి కలిగింది. గాఢంగా నిట్టూరుస్తూ భార్యను వంటగదిలోకి నడిపించుకు పోయాడు విజయ్

ఆ తరువాత కలతల్ని మరిచి కబుర్లతో భోజనం ముగించారు.






విజయ్ తాత్కాలికంగా చందన విషయం మర్చిపోయినట్లు నటించాడు. 'అంతకన్నా ఏమీ చేయలేను. చందన నిజంగా దురదృష్టవంతురాలే –' అని నిట్టూర్చాడు.

భోజనం అయ్యాక తాంబూలం అందిస్తూ "మీకోసం నిన్నటి నుంచి ఓ మంచి వార్త దాచి వుంచాను –" ముసిముసి నవ్వులు చిలకరిస్తూ అన్నది మానస.

"ఏమిటోయ్ అది ?–"

"ఊహుఁ... నేను చెప్పను. ఉదయం నుంచి నన్ను ఏడిపించారుగా –"

"పొరపాటైపోయింది. ఇంకెప్పుడు అలా చేయను. అదేదో త్వరగా చెప్పరాదూ ? –" బ్రతిమాలుతున్నట్లుగా అన్నాడు విజయ్.

మానస నిండుగా నవ్వుతూ "త్వరలో మనింటికి మరో పోలీసాఫీసరు రాబోతున్నాడు–" అన్నది.

"ఏమిటీ ? – " నొసలు చిట్లించాడు విజయ్.

"మనింటికి మరో పోలీసాఫీసరు రాబోతున్నాడు. అర్థంగాలేదా ?"

"ఎందుకు ? – " విస్మయంగా చూసాడు విజయ్.

"మిమ్మల్ని అరెస్టుచేసి మీ ఆట కట్టించడానికి – "

"నన్ను అరెస్టు చేసేవాడింకా పుట్టలేదు. ఇంతకూ ఎవడా రాస్కెల్ ?"

"త్వరలో పుడతాడుగా ... " అని గుంభనంగా నవ్వింది మానస.

విజయ్ ప్రశ్నార్థకంగా చూసాడు. ఆమె చిలిపిగా నవ్వి "ట్యూబ్‌లైట్ – " అని చిన్నగా తలమీద మొట్టి అక్కడనుంచి పారిపోయింది.

రెండు క్షణాల తరువాత విజయ్ ముఖం సంతోషంతో విప్పారింది.

## 31

కాలం చాలా వేగంగా పరుగిడుతున్నది. మానస కిపుడు ఐదోనెల. తన ప్రతిరూపాన్ని మోస్తున్న భార్యను చూస్తుంటే విజయ్‌కు ఎంతో గర్వంగా, ఆనందంగా వుంది. మునుపటికంటే ఎక్కువగా, అపురూపంగా చూసుకుంటున్నాడు భార్యను. ఏ చిన్న పనికూడా ఆమెచేత చేయించడు.

"బావుంది మీ వరస. నేను పనులు చేయకపోతే తిన్నది అరిగేదెట్లా ? ఇంటిపని వంటపని నౌఖర్లు చేస్తున్నారు. కనీసం మీ పనులన్నా చేయనీయండి – " అని అంటుంది మానస. విజయ్ అందుకు అంగీకరించడు.

"ఇప్పుడు నీవు పనులు చేయకూడదోయ్. బాగా విశ్రాంతి పొంది పండంటి పాపాయిని అందివ్వాలి. – " అని నవ్వుతూ వారిస్తాడు.

### నిమిషాల మీద నడుస్తూ...

ఎలక్ట్రానిక్ వాచ్ గుండెలో
సెకెండ్ల ప్రత్యక్ష ప్రతిస్పందన
నిశ్శబ్దంలోనే రక్తసంచలనం.

కాలపు గడియారంలో నిత్యచైతన్యం
గోడమీద కదిలే గండుచీమ
చెట్లమీద గెంతే ఉడత

చిటారుకొమ్మన పూచే పరిమళం !
కదిలే కలంలోంచి
పారే సిరాలోంచి కలల రూపురేఖలు

భూనభోంతరాల్లో
ప్రతినిమిషం అరగని రోడ్డుమీద
పరిగెత్తే నవజీవన లయలు.

– నిఖిల్

అయినా మానసకు ఊరికే తిని కూర్చోవాలంటే బోర్‌గా వుండేది. అందుకని ఏదో ఒక పని కల్పించుకుని చేస్తుంటుంది. దానికోసం ఇద్దరి మధ్య చిరుకోపాలు – చిరుతగవులు... వాటి మధ్య చిక్కని సరాగాలు, విరిసే రాగమాలలు...

ఒకరోజు విజయ్ భార్య ఒడిలో తల పెట్టుకుని పడుకున్నాడు. ఆమె భర్త జుత్తులోకి వేళ్లు జొనిపి నెమ్మదిగా నిమరసాగింది. చల్లని ఆ వడి, మెత్తని ఆ స్పర్శ అతనికెంతో హాయిని గొల్పుతుంది. చికాకులన్నీ మరిచిపోయి అలాగే ఆ ఒడిలో పడుకునిపోవాలనిపిస్తుంది.

"మానసా !"

"ఊఁ... " రసోద్వేగంతో తీయగా మూలిగింది మానస.

"నేను ఇక్కడుండగా ఏమిటా పరధ్యాన్నం ? – "

"పరధ్యాన్నం కాదు. పగటికల – " అని నవ్వేసింది.

"ఆ కలేమిటో నాతో చెప్పరాదూ నేనూ నీ నవ్వులో పాలుపంచుకుంటాను."

"నిజంగా చెప్పమంటారా ? – " చిలిపిగా చూసింది.

"అంతగా చెప్పరానిదైతే వద్దులే –" బెట్టుచేసాడు విజయ్.

"ఈ అందాల రాజకుమారుడ్ని ఎత్తుకుపోవాలని దేవలోకంనుంచి దేవకన్య దిగి వచ్చింది. ఆమెకు నాకు ఘర్షణ జరుగుతూంటే మీరు తమాషా చూస్తూ నవ్వుతున్నారు – "

"భలే మంచి కలగన్నావ్. ఇంతకూ మీరిద్దరిలో ఎవరుగెలిచారు ?"


ఎ.పి.పి.ఎస్.సి. గ్రూప్ I పరీక్షలు
మా 1982 పరీక్ష ఫలితాలు
19 బహిరంగ ఖాళీలలో మొదటి ర్యాంక్
శ్రీ టి. వివేక్‌తో కలిపి 9
మిగతా ర్యాంకర్స్ : శ్రీ రాజేశ్వరరావు,
శ్రీ విష్ణుస్వరూపరెడ్డి
శ్రీ శివప్రసాద్

అనుభవం పంచుకోడానికి మొదటి ర్యాంకర్స్‌లో కలియండి. ప్రిలిమినరీకి అడ్మిషన్లు ప్రారంభమైనవి. పోస్టల్ గైడన్సుకూడా ఇవ్వబడును.

కోర్సు డైరక్టర్
ఎల్. పాండురంగా రెడ్డి
ఉత్సాహముంటె వివరాలకొరకు రు. 5/– పంపండి.
సోల్జర్-స్కాలర్స్ స్టడీ సర్కిల్
9-ఫుట్‌బాల్ స్టేడియం, ఫతేమైదాన్
హైదరాబాదు-500001

ధర్మపథం:

బులుసు వేంకట రమణయ్య



# విభీషణుని భక్తి

విశ్రవసుని భార్య అయిన కైకసికి ముగ్గురు కుమారులు. వారిలో పెద్దవాడు రావణుడు, రెండవవాడు కుంభకర్ణుడు, కడసారివాడు విభీషణుడు. ముగ్గురూ దానవుల తెగకు చెందినవారే! ముగ్గురూ ఒక తల్లిబిడ్డలే అయినా, స్వభావంలో వ్యత్యాసం ఉన్నది. మొదటి యిద్దరూ క్రూరస్వభావులు. విభీషణుడు సాత్త్వికుడు. ముగ్గురూ తపస్సుచేసి బ్రహ్మవల్ల వరాలు పొందారు. రావణుడు మానవేతరుల వల్ల తనకు చావు రాకూడదన్నాడు— అతడికి మనుష్యులు లెక్కలోకి రారు. కుంభకర్ణుడు నిర్గయనే కోరాలని అనుకుని మాట తడబడి నిద్రను కోరాడు. ఇక విభీషణుడు — విష్ణుభక్తిని కోరాడు. ఇతడు విష్ణుభక్తినే ఎందుకు కోరాలి ? దీనికి సమాధానంగా ఒక గాథను చెప్పడం ఉన్నది.

దశరథ మహారాజు పుత్రులకోసం పుత్రకామేష్టి జరపగా, యజ్ఞపురుషుడు పాయసం ఇచ్చాడనీ, దశరథుని ముగ్గురు భార్యలూ దానిని భుజించినారు. ముగ్గురూ గర్భవతులైనట్లూ రామాయణ కథ.

గర్భవతి అయిన కౌసల్యకు వేవిళ్లు కలిగాయి. వాంతులు రావడం కూడా వేవిళ్ల లక్షణం కదా! ఆమె ఒకసారి వాంతి చేసుకున్నప్పుడు, ఆ వాంతిలో ఆమె భుజించిన పాయసంలో కొంచెం పడింది. ప్రకాశవంతమైన ఆ పాయసాంశాన్ని ఒక కాకి ముక్కున కరచుకొని ఎగిరినది. కొన్ని కాకులు దాని వెనుకనే ఎగురసాగాయి. అది, తోడి కాకులను తప్పించుకుంటూ అతివేగంగా, సుదూర ప్రదేశమైన లంకాద్వీపం చేరి రాజుగారి భవనం ప్రక్క వున్న పూలతోటలో ఒక చెట్టుపై కూర్చున్నది. ఆ సమయంలో కైకసి ఒక పళ్లెంలో ఆహారం పెట్టుకొని తినబోతున్నది. చెట్టు మీద ఉన్న కాకి నోటి నుంచి ఆ పాయసాంశం పళ్ళెంలోని అన్నంలో పడింది. ఆమె దీనిని గమనించలేదు. ఆమె, అన్నంతోపాటు ఆ పాయసాంశాన్ని భుజించి, తర్వాత గర్భవతి అయింది. ఆ పాయస లేసంలో విష్ణువు అంశ ఉన్నందున, ఆమెకు జన్మించిన శిశువు సాత్త్వికస్వభావుడై, విష్ణుభక్తుడైనాడు. అతడే విభీషణుడు.

సీతాదేవిని అపహరించిన అన్న రావణునికి సదుపదేశం చేసి, ఆతని క్రోధానికి గురి అయి, తరిమివేయబడి, శ్రీరాముని శరణు పొంది, లంకారాజ్యాధిపత్యం పొందడానికి, ఇతనికి గల సాత్త్వికభావమూ, విష్ణుభక్తీ కారణాలని గ్రహించవలసి ఉన్నది.

ఈ కథలోని సత్యాసత్యాల సంగతి మనం నిర్ణయించలేము. ఇది అయథార్థమే అనుకున్నా— యుక్తిసహంగా ఉన్నదని చెప్పవలసి ఉన్నది. ★

''నేనే గెలిచాననుకోండి. అయినా మీకిదేం పాడుబుద్ధి ? దాని తళుకుబెళుకుల్ని చూసి కన్నుమీటుతారా ? మా ఇద్దరికి తగవుపెట్టి తమాషా చూస్తారా ?''

''ఛా... ఛా... కలలో... ఇలలో కూడా అలాంటి పనులు చేయనోయ్'' హాయిగా మనసారా నవ్వాడు విజయ్.

''పాపం ఏమీ తెలియని అమాయకులు—'' అని మురిపెంగా భర్త బుగ్గల్ని పిండింది మానస. ''అబ్బ ! నీ ప్రేమ మండిపోను. కాస్త మెల్లగా పిండవోయ్ —'' అని అరచేత్తో బుగ్గల్ని నిమురుకున్నాడు విజయ్.

''మరి అంత గట్టిగా దానికి కన్నెందుకు గీటారు ?—'' అని జుట్టు పీకింది.

''నీమీద ఒట్టోయ్. నే నెవరికీ కన్ను గీటలేదు—'' అమాయకంగా ముఖం పెట్టాడు.

''ఇంకోసారి అలాంటి పని చేస్తూ నా కళ్లబడ్డారా నే నూరుకోను జాగ్రత్త.''

''నాకళ్ల నాఇష్టం—ఏం చేస్తావోయ్—'' ఉడికింపుగా అన్నాడు విజయ్.

''ఏం చేస్తానా ? దాని కళ్లు పీకి ఉప్పు పాతరలో ఊరేస్తాను.''

''ఇదేం న్యాయమోయ్ ! నేను కన్నుకొడితే దానికళ్లు పీకుతానంటావేమిటి ?—''

''అదంతే... లేకుంటే అది మీ కళ్ల ముందుకు వచ్చి హొయలు పోతుందా ? ఈసారి రానీ చెబుతాను—''

విజయ్ పకపకా నవ్వాడు.

మానస కూడా ముసిముసిగా నవ్వింది.

ఆ తరువాత సరదాగా ఎన్నో కబుర్లు దొర్లాయి.

ఉన్నట్లుండి మధ్యలో ''గర్భిణీ స్త్రీలకు ఏవేవో కోరికలు కలుగుతాయని విన్నాను. మరి నీకలాంటి కోరికలేవీ లేవా ?—'' అని అడిగాడు విజయ్.

''ఓ... ఎందుకులేవు. బోలెడువున్నాయి.''

''ఇకేం త్వరగా లిస్టు చదివేయ్. వరసగా తీర్చేస్తాను—''

''మళ్లీ దేవకన్య కనిపిస్తే దానికళ్లు పీకేయాలి. అది నా ప్రథమ కోరిక—'' అని నవ్వింది మానస.

''తమాషా చాలించి సీరియస్‌గా అడుగుతున్నాను చెప్పవోయ్—''

''లేకుంటే ఏమిటండీ ? నాకే కోరికలు లేవు. మీ చల్లని సహచర్యంలో నా బ్రతుకు పండి పునీతమయింది. ఇంతకన్నా ఆడదానికి ఏం కావాలి ?—'' సజల నయనాలతో ఆరాధనగా చూస్తూ అన్నది మానస.

''అదేం కుదరదు. ఈ రోజు నీవు ఏదో ఒక కోరిక కోరాలి. అది నేను తీర్చాలి !'' చిన్న పిల్లాడిలా మారాం చేస్తున్నట్లుగా అన్నాడు విజయ్.

చప్పున ఆమె మదిలో ఏదో మెదిలింది. ఆమె ముఖంలో నవ్వు మాయమయింది.

''మీ కంతగా నా కోరిక తీర్చాలనుంటే నా చిన్న తమ్మునికి కళ్లు తెప్పించి పుణ్యం కట్టుకోండి. ఇదే నా చివరి కోరిక—''

''మానసా !'' విచలితుడైనాడు విజయ్.

''అవునండీ ! అంధకార బంధురమైన వాడి జీవితానికి చారెడంత వెలుగులు ప్రసాదించండి. మా వాళ్లు ఈ జన్మలో వాడిని గురించి పట్టించుకోరు. ఆ పని మీరు పూనుకుంటే అవుతుంది. నా కోరిక తీరుస్తారు కదూ ?—''

''తప్పకుండా— నా శాయశక్తులా ప్రయత్నిస్తాను—'' అని ఆమె చేతిలో చేయి వేశాడు విజయ్.

|ఇంకా వుంది|

# అవీ... ఇవీ... అన్నీ...

## ఆంధ్రప్రదేశ్ రచయితల మహాసభలు

1984 ఏప్రిల్‌లో కృష్ణాజిల్లా అవనిగడ్డలో 'ఆంధ్రప్రదేశ్ రచయితల మహాసభల్ని' నిర్వహించాలని అవనిగడ్డలో సమావేశమైన కృష్ణాజిల్లా రచయితల సంఘం కార్యవర్గం నిర్ణయించింది. ఈ మహాసభలు నాలుగు రోజుల పాటు జరుగుతాయి. వివిధ సాహిత్యాంశాలపై సదస్సులు, రచయిత లెదుర్కొంటున్న వివిధ సమస్యలపై చర్చలు, స్వీయ రచనల ప్రదర్శనలతోపాటు మరింకెన్నో సాహిత్య కార్యక్రమాలు ఈ మహాసభల్లో చోటుచేసుకోనున్నాయి.

రాష్ట్ర, రాష్ట్రేతర ప్రాంతాలనుండి ప్రముఖులైన సాహితీవేత్తలతోబాటు పెక్కుమంది యువ రచయితలుకూడా ఈ సభలకు ఆహ్వానింపబడనున్నారు. ఈ సందర్భంగా ప్రముఖుల రచనలతో ఒక సావనీర్ వెలువడుతుంది, కృష్ణాజిల్లాకు సంబంధించిన రచయితల వివరాలతోసహా.

## చైతన్య సాహితీ సమాఖ్య

ఆచార్య దివాకర్ల వెంకటావధానిగారు హైదరాబాదులో శ్రీకృష్ణ జయంతి నాడు 'చైతన్య సాహితీ సమాఖ్య' కు ప్రారంభోత్సవం చేసారు. ప్రారంభోత్సవ సభలో డా. సి. నారాయణ రెడ్డి, డా. ముకురాల రామారెడ్డి, శ్రీ కె. వి. భాస్కరరావులు సమాఖ్యకు ఆశీస్సులు అందచేశారు.

సమాఖ్య అధ్యక్షుడు శ్రీ రాఘవరావు అతిధులకు స్వాగతం చెప్పారు; ప్రధానకార్యదర్శిని శ్రీమతి సీతాశర్చంద్ర సమాఖ్య ఆశయాలను, కార్యక్రమ ప్రణాళికను వివరించారు.

ఆధునిక కవులు సాంప్రదాయ కవిత్వం కొంతైన ఆకళింపు చేసుకుంటే భావవ్యక్తీకరణ, పదగుంభన ఎంతో చక్కగా చేయగలరని అందుకు సమాఖ్య యువ కవులకు, సలహా, సహకారము లందిస్తే బాగుంటుందని ఆచార్య దివాకర్లగారు సూచించారు.

సమాఖ్య మొదటి కార్యక్రమంగా శ్రీ హరిశ్చంద్రప్రసాద్ వ్రాసిన 'సాహితీ వ్యాసాలు' డా. సి. నారాయణరెడ్డిగారు ఆవిష్కరించారు. శ్రీ కె. వి. భాస్కరరావుగారు కృతిని స్వీకరించగా డా. ముకురాల రామారెడ్డి పుస్తకాన్ని సభకు పరిచయం చేసారు.

కవి సమ్మేళనంలో శ్రీయుతులు యం: కె. రాము, రఘుశ్రీ, రాజా, గౌరీశంకర్, జి.ప్రకాశ రావు, ఎ. సుధాకర్, వి. శ్రీరామశర్మ, శ్రీమతి గాలి ప్రభావతి, శ్రీమతి సీతాశరశ్చంద్రగార్లు కవితలను వినిపించారు.

## "కృష్ణా రచయితల సూచి"

నొకదానిని ప్రకటించాలని కార్యవర్గం నిర్ణయించింది. కృష్ణాజిల్లాకు సంబంధించిన, ప్రస్తుతం యితర ప్రాంతాలలో వున్నవారైనా సరే తమ తమ సంగ్రహ పరిచయాల్ని "గుత్తికొండ సుబ్బారావు, ప్రధాన కార్యదర్శి, కృష్ణాజిల్లా రచయితల సంఘం, మచిలీపట్నం—521 001" పేర పంపవలసినదిగా కోరుతున్నారు.




తల వెంట్రుకలు రాలుటకు
కారణము పేలు

పేలను, ఈరులను నశింపజేయుటకు కెన్‌జ్
వాడండి. సువాసనతోకూడిన పేలనాశిని
కెన్‌జ్ హెయిర్ ఆయిల్‌ను వాడి
మీ కేశములను కాపాడుకొనండి.

కెన్‌జ్
పేలనాశిని మందు
దీనిలో ఈరులను నశింపజేయు
బెన్‌జోకెయిన్ ఉన్నది.







ఫార్మ్ ప్రోడక్ట్స్
తంజావూరు-613 007 తమిళనాడు

అన్ని జిల్లాలకు డిస్ట్రిబ్యూటర్లు కావలెను.

Chhaya/PP/222

## సాహిత్య తపోధనులు

## బులుసు వేంకట రమణయ్య

నా జీవితధ్యేయం సాహిత్యసేవ, సామాన్య ధర్మ ప్రచారం — అంటారు శ్రీ బులుసు వేంకట రమణయ్యగారు సవినయంగా. ఆయన సాహిత్య తపోధనులు. ఆయన చేపట్టని సాహిత్య ప్రక్రియాలేదు; చేపట్టి చక్కగా నిర్వహించని ప్రక్రియాలేదు. పిల్లలకు వినోదం కలిగించే కథలు మొదలు పండితవరేణ్యులు తల పంకించే వ్యాకరణ వ్యాఖ్యలవరకు — కథలు, గాథలు, నవలలు, నాటకాలు, కవితలు, అనువాదాలు, స్వోపజ్ఞాలు, విజ్ఞానదాయకాలు, జీవిత చరిత్రలు, యాత్రా చరిత్రలు, చరిత్ర పరిశోధకాలు, పదతత్త్వ పరిశీలకాలు, ఇలా — ఆయన లేఖిని పరవళ్ళు తొక్కింది. బులుసువారు 1907 డిసెంబర్ 24న విజయనగరంలో జన్మించారు. విజయనగరం సంస్కృత కళాశాలలో ఎనిమిదేళ్ళ చదివి సాహిత్య విద్యాప్రవీణలో. తర్వాత ఉభయ భాషాప్రవీణలో ఆంధ్ర విశ్వవిద్యాలయంలో సర్వ ప్రథములుగాను, బి.ఎ.కు సమానమైన ప్రొఫిషియెంట్ ఇన్ ఓరియంటల్ లాంగ్వేజస్ పరీక్షలోను ఉత్తీర్ణులయారు. విజయనగరంలో ఆయనకు సాహిత్య వ్యాకరణ గురువులు శ్రీ పేరి వేంకటేశ్వరశాస్త్రి, శ్రీ ఎస్. కె. వేంకటరామాచార్యులుగార్లు అలంకారశాస్త్ర గురువులు మహామహోపాధ్యాయ శ్రీ తాతా సుబ్బరాయుడు శాస్త్రిగారు. ఇంగ్లీషు, ఫైలాలజీల గురువులు శ్రీ పరవస్తు రామానుజస్వామిగారు. సాహిత్య విద్యా ప్రవీణులయిన పిదప విజయనగరం కోటలోని సంస్కృత లైబ్రరీలో లైబ్రేరియనుగా ఉన్నారు సంవత్సరంపాటు. పిదప రెండు సంవత్సరాలు కాశీ విశ్వవిద్యాలయంలో అలంకార శాస్త్ర పరిశోధన జరిపారు. అక్కడ ఆయనకు ఓరియంటల్ కాలేజీ ప్రిన్సిపాలు మహామహోపాధ్యాయ శ్రీ ప్రమథనాథ తర్కభూషణ్, మహామహోపాధ్యాయ శ్రీ దేవీప్రసాద్‌శుక్ల, బహుశాస్త్ర ప్రవీణులు శ్రీ బాలకృష్ణమిశ్ర పరిశోధన మార్గదర్శకులు. సంస్కృతంలోనే వుంటే, ఏ

# హైదరాబాదు నోట్‌బుక్

మహా మహోపాధ్యాయులో అయ్యేవారు. కాని, తెలుగమ్మకు సేవచేయాలనే సంకల్పంతో కాశీ నుంచి తిరిగివచ్చి, జీవిక కోసం మద్రాసులో కెల్లెట్ హైస్కూలులో ప్రధాన తెలుగు పండితులుగా ఇరవైరెండు సంవత్సరాలు, హిందూ థియలాజికల్ హైస్కూలులో పన్నెండేళ్ళు, వావిళ్ల సంస్థలో ఆరేళ్ళ ప్రధాన పండితులుగా పనిచేశారు. ఆనందా ప్రెస్‌వారు ప్రచురించిన చంద్రిక అనే సాహిత్య మాస పత్రిక సంపాదకత్వమూ నిర్వహించారు. సంస్కృతంలో పరిశోధన ఫలితంగా వెలువడినది అలంకార మార్గ సంగ్రహః ఈ పద్ధతితోనే ఆంధ్రాలంకార చరిత్రను పరిశోధన పత్రికలో మొదట ప్రచురించారు. అలంకారశాస్త్ర గ్రంథాల అనువాదంలో లక్షణాలకు తెలుగు లక్ష్యాలిచ్చి తర్వాతి వారికి



వరవడి పెట్టినవారాయనే. ఆయన పరిశోధన గ్రంథాలలో గజపతిరాజుల సాహిత్య పోషణము, వావిళ్లవారి వాఙ్మయసేవ అనే గ్రంథాలకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ బహుమతి లభించింది. సంస్కృతంలో రసాది చర్చలను గురించి కాశీ నుంచి వెలువడే సుప్రభాత పత్రికలోను, కలకత్తా సంస్కృతసాహిత్య పరిషత్పత్రికలోను, ఇతరత్రాను పెక్కు వ్యాసాలు రచించారు. బులుసువారు చాల వినయ సంపన్నులు. మహా మహులతో పోలిస్తే నాదేముంది? ఇదీ ఒక సేవా?— అంటారు. తమను ప్రోత్సహించిన వేటూరి ప్రభాకర శాస్త్రి, గన్నవరపు సుబ్బ రామయ్య, వావిళ్ళ వేంకటేశ్వర శాస్త్రి, శివలెంక శంభుప్రసాద్ గార్లకు, నార్ల వేంకటేశ్వర రావుగారికి, ఎస్. బి. పి. బి. కె. సత్యనారాయణ రావు (ఎం. ఎల్. సి.) గారికి కృతజ్ఞతాబద్ధులై ఉంటారు. బులుసువారు అజాతశత్రువులు. సాహిత్యంతో మతభేదాలను ఎంతో ప్రశ్రయంతో విషయైక దృష్టితో తెలుపడం ఆయన పద్ధతి. సాహిత్యమే జీవితంగా కుటీరం వంటి ఇంట్లో (34, పురుషోత్తమనగర్, కోంపేట, మద్రాసు—44) నివసిస్తూ, ఋషివలె నివసిస్తున్న బులుసువారు తమ సాహిత్య పథకాలు పూర్తిచేయాలి. వారిని భగవంతుడు మరి డెబ్బయ్యేళ్ళు వుండనివ్వాలి. ఎన్నో సన్మానాలు పొందారు, మరెన్నో పొందాలి.

### ఉపశ్రుతి

హైదరాబాదుకు వచ్చింతర్వాత హాయిగా వుందండీ నాకు — అన్నారు ఒకప్పుడు పత్రికల వారితో అప్పటి సమాచార ప్రజా సంబంధశాఖ డైరెక్టర్ శ్రీ నరేంద్రలూథర్. ఎందుకు? — అనడిగాడు ఒక పాత్రికేయుడు. నేను హిందూస్తానీ మాట్లాడుతూంటే లక్నోవారు లింగవచనాలు సరిగాలేవని తప్పులు పట్టేవారు. నే ప్రత్యయం పెద్దపులిగా వుండేది. హైదరాబాద్ హిందూస్తానీ విన్నతర్వాత భయంపోయి, హాయిగా వున్నాను — అన్నాడు నవ్వులమధ్య శ్రీ లూథర్.

— తిరుమల రామచంద్ర ★

## మధునాపంతులవారి వేంకట శేషశాస్త్రి అవార్డు

నిర్మాణాత్మక సాహిత్య కృషికి అంకితమైన ''రచన సాహిత్యవేదిక — కడప'' వారు క్రితం సంవత్సరం నుండి ఏర్పాటు చేసిన — మహాకవి గడియారం వేంకటశేషశాస్త్రి అవార్డు — 1983 కి—కళాప్రపూర్ణ శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారి గ్రంథం ''కేళాకూళి''కి లభించినది. బహుమతి మొత్తం ఐదు వందల రూపాయలు విజేతకు త్వరలో జరుగనున్న ప్రత్యేక సభలో అందజేయబడుతుందని కార్యవర్గం తరపున శ్రీ విహారి తెలియజేస్తున్నారు.

అవార్డు నిర్ణయంలో శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తి న్యాయ నిర్ణేతలుగా వ్యవహరించారు.

## ఆంధ్రకేసరి సంఘం

జోగాబ్ (హవురా) ప్రవాసాంధ్రులు 1974లో స్థాపించిన 'ఆంధ్రకేసరి సంఘం' ఆధ్వర్యములో సంఘ సభ్యులు కుటుంబ సమేతముగా 'శ్రీ వినాయక చతుర్థి' ఉత్సవాన్ని జరుపుకొన్నారు.

ఆ రోజు ఉదయం పూజ జరిగింది. సాయంకాలం సాంస్కృతిక కార్యక్రమములో సంఘ సభ్యులు, వారి పిల్లలు అత్యంత ఉత్సాహముతో పాల్గొని శాస్త్రీయ సంగీతము, లలిత సంగీతము, గ్రామీణ నృత్యాలు, 'నారద సంచారము' నాటికను ప్రదర్శించారు.

అనుబంధశాఖ ''బాల వికాస సభ'' ఆధ్వర్యములో ఏర్పాటు చేయబడిన చిన్నపిల్లల శ్లోక పఠనము, పద్య పఠనము ఆహూతులని విశేషంగా ఆకర్షించింది. (ఒ. వి.) ★

# సూటింగులు: పాలియెస్టర్, పాలియెస్టర్ బ్లెండ్ మరియు కాటన్

మంచి అభిరుచి.
తగిన ధరలు.

నేషనల్ టెక్స్టైల్ కార్పొరేషన్




(తమిళనాడు మరియు పాండిచెరి) లి
భారత సర్కారపు ఒక ఉద్యోగ సంస్థ

10/64 సోమసుందరం మిల్స్ రోడు, కోయమత్తూరు 641009

ఇండెంటింగ్ ఏజెంట్లు : ఆంధ్ర ప్రదేశ్ వాలాకీ టెక్స్టైల్ ఏజెన్సీస్, 3-4-394, టొబ్యాకో బజారు, సికింద్రాబాద్-500 003 (ఏ.పి.). సంగం టెక్స్టైల్స్ ఏజెన్సీస్, 230, మొదటి అంతస్తు, డి.బి. రోడ్డు, కోయంబత్తూరు-641 002. ఆర్.పి. డిస్ట్రిబ్యూటర్స్, 3-4-394, టొబ్యాకో బజారు, సికింద్రాబాద్-500 003 (ఏ.పి.).

MCA/NTC/85 TEL



*Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3, Editor : S. Radhakrishna.*

# నగరంలో వీడియోలు


ఏరా? చదువుకోకుండా రోజూ సిన్మాకెళ్తున్నావంట...?
అబ్బే లేదు డాడీ! కూల్‌డ్రింక్స్ తాగడానికెళ్తున్నానంతే!!
శేఖర్..


నీకిష్టం లేకపోయినా కూల్‌డ్రింక్ ఇక్కడే తాగాలిబాబు...అంతేగాని బయటకు తీసుకెళ్ళి అమ్ముకుంటానంటే ఎలా?


సార్! వీరికి కూల్‌డ్రింక్ అక్కర్లేదట! సినిమా మాత్రం చూస్తానంటున్నారు!!
"MAX MAD"
—ఎమ్వీఆర్—


వీడియోలొచ్చాక చాలా హాయిగా ఉందిరా! ఇంట్లో వాళ్ళకి తెలీకుండా ఎంచక్కా సినిమాలు చూడగల్గుతున్నాం!!


నిజమేనండీ! మామూలు సిన్మాలయితే ఏ హాల్లో ఏ సిన్మానో చెబుతాం-! వీడియో సినిమాలు ఏమాడుతున్నాయంటే చెప్పలేం!
టెలిఫోన్ ఎక్స్ఛేంజ్
ARUN


ఇందాక సిన్మా మూడ్‌లో పడిపోయి డ్రింక్ తాగటం మర్చిపోయాను! ఇప్పుడు ఇచ్చేస్తే........
TODAY
SS
SSSSS
SSS"X"
6.12.3.7.9

